
Rexona
Rexona
BLENDED WITH CADYL




## జీవిత భీమా మంచివ్యాపారము అని నేనెరుగుదును

నేను భద్రముగా నడుచుకొనునట్టి వ్యాపారిని, నా సొమ్మును మదుపు పెట్టిన విషయమందు జాగ్రత్తగానుందును చాలావరకు నా విజయమునకు అదేకారణము నేను మంచి పద్ధతులపై చిన్నవ్యాపారమును స్థాపించు కొని అందులో సంభవించెడు నష్టములపాలుగాకుండా స్వయంగా తగినంత భద్రతను యేర్పర్చు కొన్నాను.

పోటీ, శరీరరుగ్నత, తదితర పలువిషయములు నా వ్యాపారమును వి చ్ఛిన్నపర్చవచ్చును—కాని! నా జీవిత భీమావల్ల నాకు వచ్చుచున్న పెద్ద మొత్తమును ఏదిన్నీ అడ్డజాలదు ఏదైనా అత్యవసర పరిస్థితి తటస్థించినప్పుడు నా పాలిసీల హామీపైన తక్షణం అప్పు తీసుకోగలనని యెరుగుదును. గనుక ఆదనపు మనస్సంతుష్టి కూడగలదు

అట్టి సందర్భములో, ఈనాడు పలుమంది వ్యాపారుల విషయములో వలె నాకు జీవిత భీమాను ఎవరును అమ్మనక్కర్లేదు అనుటలో ఆశ్చర్యంలేదు నాకు వీలయినప్పుడల్లా జీవిత భీమాయందు ఇంకా ఎక్కువగా మదుపు పెట్టెదను—ఎందుకనగా అది ఒక్కటే తథావశ్యకాజాలనట్టి భద్రమైన్ని హామీ

"నాకు జీవిత భీమాయందు నమ్మికగలదు."

లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

సెంట్రల్ ఆఫీసు, ఓరియంటల్ బిల్డింగ్స్, ఫోర్ట్, బొంబాయి 1.

ASP/LIC




**Life Insurance Corporation of India**

దక్షిణప్రాంత కార్యాలయం యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగ్, పి ఓ బాక్సు నెం 281, మద్రాసు
ఆంధ్రరాష్ట్ర డివిజనల్ ఆఫీసులు మచిలీపట్టణం, హైదరాబాదు, ఆంధ్రరాష్ట్రమంతటా బ్రాంచి ఆఫీసులు గలవు.

సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

సంపుటము 51
సంచిక 16
19-12-56

సచిత్రవారపత్రిక

Founder K. NAGESWARA RAO

దుర్ముఖ మార్గశిర బహుళ ద్వితీయ బుధవారం

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : వైజయంతీమాల.

| | |
|---|---|
| న్యూఢిల్లీ లేఖ—"శ్రీకృష్ణ" | 5 |
| గ్రీకుల దేవత సైకీ— | 7 |
| తాసిల్దార్—డి రంగాచార్య | 13 |
| ఒకే ఒక గంతు—కవికొండల వెంకటరావు | 17 |
| భయంకరపరిశోధన—పిల్లా సుబ్బారావుశాస్త్రి | 19 |
| బుడుగు! చిచ్చుల పిడుగు!— | 20 |
| గాథానురాగం—పి. గణపతిశాస్త్రి | 23 |
| నానోరు—తరిగొప్పుల శాంతాదేవి | 27 |
| టిబెట్, నేపాల్, సిక్కిం, భూటాన్‌ల చరిత్ర | 28 |
| మంత్రాలు: సమ్మర్లాలు— | 31 |
| నా తొలిరచన—కొల్లూరి సుబ్బాయమ్మ | 33 |
| బాలసాహితి:—వి జయలక్ష్మి | 35 |
| కొత్తకథ—అలవర్తి వెంకట సుబ్బారావు | 36 |
| సముద్రంనీరుఉప్పగాఉందేం?—వై రామారావు | 38 |
| దాచవలసినమాట—అంట్యాకుల జోగారావు | 39 |
| పాకప్రవీణులు—ముట్టగుంట రామకృష్ణ | 40 |
| వనితాలోకం—"జయప్రద" | 44 |
| ఇందుగల రందులేరని— | 45 |
| సినిమా— | 49 |

# శ్రీరామ రక్ష

దేశమంతటా నిత్యావసర వస్తువుల ధరలు, నిత్యావసర వస్తువుల ధరలు కూడా, అంతూపొంతూ లేకుండా, పెరిగిపోతున్నవి నిత్యావసరాలతో నిమిత్తం లేని ఏ విలాసవస్తువుల ధరలో పెరిగిపోతే, కలవారు మాత్రమే గోల పెడతారు నిత్యావసర వస్తువులధరలు పెరిగిపోతే, సామాన్య సంసారాలన్నీ తల్లడిల్లి పోవలసి వస్తుంది ఇప్పుడు జరుగుతున్నపని ఇదే ఇతర ప్రదేశాలలో ధరలు పెరగడం మాత్రమే జరుగుతున్నది, ఆంధ్రప్రదేశ్ రాజధానిలో అవి మండిపోతున్నవి బియ్యం, ఉప్పు, పప్పు, మొదలైన పదార్థాలధరలు మండిపోతూండడంవల్ల రాజధానికి చేరుకున్న ఆంధ్రఉద్యోగులు నానావస్థలూ పడుతున్నారు అధికార్లు చౌకదుకాణాలు పెట్టారు రోజుకు మూడువందల బస్తాలబియ్యం దుకాణాలకు సప్లయి అయ్యేట్లు చూస్తామన్నారు అయినా ధరలు తగ్గడంలేదు సరికదా, మరీ పెరిగిపోతున్నవి ఉద్యోగుల గగ్గోలు కూడా పెరిగిపోతున్నది బంట్రోతుల మొదలు మంత్రులవరకూ అందరూ జీతాలు చాలని స్థితిలో పడ్డారు అయితే ముఖ్యమంత్రి మాత్రం ఈధరలు పెరగడమన్నది తాత్కాలికమేననీ, త్వరలోనే పరిస్థితి సర్దుబాటువుతుందనీ ఉద్యోగులను ఓదారుస్తున్నారు ఇది 'పాతకొత్తల మధ్యకాలం' కాబట్టి ధరలు పెరగడంలో ఆశ్చర్యం లేదంటున్నారు, కొత్తధాన్యం చేతికి అందగానే ధరలు వాటంతటవే తగ్గుముఖం పెడతవని అభిప్రాయిస్తున్నారు ఈ ఓదార్పు మాటలను విశ్వసించలేకపోతున్న సచివాలయపు సిబ్బంది పరిస్థితికి తట్టుకోలేక పాత హైదరాబాదు ఉద్యోగులకు ఇస్తున్నట్లే ఇతర చిన్నపెద్ద గుమాస్తాలందరికీ కూడా వేతనాలు ఇప్పించవలసిందని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసుకున్నారు కేంద్ర ప్రభుత్వం ఇస్తున్న వేతనాలను ఏర్పాటు చేయవలసిందనీ, అదివీలుగాని పక్షంలో వేతనాల సమస్యను పరిశీలించడానికి ఒక సంఘాన్ని నియమించవలసిందనీ కూడా కోరుతున్నారు చిన్న ఉద్యోగుల వేతనాల సమస్యను సాధ్యమైనంత త్వరలో పరిష్కరించకపోతే, పరిస్థితులు విషమించే ప్రమాదం వున్నది. హైదరాబాదు ఆంధ్ర ఉద్యోగుల వేతనాలను సమన్వయ పరచడానికి, వాటి వ్యత్యాసాలను సరిదిద్దడానికి ఒక పరిశీలక సంఘం ఏర్పడుతుందని హైదరాబాదు మాజీ ముఖ్యమంత్రి ఇదివరకే హామీ ఇచ్చారు ఆ హామీని త్వరగా అమలుపరచడం రాష్ట్ర ప్రభుత్వ కనీస ధర్మం



చిరయశస్వి శ్రీరాములు
వర్ధంతి ఈనెల 15

* * *

తెలంగాణా ప్రాంత పరిపాలనావ్యవహారాల నిర్వహణకు, ఆంధ్ర ప్రాంత పరిపాలనా వ్యవహారాల నిర్వహణకు మధ్య తరతరాలనుంచి వస్తున్న కొన్ని వ్యత్యాసాలు, ప్రధానమైనవే, వున్నవి అక్కడి పద్ధతులు వేరు, ఇక్కడి పద్ధతులు వేరు వీటిని సమన్వయపరచవలసిన బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వం స్వీకరించి అందుకు అనుగుణంగా వ్యవహరిస్తున్నది సచివాలయ నిత్య కార్యక్రమ నిర్వహణను ఆంధ్ర ప్రాంతంలో అమలులో వున్న నిబంధనల ప్రకారమే సాగించడానికి నిర్ణయించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కార్యాలయంలో పనిచేస్తున్న హైదరాబాదు ఉద్యోగులు ఆంధ్రప్రభుత్వపు పద్ధతులను అర్థంచేసుకోడానికీ, వాటి ప్రకారమే తమ బాధ్యతలను నిర్వర్తించడానికీ, కలిసి మెలిసి పని చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఒకరినొకరు అవగాహన చేసుకుంటున్నారు ఇది ఎంతైనా శ్లాఘించ వలసిన విషయం అయితే ఆంధ్ర విధానాలను వారు అర్థంచేసుకోడానికి కొంత వ్యవధి విధిగా పట్టితీరుతుంది. ఈ పరిస్థితులలో కొంతకాలంపాటు ప్రభుత్వ వ్యవహారాలు కలగా పులగంగా నడవడం అనివార్యం ఆంగ్ల భాషగాని, తెలుగుగాని బాగా తెలియని ఉద్యోగులు కొందరు వుండడంచేత, ఆయా శాఖాధిపతులకు కొన్ని నివేదికలు ఇప్పటికీ ఉర్దూలోనే రావడం కూడా సహజం

ఇంతకు పై ఉద్యోగులు చిన్న ఉద్యోగులను (తెలంగాణా వారిని) చీదరించుకొని, చిన్నచూపు చూడడం జరుగుతున్నదనీ, మీ డిగ్రీలు కూడా ఒకడిగ్రీ లేనా అని విమర్శించడం జరుగుతున్నదనీ వినికిడి పరిస్థితులలో ఏవైనా అవకతవకలు జరిగినప్పటికీ, ఈ విధంగా విమర్శించడం యోగ్యమనిపించుకోదు సభ్యతకుగాని, సఖ్యతకుగాని, రాష్ట్ర భవిష్యత్ శ్రేయస్సుకుగాని ఇలాంటివిమర్శలు సహాయపడవు ఎవరికి వున్న పరిస్థితులను బట్టి, సౌకర్యాలనుబట్టి వారు పట్టభద్రులవుతుంటారు లేనివి రమ్మంటే రావు, వున్నవి పొమ్మంటే ఒకపట్లపోవు కాలక్రమేణా గాని వ్యవహారాలు సర్దుబాటుకావు, పై ఉద్యోగులు సహనం ప్రదర్శించవలసిన సమయంలో చిర్రుబుర్రులాడినందువల్ల ప్రయోజనంలేదు అక్కడికి మనం విజేతలగా వెళ్ళలేదన్న విషయం మరిచిపోకూడదు చిన్న తమ్ముడి ఇంటికి వెళ్ళిన మనం అతడినే చిన్నచూపు చూడడం భావ్యంకాదు

* * *

హైదరాబాదులో ఆంధ్ర ఉద్యోగుల (ఇక్కడినుంచి వెళ్ళినవాళ్ళ) పిల్లల విద్యాభ్యాసానికి ప్రభుత్వం అవసరమైన ఏర్పాటు చేసింది నాన్‌గెజెటెడ్ ఉద్యోగులపిల్లలకు ఉచిత విద్యాభ్యాస సౌకర్యం పాత ఆంధ్రజిల్లాలలో అమలులో వుంది ఫీజు కట్టవలసిన పనిలేదు వీళ్ళందరూ తిరిగి హైదరాబాదులో సంవత్సరం మొదటినుంచీ స్కూలుఫీజు కట్టవలసి వుంటుందని కొంతమంది అధికార్లు వత్తిడిచేస్తున్నటు తెలిసినందువల, ఆ విధంగా ఫీజు వసూలు చేయవలసిన అగత్యంలేదని రాష్ట్రప్రభుత్వం ఉత్తర్వు చేసింది మంచిదే

చిన్న ప్రభుత్వోద్యోగుల పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యాలను కలుగజేయడమేగాక, మూడవ ఫారంవరకూ పిల్లలందరికి విద్యాభ్యాసం ఉచితంగా ఉండాలని కూడా ఆంధ్ర ప్రభుత్వం ఈ సంవత్సరారంభంలో ఉత్తర్వు చేసింది సెకండరీ దశవరకూ సర్వసర్వత్రా విద్యాభ్యాసం ఉచితంగా వుండడం అవసరమనే లక్ష్యాన్ని అనుసరించి



# శ్రీరామరక్ష



అసలు జరిగిన ఉత్తర్వే ఇది ముమ్మందుగా ఒకటో ఫారం విద్యార్థులకు ఈ ఉత్తర్వును పదకొండు తెలుగుజిల్లాల్లో వర్తింపజేశారు వచ్చే జూన్‌నుంచి 2 వ ఫారానికీ, ఆపై ఏడాది 8 వ ఫారానికి వర్తింపజేస్తారు ఇప్పుడు ప్రభుత్వం ఈ ఆదేశాన్ని కొంతవరకు మార్చివేసినట్లు వార్తలు వస్తున్నవి ఒకటో ఫారంలో ఒకసారి తప్పిన విద్యార్థులందరూ స్కూలుఫీజు కట్టవలసి వుంటుందన్నదే ఈ మార్పు ఈ మార్పును సంవత్సరం మొదటో చెప్పకుండా, విద్యాసంవత్సరం ఆఖరవుతున్న ఈ సమయంలో చెప్పినందువల్ల అనేక చిక్కులు, అవరోధాలు ఏర్పడుతున్నవి అనేకమంది బీద విద్యార్థులు ఒకేసారి పాతిక రూపాయల బకాయి కట్టలేక అసలు విద్యాభ్యాసానికే స్వస్తి చెప్పే ప్రమాదంవున్నది ప్రజాస్వామ్యం, విద్యావ్యాప్తి అన్నవి రెండూ అవినాభావ సంబంధమైన లక్ష్యాలు. విద్యావ్యాప్తికి విఘాతం కలిగించడం ప్రజాస్వామ్య విజయానికి విఘాతం కల్పించడమే అవుతుంది ఉన్నత లక్ష్యంతో ప్రవేశపెటిన ఉత్తమ ఉత్తర్వును ఇప్పుడు ఈవిధంగా మార్పు చేయడం హ్రస్వదృష్టికి నిదర్శనం ప్రభుత్వం ఈమార్పును ఎంతత్వరగా ఉపసంహరిస్తే అంతమంచిది

* * *

నిర్ణీతమైన పథకంప్రకారం నడుచుకున్నప్పుడే, మనం ఏకార్యక్రమంలోనైనా విజయాన్ని సాధించగలుగుతాము నిర్ణీతమైన పథకం ఒక వ్యక్తి జీవితంలో ఎంత ప్రధానమైన స్థానాన్ని ఆక్రమిస్తుందో, ఒక జాతిజీవితంలోనూ అంతే ప్రధానమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది అందుచేత ఆర్థిక, సామాజిక అభ్యుదయాన్ని సాధించ సంకల్పించిన ప్రతిజాతీ నిర్ణీతమైన పథకానికి కట్టుబడి వ్యవహరించక తప్పదు.





అంబేద్కర్

భారత రాజ్యాంగరచనలో
ప్రముఖ పాత్ర వహించిన వీరు
6 వ తేదీన మరణించారు

ఇందుకు మన పంచవర్షప్రణాళికలే నిదర్శనాలు ప్రణాళికలద్వారా ఆర్థికాభ్యుదయాన్ని సాధించడానికి జరుగుతున్న కృషిని, విద్యార్థులు చక్కగా అర్థం చేసుకోవాలన్నారు, కేంద్ర మాజీ ఆర్థిక మంత్రి శ్రీ దేశ్‌ముఖ్ (విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘ అధ్యక్షులు) మొన్న 8 వ ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టభద్రుల స్నాతకోత్సవసభలో విద్యాభ్యాసంచేసే కాలంలో విద్యార్థులు తమకు లభించే సదవకాశాలను ఏమాత్రం పోగొట్టుకున్నా, దుర్వినియోగం చేసినా వారు జీవితాంతంవరకూ క్లేశపడవలసి వస్తుందనికూడా ఆంధ్ర పట్టభద్రులకు శ్రీ దేశ్‌ముఖ్ హెచ్చరిక చేశారు ఇది కేవలం పట్టభద్రులైనవారికేగాని, అచిరకాలంలో పట్టభద్రులు కాబోతున్న వారికేగాని వర్తించే హితోక్తులు కావు ప్రతి విద్యార్థీ పాటించదగినవి

విశ్వవిద్యాలయ పట్టభద్రులకు స్నాతకోపన్యాసం ఇవ్వడం తమకు ఇదే మొదటి సారి అని చెప్పుకున్నప్పటికీ, శ్రీ దేశ్‌ముఖ్ విశ్వవిద్యాలయ వ్యవహారాలపట్ల శ్రద్ధాసక్తులు లేనివారు కారు అందుచేత వారి సలహాలు త్రోసివేయదగినవి కావు

ఇటీవల విద్యార్థులలో విద్యాభ్యాసంపట, విజ్ఞాన సముపార్జన పట్ల ఆసక్తి, శ్రద్ధ క్షీణించి పోయినవనీ, వారిలో క్రమశిక్షణ బాగా లోపించిందనీ అప్రతిష్ఠ ఏర్పడింది ఇది నిరాధారమయిన అప్రతిష్ఠ కాదని దేశములో చెలరేగిన అనేక సంఘటనల వల్ల ఋజువవుతున్నది

శ్రద్ధాసక్తులు తగ్గడానికీ, క్రమశిక్షణ లోపించడానికీ విద్యార్థులలో కూడా నానాటికీ పెరిగిపోతున్న నిరుద్యోగ పరిస్థితే చాలావరకు కారణం కావచ్చు ఏ ఉన్నత విద్య నభ్యసించినా, నిర్వ్యాపారత్వం తప్పదనే నిస్పృహ ఎప్పుడు ప్రారంభమవుతుందో అప్పుడే రకరకాల అవలక్షణాలు తల ఎత్తే ప్రమాదం వున్నది

ప్రథమ పంచవర్ష ప్రణాళిక సమాప్తమయేనాటికి దేశంలోని వివిధ విశ్వవిద్యాలయాలలోనూ దాదాపు ఏడున్నర లక్షల మంది విద్యార్థులున్నారు. ఏటేటా 60 వేల మంది పట్టభద్రులవుతున్నారు దేశంలో ఈనాడు దాదాపు ఐదున్నర లక్షలమంది విద్యాధికులు నిరుద్యోగులై వున్నారు. ఈ సంఖ్య ఆ ఏటికాఏడు పెరిగిపోతున్నది కూడా వీరే గాక, మిగతా నిరుద్యోగులు కూడా అసంఖ్యాకంగా వున్నారు

ఈపరిస్థితులలో ఎవరు నిస్పృహ చెందరు? వీటికి ప్రభుత్వం తగిన విరుగుడు ఆలోచించినప్పుడే, విద్యాభ్యాసాన్ని, విద్యార్థులను చైతన్యవంతం చేయడానికి సాధ్యపడుతుంది

* * *

"తెలుగు ప్రజలకు ప్రత్యేక రాష్ట్రమైతే వచ్చింది కాని, రాష్ట్రాభ్యున్నతికి నిర్మాణాత్మకంగా చేయవలసిన కృషినిగురించి ఆలోచించే తీరికమాత్రం మన నాయకులకు వున్నట్లు కనబడదు పదవులకు సంబధించిన వ్యవహారాలను సర్దుబాటు చేసుకోవడంలోనే వారు నిమగ్నులవుతున్నారు," అన్నారు ఉస్మానియా విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు డా॥ సూరిభగవంతం, మొన్న 8 వ నిజాంకళాశాల (హైదరాబాదు) ఆంధ్రాభ్యుదయోత్సవాలకు అధ్యక్షత వహిస్తూ

పదవులకోసం తాపత్రయంలో క్రొత్తేమున్నదీ? పదవి పుట్టినప్పుడే, దానికోసం తాపత్రయమూ పుట్టిందంటే ఆశ్చర్యం లేదు సమర్థులైనవారు పదవులకు తాపత్రయపడినా అది ఒక అందమే, అసమర్థుల తాపత్రయం అన్ని అందాలా చేటు ఇంతకూ ఉస్మానియాకు క్రొత్త ఉపాధ్యక్షులెవరు?

★

11-12-56

—భార్గవ ]

#  న్యూఢిల్లీ లేఖ 

వంతుల చొప్పున హెచ్చించాలని ఒత్తిడి చేస్తున్నారు. ఈ పరిశ్రమలలో రైల్వే, బొగ్గు పరిశ్రమలు కూడా ఉన్నాయి. మరొకప్రక్క ఆర్థికమంత్రి ద్రవ్యోల్బణాన్ని అరికట్టడానికి కొత్తపన్నులను ప్రతిపాదించారు.

మొదటి పంచవర్ష ప్రణాళిక ఫలితంగా దేశం అభివృద్ధి అయిందని కార్మిక నాయకులు అన్నారు. ఈ అభివృద్ధిలో కార్మికులకు వాటాదక్కలేదనీ, అందుచేత ఏడు పరిశ్రమలలోని కార్మికులకు జీతం నూటికి 25 వంతుల చొప్పున ఎక్కువ చేసి వారివాటా వారికివ్వాలని కార్మిక నాయకులు వాదిస్తున్నారు.

పౌరులంటే ధనవంతులొక్కరే కాదు; అసంఖ్యాక ప్రజలు కూడా పౌరులే. ఈ అసంఖ్యాకులు చేసిన నేరమేమిటంటే సుసంఘటితులై వీరు అలజడి చేయలేరు వీరే కష్టపడి పనిచేసి భారతదేశాన్ని అభివృద్ధి చేశారు. ఈ నోరులేని జనులవల్లనే పెట్టుబడిధనం పోగుపడడానికి అవకాశం కలుగుతోంది. అందుచేత సామ్య సిద్ధాంతం ప్రకారం, ఈ అసంఖ్యాక జనులు చెల్లించే పన్నులను నూటికి 25 వంతుల చొప్పున తగ్గించడం, తద్వారా భారత ఆర్థికాభివృద్ధిలో వారికి కూడా వాటా ఇవ్వడం అవసరం కాదా? స్వాతంత్ర్యసిద్ధి తరవాతనుంచీ మునిసిపల్, రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలు విధించిన అదనపు పన్నులు అందరికీ తెలిసినవే నూటికి 25 వంతుల చొప్పున పన్నులుతగ్గిస్తే అసంఖ్యాకులైన స్వల్పాదాయ పరులకు ధరల పెరుగుదల మూలంగా కలిగిన దురవస్థను కొంతలో కొంత తగ్గించినట్లు అవుతుంది గదా?

మొదటి పంచవర్ష ప్రణాళిక వలన కలిగిన అభివృద్ధిని ఎవరికి ఏ నిష్పత్తిలో ఎలా పంచాలి? జీతం నాలుగో వంతు పెంచాలని కోరే ఏడు పరిశ్రమల కార్మికులు ఈ అభివృద్ధికి ఏ నిష్పత్తిలో బాధ్యులయ్యారు? ప్రభుత్వం ఇదంతా తెలియపర్చాలి. అసలు ప్రతి పరిశ్రమలోని కార్మికులకూ ఎంతెంత ముడుతున్నదీ, వారికే విధమైన చట్ట రక్షణలున్నాయి, ముఖ్యంగా వ్యవసాయ కార్మికుల కంటె పారిశ్రామిక కార్మికులకు ఏ అదనపు లాభాలు కలుగుతున్నాయి, ఇవన్నీ కూడా ప్రభుత్వం లెక్కవేసి ప్రకటించాలి

భారతపౌరులందరినీ సమానంగా చూస్తామని భారతరాజ్యాంగం హామీఇచ్చింది అయితే—వ్యవసాయ కార్మికులు, పారిశ్రామిక కార్మికులు, ఈ రెండుతరగతుల కార్మికులలో ఏతరగతివారికి గృహసదుపాయాలు ఎక్కువలభించాయి? 1947 ఆగస్టు 15 తరవాత ఏ పరిశ్రమలో కార్మికులు ఎంతెంతగా ఉత్పత్తిని పెంచారో లెక్కవేసిచూస్తే రంగుబయట పడుతుంది పారిశ్రామిక కార్మికులకు సౌకర్యాలు కలగజేయడానికి కొన్నికోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నారు. వారిహక్కుల రక్షణకు బోలెడుశాసనాలు చేస్తున్నారు కాని వ్యవసాయ కార్మికులకు కనీసవేతనాలు నిర్ణయించడానికి వీసమైనా ప్రయత్నాలు జరగలేదు. స్వాతంత్ర్యసిద్ధి తరవాత భారత దేశం సాధించిన అభివృద్ధికి వ్యవసాయ కార్మికులుచేసిన సహాయమే గొప్పదని అందరూ అంగీకరిస్తారు. అయితేనేం వారి అతీగతీ పట్టించుకునేవా రెవరూ లేరు. ఎందుచేతనంటే, వీరు సుసంఘటితులు కారు; గలాటా చెయ్యలేరు. అందుకని.



నవభారతనిర్మాణంలో ప్రముఖపాత్రధారి
స్వర్గీయ వల్లభ్‌భాయ్‌పటేల్
[వర్థంతి : డిసెంబరు 15]

భారతప్రభుత్వం ఒక వంక, డివిడెండ్లను 6% కు పరిమితంచేస్తూ, తద్వారా లక్షలాది చిన్నపెట్టుబడిదార్ల ఆదాయాన్ని పరిమితం చేస్తోంది. మరొకవంక ఆ ప్రభుత్వమంత్రులే ఇద్దరు కార్మికుల జీతాలను నూటికి 25 వంతుల చొప్పున పెంచాలనే కోర్కె సమంజసమైనదేనని బాహాటంగా చాటుతున్నారు

ప్రతి పౌరుడూ ఖర్చుతగ్గించుకోవాలని కాంగ్రెసు, ద్రవ్యోల్బణం అరికట్టడానికే కొత్తపన్నులను తాను ప్రతిపాదిస్తున్నానని ఆర్థికమంత్రి ఒక ప్రక్క ప్రకటిస్తూనే ఉన్నారు. మరో ప్రక్క పెట్టుబడి సేకరణకు ఏమీతోడ్పడని వర్గంవారికి ఎక్కువ జీతం ఇవ్వాలనే ఒత్తిడికి తలొగ్గుతున్నారు.

పారిశ్రామిక తగాదాలను పరిష్కరించడానికి ప్రభుత్వం కొన్ని ఏర్పాట్లుచేసింది. బాగానే ఉంది. బొగ్గుగని కార్మికుల తగాదాపై ఈమధ్య తీర్పు ఇవ్వబడింది. ఈ తీర్పు ఇంకా అమల్లోకి వస్తూఉంది. ఆ తీర్పు తమకు నూటికి నూరుపాళ్ళు నచ్చితేనే కార్మికులు దాన్ని మన్నిస్తారు. ఆ తీర్పును సవరించాలంటే కార్మికుల అనుమతి తీసుకుని, వారికి నచ్చేవిధంగా సవరించాల్సిందే. ఇంతవరకూ బొగ్గు కార్మికులు తీర్పును సవరించమని అడగలేదు. తీర్పు అమలులోకి రాబోతున్న కాలంలో, నూటికి 25 వంతుల చొప్పున జీతాలను ఎక్కువచేయాలని కార్మిక నాయకులు ఒత్తిడిచేయడానికి వీలున్నపక్షంలో, అసలు ఈ కార్మిక తగాదా పరిష్కార సంఘాలెందుకు? ఈ తీర్పులెందుకు? డబ్బు దండగకు కాకపోతే?

కొన్ని కొన్ని ట్రేడ్‌యూనియన్లను చూస్తుంటే అవి కార్మికులకు ఎంతవరకూ ప్రాతినిధ్యం వహిస్తాయి అని అనుమానం కలుగుతుంది ద్వితీయ ప్రణాళికకుగాను భారతదేశానికి విదేశీ ద్రవ్యం ఎంత వీలైతే అంత కావాలి. అంటే మనం ఉత్పత్తిచేసే వస్తువులు విదేశీ మార్కెట్‌లో పోటీకి తట్టుకుని నిలబడాలి. దేశంలోని ప్రజలు పంచదారకు ఎక్కువ ధర చెల్లించేలాగు ప్రభుత్వం చెయ్యగలదు. విదేశీయులచేత అలా చెయించలేదు—మన ధరలు సరసంగాను, వస్తువులు నాణ్యంగాను ఉంటేతప్ప. రైల్వేవాళ్ళకీ నాలుగోవంతు జీతం పెంచి, బొగ్గుకార్మికులకీ నాలుగోవంతు జీతం పెంచి, వస్త్ర కార్మికులకూ నాలుగోవంతు జీతం పెంచితే బట్టల ధరలు ఏమైపోతాయిట?

ఆగ్నేయాసియా, మధ్యప్రాచ్యం, ఆఫ్రికాదేశాలలో జపాన్ బట్టలపై దిగుమతి కంట్రోళ్లులేవు, బొగ్గు, రైల్వే కార్మికుల జీతాలు పెంచితే, రవాణా ఖర్చు ఎక్కువ కావటం, అదే నిష్పత్తిలో భారతీయ వస్తువుల ధరలు ప్రియమైపోవడం జరుగుతుంది.

రైల్వే, బొగ్గు, సిమెంటు, ఇంజనీరింగు పరిశ్రమల కార్మికులకు జీతాలు పెంచితే ద్వితీయ ప్రణాళికకు అంచనా వేసినా వ్యయ ధనం కూడా పెరగక తప్పదు ధనం అంత తేలికగా లభ్యమయ్యేది కాదు గనక, ప్రణాళిక లక్ష్యాలను తగ్గించుకోవలసివస్తుంది. అంటే చివరికి ఉద్యోగాలు తగ్గిపోతాయన్న మాట.

కార్మికవర్గంలో అసంతృప్తి ఎక్కువ కావడానికి కారకులెవరో గాని, వారిని దండించాలి. 

# గ్రీకుల దేవత సైకీ

అనగనగా ఓరాజు ఆ రాజుకు ముగ్గురు కూతుళ్లు అక్కచెల్లెళ్లందరు అందంగా ఉండటం చాలా అరుదు ఆ ముగ్గురు అక్కచెల్లెళ్ళు అందగత్తెలే వారందరిలోను సైకీ మరీ అందగత్తె

ఆమెను చూసినవాళ్ళంతా ఆమె ఎవరో దేవత అనీ వేషమైనా మార్చుకుండా అలాగే భూలోకానికి దిగివచ్చిందనీ ఆశ్చర్యపోయేవారు దేశదేశాలనించి జనం ప్రత్యేకంగా ఆమె అందం చూచి ఆనందించడానికే వచ్చేవారు ఆ అందం చూసి అలాగే రాతి బొమ్మల్లాగ నిలబడి పోయేవారు

అసలు వీనస్ దేవత అందానికి పెట్టింది పేరు ఆమె కూడా సైకీ ముందుదిగదుడుపే అని అందరు అనుకొనేవారు అప్పటినించీ వీనస్ ఆలయంలో పూజా పునస్కారా లాగిపోయాయి ఒకవేళ ఎవరైనా వీనస్ దేవాలయంలో పూజలు చేసినా వారి మనస్సులలో సైకీ అందమే మెదులుతూ ఉండేది క్రమంగా జనం వీనస్ దేవత మాటే మరిచిపోయారు మరి కొంత కాలానికి ఆమె దేవాలయం పూర్తిగా పాడుపడిపోయింది వీనస్ దేవతకు జరిగే గౌరవాలు, మర్యాదలు అన్నీ క్రమక్రమంగా సైకీ రాజకుమార్తెకే అంకితమైపోయాయి

దీనితో వీనస్ ఒళ్లు మండిపోయింది ఆమె కేదైనా ఇబ్బంది వస్తే కుమారుడు క్యూపిడ్‌తో సంప్రతిస్తూ ఉంటుంది

అతనికి చిత్రచిత్రమైన రెక్కలున్నాయి అతని బాణాలు తగిలాయంటే ఎలాంటి వారైనా ప్రేమతో పేలాలు వేగినట్లు వేగిపోవలసిందే! భూలోకంలోగాని, స్వర్గలోకంలోగాని ఎవరు అతని బాణాల ధాటికి తట్టుకోలేదు

వీనస్ దేవత ఒకనాడు అతని దగ్గరికి వెళ్లి తనకి జరిగిన అవమానం అంతా వెళ్ళబోసుకుంది

“సైకీ ఎల్లాగైనా అనాకారిగా ఉన్న ఒక దుర్మార్గుణ్ణిచూసి మోహించి వెళ్లి వేసుకునేటట్లు చెయ్యి నాయనా!”

అని బతిమాలుకుంది ఆ తరవాత తన కొడుకును సైకీ ఉన్న చోటుకు తీసుకుపోయి అతిరహస్యంగా ఆమెను చూపించింది

[గ్రీకుల పురాణగాథలకూ, మనపురాణగాథలకు కొంచెం దగ్గర పోలికలున్నాయి గ్రీకుల క్యూపిడ్ మన మన్మథుడు లాంటివాడు వీనస్ గ్రీకుల సౌందర్య దేవత క్యూపిడ్ వీనస్ కుమారుడు ఇది గ్రీక్ పురాణాలలోని, సైకీ క్యూపిడ్ దేవతల ప్రణయ గాథ]

క్యూపిడ్ ఆమె అందం చూచి నిర్ఘాంతపోయి నిలుచున్నాడు అతనికి తన బాణాలే తన గుండెల్లో గుచ్చుకున్నట్లయింది అయితే పైపైకి ‘అలాగే నీవు చెప్పినట్లే చేస్తానులే!’ అని తల్లికి నచ్చచెప్పాడు సైకీ అక్కలిద్దరినీ ఇద్దరు రాజకుమారులు వివాహం చేసుకున్నారు సైకీ నందరు చూచి ‘ఆహా! ఏమి చక్కని చుక్క’! అని ఆశ్చర్యపోయేవారు అంతేగాని ఎవరు ఆమెను వివాహం చేసుకోడానికి ముందుకు రాలేదు

తల్లిదండ్రులు ‘తమ కుమార్తె కింతకాలానికీ వివాహం కాలేదే’ అని చాలా బెంగ పెట్టుకున్నారు ఒక నాడు అపోలో దేవాలయానికి వెళ్ళారు అశరీరవాణిని ప్రశ్నించి ఆ సలహా ప్రకారమే నడుచుకుందామని అనుకున్నారు వారడిగిన ప్రశ్నలకు సమాధానం వచ్చింది గాని అది చాలా భయంకరంగా వినిపించింది

“సైకీ విచార సూచకమైన దుస్తులు వేసుకోవాలి తల్లిదండ్రులామెనో పెద్ద కొండగుట్ట మీదికి తీసుకుపోయి నిస్సహాయంగా విడిచిపెట్టి వెయ్యాలి రెక్కలున్న ఒక భయంకర సర్పదేవత ఆమెకు భర్త కాగలడు! అతడు దేవతలందరికన్నా మహా బలశాలి! ఇక ఆమె గతి అంతే!”

అదివిని సైకీ తల్లిదండ్రుల చాలా దుఃఖించారు ఇక చేసేదేమీ లేక సైకీ చేత నల్లని దుస్తులు తొడిగించారు సమాధిదగ్గరికి తీసుకుపోయినట్లుగా ఆమె నా కొండగుటమీదికి తీసుకువెళ్ళి ఏకాకిగా విడిచిపెట్టి ఏడుస్తూ తిరిగివచ్చారు తిరిగివెళ్ళేముందు సైకీ వారిని ఓదార్చింది

“మీరేం చెయ్యగలరు? నా అందం చూసి ఓర్వలేక దేవతలే నామీద పగబట్టినట్టున్నారు ఇక నాగతి ఇంతే!”

పాపం సైకీ తండ్రులామెను విడవలేక విడవలేక విడిచి వెళ్లిపోయారు సైకీ మరి గత్యంతరం లేక ఆ కొండగుటమీదే అలాగే గుండెరాయి చేసుకుని కూర్చుంది

కొంత సేపటికి హాయిగా పైరుగాలి వీచింది ఆగాలి సోకగానే ఆమెపంచప్రాణాలు లేచి వచ్చాయి. మెల్లమెల్లిగా సైకీ ఆగాలిలో తేలిపోయింది ఆమె ఆ అద్భుతానికెంతో ఆశ్చర్యపడింది గాలి మెల్లిగా ఆమెనొక పచ్చని పసిరి పచ్చిక పరుపు మీద పడుకోబెట్టింది అది మెత్తని దూదిపరుపు కన్నా బాగా ఒత్తుగా ఉంది ఆ ప్రాంతం అంతా అప్పుడే విచ్చిన పువ్వుల పరిమళం ఘుమ ఘుమ లాడిపోయింది ఆ పరిమళాలలో సైకీ తన కష్టాలన్నీ మరిచిపోయి హాయిగా నిద్రపోయింది

తరవాత కొంతసేపటికి సైకీకి మెలకువ వచ్చింది కళ్లు తెరిచి చూచేసరికి ఆమెకు చుట్టూ ఉన్నవన్నీ మారిపోయాయి పక్కనే ఒకనది ప్రవహిస్తూంది నదీతరంగాల సంగీతం ఎంతో ఇదిగా వినిపించింది ఆనది ఒడ్డున పెద్ద పాలరాతి మేడ కనిపించింది అది ఏదో దేవతలుండే భవంతిలా కనిపించింది ఆ మేడలో కనిపించినవన్నీ బంగారు స్తంభాలే! గోడలమీద నవరత్నాల కాంతులు తళ తళా మెరిసిపోయాయి

అయితే ఆ మేడలో ఎవరూ ఉన్న అలికిడి వినిపించలేదు

సైకీ అది చూచి ఆశ్చర్యపోతూ నెమ్మదిగా లోపలికి నడిచివెళ్ళింది అక్కడ కూడా ఆమె కెవరు కనిపించలేదు

కాని చిత్ర చిత్రమైన ధ్వనులు, పిలుపులు వినిపించాయి ఆమేడ ఆమెకోసం ఏర్ప

అనువాదం: “వినాయక”



సైకీ నిద్రపోతున్న క్యూపిడ్ కేసి చూసింది.

# ★ గ్రీకు కులదేవత సైకీ ★

దివికే అని సైకీకి అక్కడ అన్ని సదుపాయాలు అమరి ఉన్నాయనీ, ఆమె సుఖంగా ఆ మేడలో ఉండవచ్చునని ఆ ధ్వనులు ఆమెతో చెప్పాయి. సైగా నీకేమి కావలసినా చేయటానికి సిద్ధంగా ఉన్నామనీ మేమంతా నీ సేవకులమేనని అని ఆమె చెవిలో ఊదాయి

ఆమె హాయిగా స్నానం చేసింది. ఘుమ ఘుమలాడే పిండివంటలతో భోజనం చేసింది. ఆమె చుట్టూ వాయించే పిల్లన గ్రోవులూ వాదులూ ఉన్నట్టుగా తీయని సంగీతం వినిపించింది అప్పుడప్పుడామె కు గాలిలో ఎంతో హాయిగా సన్న సన్నని పిలుపులు వినిపిస్తూండేవి. ఇక రాత్రి కాగానే తనభర్త రావచ్చునని సైకీ అనుకుంది.

సరిగా అదే జరిగింది. ఆమెభర్త కంటికి కనిపించకపోయినా పక్కనే ఉండి ఆమెతో సరదాగా మాట్లాడుతున్నట్లనిపించింది.

అంతేగాని ఆ భయంకర సర్పంగాని దాని జాడగాని ఏదీ కనిపించలేదు. ఆమెకు భర్త తనకు దగ్గిరే ఉన్నట్లనిపించింది. అంతే గాక అతడామె చెవిలో ఏదో గుసగుస లాడినట్లుకూడా వినిపించింది. దానితో ఆమె భయం అంతా తీరిపోయింది.

అప్పటినించీ ఆమె ఆ భవంతిలో హాయిగానే కాలం గడిపివేసింది. కాని భర్తను కళ్లారా చూసేఅదృష్టం పట్టలేదే అని కొంచెం నిరుత్సాహపడింది.

ఆ వేళరాత్రే ఆమెభర్త పక్కనే అదృశ్యంగా నిలబడి ఇలాగ హెచ్చరించాడు:

“సైకీ! నీ అక్కలిద్దరు నిన్ను చూడడానికి వస్తున్నారు. నీవు వారికి కనిపించకూడదు. ఒకవేళ కనిపించినా వారి చెప్పుడు మాటలు వినకూడదు. విన్నావంటే అపద పాలై పోతావు! జాగ్రత్తసుమా!”

అని మరీ మరీ హెచ్చరించాడు. ఆమె తన అక్కలనిద్దరినీ చూడకుండా ఉండలేననీ అవసరం వారిని చూడడానికైనా అంగీకరించవలసిందనీ ప్రార్థించింది. అతడామె అంత ఇదిగా అడుగుతూంటే మరి కాదనలేకపోయాడు.

ఆ మర్నాడు పొద్దున్నే పైరుగాలి సైకీ అక్కలిద్దరినీ భవనంలోకి తీసుకువచ్చింది.

అక్కలిద్దరినీ ఆమె ఎంతో మర్యాదగా ఆదరించింది. అనేకవిధాలుగా సంతోష పెట్టింది. కాని వారిద్దరికీ ఆమె భోగ భాగ్యాలు చూడగానే బాగా కన్నుకుట్టింది. వారిద్దరు ఆమె భర్త ఎక్కడ ఉన్నాడని అడిగారు. ఆ ప్రశ్నలకామె అంటీ అంటనట్టుగా సమాధానం చెప్పింది.

అదివిని అక్కలిద్దరు అతడు ఆకాశవాణి చెప్పినట్టు భయంకర సర్పమే అయివుంటాడనీ ఎప్పుడో ఒకప్పుడు సైకిని మింగివేసి తీరతాడనీ భయపెట్టారు

ఆ సమాధానంతో సైకీకూడా చాలా భయంవేసింది. భర్త తనకు కనిపించకుండా ఉండడానికి కారణం అదే అయివుండవచ్చునని అనుమానించింది అక్కలిద్దరినీ ఆ అపద గడిచి బయటపడే ఉపాయమేదైనా చెప్పమని అడిగింది.

అక్కలిద్దరు అంతకుమునుపే పన్నాగం పన్నుకుని కూర్చున్నారు అడిగిందేతడవుగా

ఆమెకొక సలహా ఇచ్చారు.

"సైకీ! నీవొక దీపం వెలిగించి నీ పక్క గదిలో పెట్టుకో. ఒక బాకుకూడా జాగ్రత్త చెయ్యి. నీభర్త నిద్రపోతూంటే మెల్లిగా దీపం పట్టుకురా. ఆ వెలుగులో నీకతడు కనిపించితీరతాడు. వెంటనే బాకుతో అతని గుండెల్లో పొడిచివెయ్యి. లేకపోతే నీ గతి ఇక ఇంతే!"

సైకీకేమీ పాలుపోలేదు. చాలాసేపు తటపటాయించింది. మొట్టమొదట తన భర్తను చంపడానికామెకు మనస్కరించలేదు. కాని అతడంటే లోలోపల ఒక పెద్ద భయం బయలుదేరింది ఏది ఏమైనా దీపం వెలుగులో అతనినొకమారు కళ్ళారా చూచితీరాలని నిశ్చయించింది

ఒక చేత్తో కత్తీ ఒక చేత్తో దీపం పట్టుకుని పిల్లిపిల్లలాగ మెల్లిగా మెల్లిగా అడుగులు వేసుకుంటూ అతనిగదిలోకి వెళ్లింది.

కాని దీపం వెలుగులో ఆమెకా భయంకరసర్పం కనిపించలేదు సరిగదా కళ్లు మిరుమిట్లుగొలిపే అందంతో ఒకసౌందర్యమూర్తి కనిపించాడు.

దీపం వెలుగులో ఆ సౌందర్యమూర్తిని చూస్తూ సైకీ అలాగే ఒక బంగారుబొమ్మలా నిలబడిపోయింది అతని అందాల వెలుగులో ఆమె చేతనున్నదీపమే వేయి రెట్లింకా ఎక్కువగా దగద్ధగాయమానంగా వెలిగిపోతూన్నట్లనిపించింది.

ఆ సౌందర్యరాశిని చూచి సైకీ తన దుష్టసంకల్పానికెంతో సిగ్గుపడిపోయింది. పశ్చాత్తాపం భరించలేక అతనిగుండెలో పొడిచివేద్దామనుకున్న కత్తితో తనగుండెలో పొడుచుకోనేదే!

కాని ఆకంగారులో ఆమె చెయ్యి వణికింది. కత్తి నేల మీద పడి ఖంగున మారుమోగింది.

అతనిని కళ్లారా జుర్రుకుందామనే తహతహకొద్దీ సైకీ అతని ముఖంమీదికి కొంచెం వంగింది. కాని ఆకంగారులో ఆమె చేతిలోని దీపపుసెమ్మెలోని నూనె కొంచెం అతని ఒంటిమీదపడింది.

అంతే! అతడు లేచాడు. కనురెప్పపాటులో ఆమె చెడుతలపు గ్రహించాడు. ఆమరుక్షణంలో అక్కడినుంచి పారిపోయాడు.

ఆమె అతని వెంటనంటి పరుగెత్తింది. అతడామెకు కనిపించలేదు. కాని "నమ్మిక లేనిచోట ప్రేమ ఒకక్షణంకూడా నిలవగు" అ నేమాటలు వినిపించాయి.

ఆమాటలు విని ఆమె నిలువునా నిర్ఘాంతపోయింది. అతడు ప్రేమదైవతమైనక్యూపిడే అనీ పొరపాటువల్ల అతన్ని దక్కించుకోలేకపోయా నేఅనీ పశ్చాత్తాపపడింది.

కాని ఏమైనానరే! తన జీవితంఅంతా

# ★ గ్రీకు కులదేవత సైకీ ★

అతని అన్వేషణలోనే గడిపివెయ్యాలని నిశ్చయించింది. ఆవిధంగా అతనియెడల తనకున్న ప్రేమ వ్యక్తీకరించాలని శపథం పట్టింది.

వెంటనే క్యూపిడ్ తల్లి దగ్గరికి వెళ్లి పోయాడు. వీనస్ దేవత ఒక క్షణంలో జరిగినదంతా గ్రహించి వేసింది. సైకీకి తగినట్లుగా బుద్ధి చెప్పాలని అనుకుంది నూనె పడిన చోట లేసిన గాయానికి కట్టుకట్టింది.

ఆ క్షణంనించీ సైకీ దేవతలందరికీ ఎన్నెన్నో మొక్కులు మొక్కుకుంది. కాని దేవతలందరికీ వీనస్ పేరు చెవిని పడితేనే హడలు! అందుచేత వారెవరూ ఏమీ చెయ్యలేక తమకు సంబంధం లేనట్టుగా మాట్లాడకూరుకొన్నారు. సైకీ అది కని పెట్టింది. చివరికి వీనస్ దేవత కాళ్ళమీదపడి అనేక విధాల పరిచర్యలు చేసి ఆమె మనస్సు కరిగించాలని నిశ్చయించింది ఆమె దగ్గరికి వెళ్ళి అనేక విధాల బతిమాలుకుంది.

వీనస్ మొట్టమొదటగా ఎంతగా బతిమాలుకొన్నా ఆమె మాట వినలేదుగాని చిట్టచివరికి ఎన్ని కష్టాలు వచ్చినా లెక్క చెయ్యకుండా పరిచర్య చేస్తే ఆమె కోరిక నెరవేర్చగలనని చెప్పింది.

తరవాత వీనస్ గోధుములు ఇంకా కొన్ని ధాన్యాలు కలగాపులగంగా కలిపి వేసింది. ఒక్క గింజైనా కలిసిపోకుండా ఈ ధాన్యాలన్నీ వేరుచేసి పోగులు పెట్టమని ఆజ్ఞాపించింది. సైకీ సరేనని ఒప్పుకుంది.

కాని ధాన్యంపోగు చాలా పెద్దది. "అయ్యో వీనస్ నాకెంత కఠిన శిక్ష విధించింది!" అని కంటనీరు పెట్టుకుంది. ఒకొక్క గింజ చొప్పున ఏరుతూ ఆయా ధాన్యాలు వేరుచెయ్యడం, మొదలు పెట్టింది. ఆ పని ఎంతసేపు చేసినా తెమలేటట్టు కనబడలేదు. దేవతలకుగాని, మానవులకుగాని సైకీ మీద పిసరంతైనా జాలి కలగలేదు. కాని చీమలు ఆమె దైన్యస్థితి చూసి చాలా జాలి పడ్డాయి. ఆ చీమలన్నీ కలిసి ధాన్యాల పోగులు వేరుచేసి పారేశాయి. వీనస్ అది చూసింది:

"అప్పుడే నీ పని అయిపోయిందనుకున్నావేమో! ఇంతా చేస్తే అది ఆరగింజలో అర భాగంకూడా కాలేదు!"

అని చెప్పి సైకీ కొక చిన్న రొట్టెముక్క ఇచ్చి అక్కడే కటిక నేలమీద పడుకోమని చెప్పి లోపలికి వెళ్ళిపోయింది కొడుకు చేతిమీద కాలినచోట మందు వేస్తూ కూర్చుంది. తరవాత తన గదిలోకి వెళ్ళిపోయి హాయిగా ఒక హంసతూలికాతల్పంమీద పడుకొని నిద్రపోయింది. అలాగ చేస్తే సైకీ అర్ధాకలితో చిక్కి శల్యమైపోతుందనీ దానితో ఆమె అందం అంతా హరించుకుపోతుందనీ వీనస్ నమ్మకం!

మరునాడు నిద్రలేచీ లేవ లేవగానే వీనస్ సైకీకి ఇంకొకపని అప్పగించింది.

"సైకీ! అదిగో! అకనబడుతున్న ఏటిగట్టు చూశావా! అక్కడ బంగారు ఉన్నితో తళతళలాడే గొర్రెలమందలు తిరుగుతూంటాయి. నీవు నాకా బంగారుఉన్ని కొంచెం తెచ్చిపెట్టాలి. త్వరగావెళ్లు" అని ఆజ్ఞాపించింది

పాపం సైకీ ఈ బాధలుపడలేక ఆ నదిలో పడి చచ్చిపోదామనే అనుకుంది. కాని అంతలో ఎదురు పొదలలోనించి ఒక అశరీరవాణి వినిపించింది. సాయంత్రందాకా వేచిఉంటే బంగారుఉన్ని దొరుకుతుందనీ, అంతవరకు వేచిఉండవలసిందనీ తొందరపడవద్దనీ చెప్పింది సైకీ అంతవరకు వేచి ఉండి ఎలాగో అలాగ బంగారుఉన్ని సంపాదించి వీనస్ దేవత కిచ్చింది:

వీనస్ ఆమె మరొకరి సహాయంవల్ల ఆ ఉన్ని సంపాదించిందని గ్రహించింది మళ్లీ ఇంకొక పరీక్ష చేసింది.

"సైకీ! అదిగో ఆ నల్లని జలపాతం కనిపిస్తూంది. చూశావా? అది స్టిక్సునది. దానిలోనించి నాకు కొంచెం నీరు తెచ్చి పెట్టాలి" అని ఆజ్ఞాపించింది. అంతవేగంగా ప్రవహించే స్టిక్సునది జలపాతంలోనించి నీరు సంపాదించడం చాలా కష్టం! రెక్కలున్న వారికితప్ప అది సాధ్యంకాదు.

కాని ఒక డేగ సైకీకి సాయంచేసింది. సైకీ చేతిలోఉన్న జలపాత్ర తీసికొని ఆ జలపాతం నీరుతెచ్చి ఆమె కిచ్చింది. సైకీ ఆ జలపాత్ర వీనస్ కిచ్చింది. అయినా వీనస్ కసి తీరలేదు.

మళ్లీ ఇంకొక పరీక్ష చేసింది:

"సైకీ! నీ విప్పుడే తొందరగా పాతాళ లోకానికి వెళ్ళిపోవాలి అక్కడ ప్రోసర్ పీన్‌తో ఆమె అందం కొంచెం ఈ పెట్టెలో పెట్టి నాకు పంపించమని చెప్పు. నేను పంపించానంటే ప్రోసర్ పీన్ తప్పకుండా నా కోరిక చెల్లిస్తుంది." అని ఒక చిన్న పెట్టె ఆమె కిచ్చింది.

పాపం సైకీ మళ్లీ దేవుడా! అని బయలుదేరింది. భూమిలోకి చొచ్చుకుపోయిన ఒక దారమ్మటే పాతాళలోకం సరిహద్దులలోకి వెళ్ళిపోయింది.

కాని ఆ పైన ఏమి చెయ్యాలో తెలియలేదు. ఎక్కడా దారి కనిపించలేదు. కాని అక్కడ ఒక చిన్న గోపురంమీద ఒక పక్షి

నిలబడి పాతాళంలోకి వెళ్లే దారులన్నీ ఆమెకు తెలియజేశాడు.

సైకీ సరిగా అతడు చెప్పినట్టే బయలుదేరింది. మొట్టమొదటగా ఆమెకక్కడ మృత్యునది కనిపించింది. నావ నడిపించేవానికి కొక పెన్నీ ఇచ్చి సైకీ ఆ నది దాటింది.

ఆ తరవాత మరి కొంత దూరం నడిచి పోయేసరికామెకు మరి కొంత దూరంలో ప్రోసర్ పీన్ భవనం కనబడింది.

ఆ భవంతి కెదురుగా ఒక మూడుతలల జాగిలం కనిపించింది. సైకీ దాని కొక రొట్టెముక్క అందించి నెమ్మదిగా భవంతి లోపలికివెళ్ళి పోయింది.

ప్రోసర్ పీన్ సైకీ నెంతో గౌరవించింది. తన అందం కొంచెం పెట్టెలో పెట్టి సైకీ చేతి కందించిది.

సైకీ మళ్ళీ వీనస్ దగ్గరికి బయలుదేరింది. దోవలో ఆమెకా పెట్టెలో ఏముందో చూడాలని తహతహ బయలుదేరింది. ఆ పెట్టెలో అందం కొంచెం తీసుకుంటే తన భర్తకళ్ళకింకా అందంగా కనిపించవచ్చును గదా అని ఆశపడింది.

మెల్లిగా పెట్టె తెరిచింది. కాని దానిలో ఏమీ కనిపించలేదు.

అంతలోనే సైకీకి మగతనిద్ర కమ్మింది. ఆమె అక్కడే కూలబడిపోయింది.

క్యూపిడ్ క్రమంగా ఆ సంగతి తెలుసుకున్నాడు. అప్పటి కతని గాయం బాగా మానిపోయింది అత డెక్కడికీ పారిపోకుండా వీనస్ దేవత్ అతనిగదికి తాళం వేసింది. కాని క్యూపిడ్ ఎల్లాగో దారిచేసుకుని ఎగిరి ఇవతలపడ్డాడు. వెంటనే తన సైకీ పడిఉన్న చోటికి బయలుదేరాడు.

ఆమె వీనస్ భవంతి కల్లంత దూరంలోనే మూర్ఛ పడిఉంది. క్యూపిడ్ సైకీ కళ్లమీద బరువు బరువుగా వేళ్ళాడుతున్న నిద్ర తుడిచి వేసి అదంతా మళ్లీ ఆ పెట్టెలో పెట్టాడు.

తన రెక్కలతో ఆమెకు విసిరాడు. సైకీకి మెలుకువ వచ్చింది. క్యూపిడ్ అలాగ ఆ పెట్టె తెరవడం తప్పని సన్నసన్నగా చివాట్లు పెట్టాడు. ఆ క్షణంతో ఆమె కష్టాలన్నీ గట్టెక్కి పోయాయనీ మరి భయం లేదనీ ధైర్యం చెప్పాడు సైకీ భవంతి లోపలికి వెళ్ళిపోగానే దేవత లందరిలోను పెద్దవాడయిన జ్యూపిటర్ దగరికి వెళి సైకీకి తనకు వివాహ మయ్యేటట్లు చూడవలసిందని ప్రార్థించాడు.

జ్యూపిటర్ దాని కంగీకరించాడు "నీవు నన్నింతకుపూర్వం ఎద్దులాగ, హంసలాగ మార్చివేశావు అయినా నాకేమి కోపంలేదు. నీ కోరిక చెలిస్తానులే!" అన్నాడు.

దేవతలసభ జరిపి వారందరికీ ఆ శుభవార్త తెలియజేశాడు.

తరవాత సైకీని క్యూపిడ్ కిచ్చి వివాహం చేశారు.

ఆ వివాహంలో జ్యూపిటర్ స్వయంగా తన చేతులతో సైకీకి అమృతపాత్ర బహూకరించారు.

అమృతం తాగగానే సైకీ దేవతగా మారిపోయింది. ఇన్నాళ్లనించీ ఆమె మనుష్య స్త్రీ కాబట్టి తనకు కోడలు కావడానికి వీల్లేనని వినస్ దేవత తగాదా పెట్టింది. కాని ఇప్పుడిక ఒప్పుకోక తప్పలేదు వీనసే స్వయంగా ఆ నూతన వధూవరులనిద్దరినీ ఆశీర్వదించింది. 



# తాసిల్దార్

ఈకథ మిమ్మల్ని అర్ధశతాబ్దం వెనక్కు తీసుకెళ్తుంది. అప్పటిప్రజలు మనకు వింతగా కనిపిస్తారు. ధనికదరిద్రుల్లో, వేషభాషల్లో, భోజనభాజనాల్లో ప్రతి విషయంలో స్పష్టమైన వ్యత్యాసం గోచరించేది. అది భారతావనికి సంధిసమయం. పురాతనాచారాలంతరించి పాశ్చాత్య నాగరికత వ్యాపిస్తున్న రోజులవి. విదేశాల్లో బారిష్టర్, ఐ. సి. ఎస్. వగైరా డిగ్రీలు సంపాదించి వచ్చిన భారతీయులు తమ భావాలనూ ఆచారాలనూ భారతదేశంలో వ్యాపింపచేయాలని కుతూహలపడుతున్నారు. దాని ప్రభావం అప్పటికే భారతీయ సాంఘిక సంబంధాల్లో తొంగిచూస్తోంది.

* * *

మన్మాడ్‌నుంచి హైదరాబాదు వెళ్ళే బండి మిట్టకూడెం స్టేషనులో ఆగింది. ఫస్టుక్లాసు పెట్టెలో యువకుడైన ఒక బారిష్టరు ఏదో ఆంగ్ల మాసపత్రిక చదువుతూ కూర్చున్నాడు. అప్పుడప్పుడు దాంతో విసురుకుంటూ ఒక్కొక్కసారి పేజీలు తిరగేసి చదువుతూ చిరాగ్గా కూర్చున్నాడు. అతని నోట్లోనుంచివచ్చే సిగార్ ధూమ మేఘాలు అతని మనస్సులోని చిరాకును ప్రదర్శిస్తున్నాయి జేబు గడియారం తీయడం, చూడ్డం మళ్ళీ జేబులోపెట్టడం ఇదీ అతనిపని. తుదకు పెట్టెదిగి కర్రవూపుతూ స్టేషనుమాస్టరు గదిలోకి వెళ్ళాడు. అక్కడే గార్డుకూడా కూర్చొని కులాసాగా కబురు చెప్తున్నాడు.

“బండి 15 నిముషాలు లేటైంది. ఇంకా పంపించాలనే ఆలోచనే లేనట్లుందేమీకు,” గద్దించాడు బారిష్టరు. గార్డు ప్రత్యుత్తరమీయకుండానే దీనికంతా స్టేషనుమాస్టరే కారణం, అన్నట్లు ఒకగట్టిచూపు స్టేషను మాస్టరువైపుపారేసి ఊరుకున్నాడు.

“మిట్టుగూడెం తాసిల్దారువారు హైద్రాబాదువెళ్తారని తెలిసింది. వారురావడమే ఆలస్యం బండికదుల్తుంది” అన్నాడు నీళ్లు నములుతూ స్టేషనుమాస్టరు.

‘వాట్ నాన్సెన్స్’ బారిష్టరు ఉరిమాడు. “టైంప్రకారం బండి నడిపించడం కూడా తెలియనట్లుందే మీకు; తాసిల్దారుకోసం బండి ఆపుతారా! తాసిల్దారు తాతొచ్చినా బండి ఆగడానికి వీల్లేదు. అరే! బండి ఆలస్యంగా పోతే ఎంతమంది నష్టపడతారో కూడా తెలీదే మీకు? నేం తొందరగా హైద్రాబాదు వెళ్లాలి. బండి త్వరగా పంపించెయ్యండి”, అన్నాడు బారిష్టరు తన ఆదుర్దా అంతా వ్యక్తపరుస్తూ ఏదో అధికారం చలాయిస్తున్నట్టు.

సూటు బూటు చూసి స్టేషను మాస్టరు గుండెల్లో రాయిపడ్డది. అయినా తాసిల్దారు షేర్వానీ అతని గుండె గుబగుబలాడిస్తున్నది. ఏం చేస్తాడు? ముందునుయ్యి, వెనకగొయ్యి. “వారు వస్తూనే ఉంటారు. అదిగో వచ్చేస్తూనే ఉన్నారు,” స్టేషనుమాస్టరు ముఖం చాటంతైంది. “మాకారా మేనావాళ్ళ అరుపులు వినవస్తున్నాయి మీరు మీ పెట్టెలో కూర్చోండి, బండి ఇప్పుడే కదుల్తుంది.” అన్నాడు స్టేషను మాస్టరు తన తలబరువేదో దింపుకుంటున్నట్టు.

వీళ్ళిలా తగాదా పడ్తూండగానే ఆరుగురు చాకళ్లు మోసుకొస్తున్న మేనా తిన్నగా బారిష్టరుగారెక్కిన ఫస్టుక్లాసు కంపార్టుమెంటు దగ్గర ఆగింది. నాలుగు బట్టల పెట్టెలూ, మూడు పెద్ద బిస్తర్లూ (బెడ్డింగులు) రెండు పళ్ళబుట్టలూ ఒక టిఫిన్ కారియరూ, ఒక కూజ చెంబూ, ఒక హుక్కా పనివాళ్ళు లోపలపెట్టేస్తూండగానే బారిస్టరు పరుగెత్తుకొచ్చి పనివాళ్ళతో “ఇది రిజర్వు కారేజీ ఇందులో మీరింకోళ్ళ సామాను పెట్టడానికి వీల్లే”దన్నాడు తన హక్కెవరో లాక్కుంటున్నట్టు.

“మాకేమీ తెలీదండీ ఇది మా సర్కార్ హుకుం. మీకేమైనా తక్రార్ (తగాదా) ఉంటే ఆయనతో మాట్లాడండి, అన్నారు నౌకర్లు అతన్ని చూడకుండానే సామాను సర్దుతూ.

“ఇదేమిటండీ అన్యాయం, రిజర్వు కారేజీ అని రాసిఉన్నా మీరిందులో సామాను పెట్టేస్తున్నారు. మీరింకో పెట్టి చూసుకోండి, లేకపోతే వచ్చే స్టేషనులో దిగిపోవాల్సివస్తుంది,” అన్నాడు బారిష్టరు తాసిల్దారు తనను లెక్కచేసే ఘటం కానట్టే ఉందని అనుమానిస్తూనే.

“ఓహో! పెద్దవచ్చాడు చింపడానికి. పెద్ద రిజర్ చేశావు. రిజర్ చేశాట్ట రిజర్. తాసిల్దారుకేమి రిజర్ ఓయ్ పెద్ద అధికారి వొచ్చావు రిజర్ చేయించటాని”కని తాసిల్దారు సామాను త్వరగా సర్దమని నౌకర్లను పురమాయించాడు.

“మీకీ పెట్టెలో కూర్చోవడానికధికారం లేదంటున్నా,” అన్నాడు ఉడుకెక్కిన శరీరంతో బారిష్టరు.

“ఎవడోయ్ నాకూర్చునే అధికారం లేదనేది. నేనేం టిక్కట్ కొనలేదా!” అని తాసిల్దారు షేర్వానీ జేబులోంచి టిక్కట్టు తీసి మళ్ళీ సాగించాడు. “చూశావా నాకూ టిక్కట్టుందోయ్. కూర్చోడానికి నీకెంత హక్కుందో నాకూ అంత హక్కుంది,” అన్నాడు తాసిల్దారు తాను గెల్చినట్లు కళ్లు పెద్దవి చేసుకొని బారిష్టరువైపు చూస్తూ.

టిక్కట్టుచూసి నవ్వాలో కోప్పడాలో తెలియలా బారిష్టరుకు. అది సెకండ్ క్లాసు టిక్కట్టు. ఫస్టుక్లాసులో ప్రయాణం చేస్తున్నాడు. పైగా రిజర్వు కంపార్టుమెంటు.

సామానుతో పెట్టె నిండిపోయింది. తాసిల్దారు పెట్టెలో కెక్కాడు. ఆయన చప్రాసీ లిద్దరూ ద్వారపాలకుల్లా దర్వాజాకు చెరోవైపు నిలుచున్నారు. ఇక తాసిల్దారుతో మాట్లాడి లాభంలేదని తేల్చుకున్న బారిస్టర్ స్టేషనుమాస్టరుతో షికాయతు (ఫిర్యాదు) చేద్దామని వారివైపు సాగాడు. బారిష్టరును చూచి పిడుగు పడ్తుందని తెలుసుకున్న గార్డూ, స్టేషనుమాస్టరూ ఒకరు వెనక్కూ, ఒకరు ముందుకూ పరిగెత్తారు. పరిగెత్తే గార్డు బారిష్టరుకేసి చూసి “బండెక్కండి. బండి కదుల్తుంది,” అన్నాడు పచ్చజండా ఊపుతూ.

ఇటు గార్డువేపు వడవాలో, అటు స్టేషనుమాస్టరువేపు వడవాలో ఆలోచిస్తూండగానే బండి విజిల్ ఇచ్చి కదిలింది. ఏంచేస్తాడు పాపం, పరిగెత్తుకెళ్ళి పెట్టెలో దూరాడు.

పెట్టెలో కెక్కినతర్వాత బారిష్టరుకింకోగడ్డుసమస్య ఎదురైంది. ఒక సీటుమీద రెండువైపులా రెండుపక్క చుట్టలు

# ★ హమేషా తమాషా ★


అలవాట్లుగా.


పొరపాటు

చిత్రకారుడు: పి. ఎస్. శాస్త్రి.

---

# ★ తాసిల్దార్ ★

పెట్టుకొని కూర్చున్నాడు తాసిల్దారు స్థిరంగా. రెండో సీటుమీద సామానులు పెట్టెలూ వాటిమీద మిగిలిన బెడ్డింగూ ఉన్నాయి. బారిస్టరు కూర్చోడానికి కూడా జాగా లేదు. మిగిలినజాగాలో చప్రాసీలు సామాను సర్దుతున్నారు ఇంక తాసిలారు మీద కన్నులున్నా లాభంలేదని తెలిసిన బారిస్టరు చుట్టపొగ ఊదుతూ యోగివలె ఈ మాయాజాలం పై ప్రవేశించడం మొదలు పెట్టాడు. ఇక ఈ కంప అంటుకోకుండా ఉండడమే మంచిదనుకున్నాడు పాఠం అప్పగించలేని విద్యార్థిలాగా ముఖంపెట్టి చుట్టలాగడం మొదలుపెట్టాడు. అతన్ని చూసి తాసిల్దారుకు జాలి వేసింది.

"మియాఁ నిల్చున్నావెందుకు కూర్చో" అన్నాడు మహాసౌజన్యంతో తాసిల్దారు తానే ఈ పెట్టెకు యజమానైనట్లూ, బారిస్టరు మీదేదో పెద్దదయ చూపుతున్నట్టూ. అనడైతే అన్నాడుగాని తీరాచూస్తే రెండో సీటునిండా సామానుంది. బారిస్టరు కూర్చోడానికి జాగా ఏది? తాను గబాల్న లేచి "మియాఁ కూర్చో నేనింకోవైపు కూర్చుంటా"నని రెండోసీటు ఖాళీచేయమని నౌకర్లతో చెప్పి బారిస్టరును రెక్కపట్టుకుని సీటుమీద కూర్చోపెట్టాడు, తనకాతని మీదేదో పెద్దవాత్సల్యం ఉన్నట్లు రెండో సీటు ఖాళీ అయింతర్వాత తాసిల్దారు కూర్చున్నాడు.

* * *

బండి వేగంగాపోతూంది. బారిస్టరు కిటికీలోంచి బైటికి చూస్తున్నాడు. తాసిల్దారు సీటుమధ్య రెండు కాళ్లు చాచుకొని సుఖంగా కూర్చొని తోటి ప్రయాణికునితో ఎలా సంభాషణ ప్రారంభించాలా అని ఆలోచిస్తున్నాడు.

"మియాఁ ఎక్కడనుంచీ రావడం?"

బారిస్టరు కిటికీలోంచి తలతీసి "లక్నో నుంచి" అని మళ్ళీ కిటికీలో తలదూర్చాడు.

"లక్నోలో ఏం ఉద్యోగం?"

ఈతడవ బారిస్టరు తలకూడా తిప్పలా. మొదటిప్రశ్నతోనే విసిగి పరిచయంలేకుండా నేమాట్లాడే ఈ పల్లెటూరిగబ్బిలాయతో మాట్లాడ్డం వృథాఅనుకున్నాడు. కాని తాసిల్దారుమాత్రం ఊరుకోలా. మళ్లీ సాగించాడు.

"అదో పెద్దపట్నం. అనేకమంది నవాబులూ జమీందార్లూ ఉంటారు. నీవూ జమీందారువల్లే ఉంది. విహారానికి బైల్దేరినట్లుంది హైద్రాబాదుకు"

బారిస్టరుకు 'జమీందార' నే పదంఎందుకోగాని అసహ్యమనిపించింది. ఊరుకోలేక 'కాదు,' అన్నాడు పెద్ద చిరాగ్గా.

"డాక్టరువా?"

"కాదు"

"సర్కార్ హోదాదారువా?"

"కాదు"

"కాకుంటే వ్యాపారం చేస్తావా? ఏదో కంపెనీకి ఏజంటువై యుంటావు"

"కాదు"

ఈ కాదులతో విసిగిన తాసిల్దారు "మరేం చేస్తావు? ఈ ప్రపంచకంలో ఏమీ ఉద్యోగం లేకుండా బతకటం ఎట్లా? ఎక్కడైనా కాలేజీ ఫరఫేసరు వైతే కాదు కదా? హైద్రాబాదు చూడ్డానికి సెలవులో బైల్దేరినట్టున్నావు," అన్నాడు ఈ తడవ తప్పకుండా జవాబొస్తుందనే ధీమాతో.

మళ్ళీ అదే "కాదు", జవాబొచ్చింది.

బారిస్టరు ఈ మాటలు వినలేక నే విసుగెత్తి పోతున్నాడు. కాని తాసిల్దారు మాత్రం వదిలే ఘటంగా కనిపించడంలా. అప్పుడు, ఇప్పటికీ అర్థ శతాబ్దం క్రితం అర్థ శతాబ్దం వయసుగల మనిషి తాసిల్దారు. ఆ పాతకాలం మనుష్యులంతా అంతే. ఆ తరంవాళ్లైతే ఇద్దరు కనిపిస్తే వాళ్లల్లో ఎక్కడలేని ఆత్మీయత పెరుగుతుంది. పద్దెను నిముషాల్లోనే అయిదుతరాలు పైన, అయిదు తరాలు క్రిందివాటిని గురించి సంభాషణ జరిగిపోతుంది. రైల్లోనే వివాహ సంబంధాలు కూడా నిశ్చయమైపోతాయి. కాని ఇవ్వాళ ఈ కొత్తరకం మనిషి 'కాదు'లతో విసుగెత్తుతూంది తాసిల్దారుకు. అయినా మాటలు

తెంపేయాలనే దృష్టి ఏకోశానా కనిపించడం లేదు తాసిల్దారుకు. అతనికో కొత్త ఆలోచన తట్టింది. పన్నెండైంది. భోజనం వేళ. రెండు పెట్టెల్ను ఒకచోటుకు లాగి వాటిమీద దస్తర్ ఖాన్ (ముసల్మానులు భోజనం చేసేప్పుడు ఒక ఎఱ్ఱని గుడ్డ పరచుకొని దానిమీద భోజనం చేస్తారు.) పరిచాడు. టిఫిన్ క్యారియర్ లోంచి ఒక్కొక్క గిన్నె తీసి దానిమీద పెటూ,

"అయితే వకీలుగారూ! రాండి బిస్మిల్లా, భోజనం తయారుగా ఉంది. భోంచెయ్యండి.

వకీలుగారూ అన్నమాట విని బారిష్టరు ఉలిక్కిపడ్డాడు. "నేను వకీలునని మీకెలా తెలిసింది?"

"ఇదీ ఓగొప్పే? జమీందారు కాకుండా, పరఫేసరు కాకుండా, డాకటరు కాకుండా ఉద్యోగి కాకుండా సూటుబూటు వేసుకుంటే వకీలు కాకుంటే ఇంకెవరు? ఏ ఉద్యోగంలేని వానివృత్తి వకాల్తీ" అనే సామెతుంది.

ఇద్దరూ పెదగా నవ్వారు.

"ఆఁ రాండి భోంచెయ్యండి" అన్నాడు తాసిల్దారు నవ్వుతూనే.

"అచ్ఛా మీకంత ఇదిగా ఉంటే రెండు ముద్దలు తినేస్తా" అని దస్తర్ ఖాన్ వైపు తిరిగాడు.

"తప్పక తప్పక తినాలి. ఇంతకంటే ఎవడైనా ఏంఉపకారం చేస్తాడు? ఆతిథ్యం స్వీకరించడమే గొప్ప ఉపకారం. నేను మీకు చాలా కృతజ్ఞుణ్ణి. ఇదిగో పలావ్ మిక్కిలి రుచైంది. ఇదిగో ఇక్కడ కూరలున్నాయి. నీఇష్టంవచ్చిన వాటితో తిను. కాని ఆఁ ముందే చెపుతున్నాను మిరాయికి మాత్రం కాళీ ఉంచాలి సుమా? మాచిన్నమ్మ స్వయంగా చేసింది అఁ. మరిచానుపాయసం కూడా ఉంది. ప్రత్యేకంగా తయారు చేసింది దానిగూడా కాళీ ఉంచాలి.

ఇద్దరూ తినడం ప్రారంభించారు.

"ఊఁ అయితే లక్నోలో వకాల్తీ చేస్తారు" "నేనూ వకాల్తీ ప్యాసయ్యాను. కాని ఉర్దూలో. ఇప్పుడైతే, చాలా మంది బొంబాయి, కలకత్తాలకుపోయి ఇంగ్లీషులో పరీక్ష ఇస్తున్నారు. మీరెక్కడ చదివారు? అన్నాడు తింటూనే తాసిల్దారు.

'లండన్‌లో' అన్నాడు సంక్షిప్తంగా బారిష్టరు.

ఓహో! అయితే తమరు బారిష్టర్లన్నమాట. చాలా డబ్బు ఖర్చై ఉంటుంది. ఇక్కడకూడా ఇద్దరు ముగురు బారిష్టర్లున్నారు. ఖర్చున్నంత ఆమ్దనీ (ఆదాయం) లేదు. మీ బారిష్టరీ బాగా నడుస్తూందా?"

"ఏదో నడుతూ లేన్తూ నడుస్తూంది. నెలకు 500 లకు చావులేదు."

"మీకంటె మా దేశపు తాసిల్దార్లే నయం ఏ నెలా వెయ్యికంటె తక్కువ ఆమ్దనీ ఉండదు. ఒక్కొక్కసారి నాలుగు ఐదు వేలుకూడా ఉంటుంది."

"అలా ఎందుకూ మీదగ్గర తాసిల్దార్లకు నిర్ణీతమైన వేతనం ఉండదూ?"

"అరేమియాఁ జీతం తిండిగూడా చాలదోయ్. మరి బట్టలు, చదువులూ, నౌకర్ల జీతాలూ, పెళ్లిళ్లూ, గుర్రబ్బండీ ఇవన్నీపై ఆమ్దనీ లేకుండా ఎలా వెళ్ళుతాయ్? మంచిది గాని హైదరాబాదు ఎందుకు వెళ్తున్నట్లూ?"

ఈప్రశ్న బారిష్టరును తల్లక్రిందులు చేసింది. ఏదో దాచాలని ప్రయత్నిస్తున్నట్టుంది వేషంచూస్తే "ఏమీలేదు ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమోనని. ఉద్యోగం దొరుకుతే అక్కడే ఉండిపోతా" నన్నాడు బారిష్టరు దీర్ఘాలోచన తర్వాత

'అబ్బా! ఉద్యోగంకోసం చాలాదూరం వచ్చావు ఎవరిదైనా పరిచయం ఉందా? సిఫారస్ ఏమైనా ఉందా?"

"లేదండీ నాకిక్కడ తెలిసినవాళ్ళుగాని నేను తెచ్చిన సిఫారసుగాని లేదండీ."

"అయితే బారిష్టరీ కుప్రు (గర్వం) మీద వచ్చావన్నమాట. బారిష్టరీకే ఉద్యోగం దొరుకుతే లక్నోలో దొరక్కపోయిందీ?" ఓగ్గాసుడు నీళ్ళుతాగి మళ్ళీ సాగించాడు. "సరే మంచిదే అయిందిలే మాతో పరిచయమైంది. తాసిల్దారీ చేస్తావా"

"జీతం సరిగ్గా ఉంటే చేయకేం? ఇక్కడ తాసిల్దార్ల కేమిస్తారు? మాపైపు 250 రూ. ఇస్తారు."

"జీతం, జీతం, జీతం, మళ్ళీ అదేమాట జీతం" తనను ద్దేశించుకొని ఇదిగో తాసిల్దార్ను చూడు ఆలోచించుకో, తాసిల్దారీ కావాలా? వద్దా? తాసిల్దారు భోజనం చూడు. అతని సామాను చూడు. కొస్తనే నొచ్చినమేనాను గురించి ఆలోచించు. ఆ నౌకర్ల సంఖ్య చూడు. నన్ను పంపడానికి వచ్చిన ఆ గుంపును చూడు. ఒకసారి ఆలోచించు, రిజర్ డబ్బా అయినప్పటికీ ఇందులో ఎక్కాను. గార్డుకుగానీ స్టేషను మాష్టరుకుగానీ దమ్ముంది దింపడానికి? ఇప్పుడు చెప్పు తాసిల్దారీ కావాలా? వద్దా?"

# ★ తాసిల్దార్ ★

"అయితే తాసిల్దారు జీతమెంతుంటుంది?"

"మళ్లీ అదేమాట జీతం, జీతం. జీతమంటావా 150 రూ."

"నూటయాభైతో మాకేం గడుస్తుంది?"

"మళ్లీ అదేమాట. వేలుకర్చుచేసి చదువుకున్నావు ఏం ప్రయోజనం. తెలివితక్కువ తెలివితక్కువే. నువ్వొక్కడివే కాదోయ్, ఈ విదేశాల గాలి తగిలిన వాళ్ళంతా అంతే. అరే భాయీ తాసిల్దారీ తన్ఖా (వేతనం) కోసం కాదోయ్. హోదా కోసం. ఏం ఇప్పుడైనా చేస్తావా లేదా?"

"చేస్తామనుకోండి. ఈ పరాయిదేశంలో ఎవడిస్తాడు మాకుద్యోగం?" చిరునవ్వు నవ్వుతూ అన్నాడు బారిస్టరు.

"ఓహో, ఆ చింత నీకెందుకోయ్. మీరు మాతో భోజనంచేసి మమ్మల్ని సంతోష పెట్టారు. ఇక మీ ఉద్యోగం గురించి మేం బాధపడతాం. మా మామ రెవిన్యూమంత్రి మీ ఉద్యోగం విషయం మే మాయనతో సిఫారసు చేస్తాం".

మాట్లాడుతూనే భోజనం పూర్తిచేశారు. దస్తర్ ఖాన్ స్థానం పాన్ దాన్ (తాంబూల పేటిక) ఆక్రమించింది తాసిల్దారు పాన్ చుట్టూంటే చెన్నా, హుక్కా తయారు చేశాడు బారిస్టరుసిగారువెలిగించబోతూంటే తాసిల్దారు అరేమియా ఆవెధవ మటపారేయ్. మీకే ఎండినపొగాకులో ఏంమజా, ఉంటుందోయ్ ఇదిగో ఇది మీ లక్నో పొగాకు, ఒక్కసారి పీల్చావంటే వెయ్యి చుట్టలు తాగినంతపనౌతుంది," అంటూనే తాసీల్దారు హుక్కాగొట్టం ముందుంచాడు.

బారిస్టరు గొట్టం తీసుకొని నాలుగుసార్లు హుక్కా పీల్చి తాసిల్దారు కిచ్చేశాడు. తాసిల్దారు పాన్ తిని వీపు బిస్తర్ కానించికాళ్లు హాయిగా చాచుకొని అరశయనావస్థలో కూర్చొని నాలుగైదు నిముషాలు హుక్కా తాగడంలో నిమగ్నుడైనాడు. హుక్కా పీల్చిం తర్వాత తాసిల్దారు ముఖంమీద ఆనందోన్మాదం, నాట్యమాడినట్లనిపించింది. ఆ ఆనందానుభూతి తర్వాత మళ్ళీ సాగించాడు తాసిల్దారు.

"మంచిదే అయింది. తాసిల్దారీ చేయడానికి ఒప్పుకున్నావ్. మీలాంటి కొత్తసిక్షాం తాల మనుష్యులు జీతం తక్కువుంటుందని ఇల్లాంటి ఉద్యోగాలు చేయరు"

"సరైతే ఒప్పుకున్నాగా."

"నిజం చెపుతున్నా బబ్బాయి నువ్వు చాలా తెలివికలవాడివి. మెల్లగా నీవే అన్నీ నేర్చుకుంటావ్. కాని మియాం నీపేరడగడం మరిచాను. నీపేరేమిటి? పట్నంలో మకాం ఎక్కడ."

"నాపేరు ఇబ్రాహీం ఖాం. ఎక్కడో సత్రంలో దిగుతాను. మీ అడ్రసు ఇస్తే వచ్చికలుస్తా."

"బారిస్టరు ఇబ్రాహీం ఖాం. మంచిది జ్ఞాపకముంటుందిలే. ఈ సేవకుణ్ణి నాజర్ అలీ అంటారు నా కుటీరంమఛీబజారులో ఉంది. అడుగుతే సరి ఎవరైనా చెపుతారు."

* * *

బండి హైద్రాబాదు చేరింది. ప్లాటు ఫారంమీద బండి నెమ్మదిగా నడుస్తోంది. ప్లాటుఫారం జనంతో కిటకిటలాడుతోంది.

"మాకావా ఇక్కడకూడా స్వాగతం ఇవ్వడానికి ఎంతమంది వచ్చారో," అన్నాడు తాసిల్దారు.

బండిఆగింది. స్టేషనంతా పతాకాలతో అమోఘంగా అలంకరించబడింది. బాండు వాద్యంకూడా శ్రావ్యంగా వినవస్తూంది. ఆ బండిలో తాసిల్దారుమామ రెవిన్యూమంత్రి కూడా ఉన్నాడు. అతడు పరుగెత్తుకొచ్చి "అవే! నజీర్. బండిలో ఇబ్రాహీం ఖాం ఉన్నారా?", అన్నాడు.

"ఇదిగో వీరేగా," అని చూపించాడు తాసిల్దారు. రెవిన్యూమంత్రి వెండిపళ్లెంలోంచి పెద్ద పూలహారంతీసి ఇబ్రాహీంఖాం మెళ్లోవేశాడు. "ఇబ్రాహీంఖాం జిందాబాద్," అనే నినాదాల్తో స్టేషను మారుమోగింది వాద్యం "గాడ్ సేవ్ ది కింగ్" అని పాడింది. బారిస్టరు ఒకచేత్తో హాటుపట్టుకొని బొమ్మలానుంచున్నాడు ఆయనచుట్టూ అధికార్లూ, ప్రజలూ వినమ్రులై నిల్చొని ఉన్నారు. కొంతసేపైనతర్వాత హడావుడి శాంతించింది. తాసిల్దారుకిదంతా అయోమయంగా ఉంది.

"ఇదేం గొడవ", అని అడిగాడు తాసిల్దారు పక్కనున్న వాణ్ణి

"వాహ్! వెంటవస్తున్నావ్ నీకు తెలీదా? ఆయన మన కొత్తప్రధాని ఇబ్రాహీంఖాం" అన్నాడా కొత్తవ్యక్తి. ★

# ఒకే ఒక గంతు

ఎంతగా మానవుడు అరికడుతూంటే, అంతకంటె ఎక్కువ ఉధృతంగా గోదావరి వస్తుంది అనుకొంటాను. ప్రతీ యేడూ వరద రావడమే, ప్రతీ యేడూ రాదారిపడవ మీద కొన్నాళ్లు జనం వెళ్ళకపోవడమే ఏడాదిలో. ఇంతకూ రాదారీ పడవమీద పాకేజీ పెట్టెలు తప్ప, ప్యాసెంజర్లు ఎవరైనా వెడుతున్నారా ఈ రోజుల్లో అనేది ప్రశ్న! ఈ రోజుల్లో వెళ్ళకపోయినా, ఆ రోజుల్లో వెళ్లేవాళ్ళం—రాజమండ్రిలో రాదారిపడవ ఏ మధ్యాహ్నమో ఎక్కితే, మర్నాడుమధ్యాహ్నానికి పాలకొల్లు జేరుకుంటూ వుండేవాళ్ళము. మా కోంట్లు సర్వసాధారణంగా గదులు చూసుకొని, ఏ మినపరొట్టో సాయంత్రం ఫలాహారం చేస్తూ పెరుగు కొనుక్కొని త్రాగి, సాయంసంధ్యను విద్యేశ్వరం లాకు అప్రాంతాన్ని కాలం గడిపేవాళ్లు. ఇతిమ్మా జనం హోల్లోవుండే, ఆ ఆ అగికాడ జంతికలు శెనగుండలు, చల్లరొట్టెలూ అవీ కొనుక్కొని, తిని, ఇంత మజ్జిగో, నీళ్లో త్రాగి కాలం గడిపేవాళ్లు

అయితే వరద ఒకలా లేచిందీ అంటే, రాజమండ్రినుంచి నిడదవోలు దాకా ఖాళీ! ఒక్క పడవ వాళ్లు, పడవలో వేసిన సరుకు తప్ప! ఇది కొన్నాళ్లు పరిపాటిగా జరగడం నే నెఱుగుదును. సరిగా తేదీలవారీగా జ్ఞాపకం లేకపోయినా, అలా ప్రయాణం చేసిన రోజులు అనేకం వున్నాయి.

రాదారీపడవకు జనం ఎక్కడం ఆ వరద రోజుల్లో నిడదవోలులోనే! నిడదవోలు వద్ద, "వార్ఫ్", పూటకూటి ఇళ్లు, హడావిడి హెచ్చుగా వుండేది ఇప్పట్లా, బస్సులు, కారులు లేని రోజులవి. నర్సాపురం రయిలుపడనికాలమది రాజమండ్రిలో ఎకాఎకీ బెజవాడదాకాపోయే బండెక్కి, నిడదవోలువద్ద సాయంత్రం ఏ అయిదింటికో దిగి, అక్కడ మంచి చేసుకు, రాదారి పడవ గదిలో కూర్చునే రివాజువాణ్ణి—మా అత్తవారి వూరు, 'పెనుమంచిలి, వెడదామని సంకల్పం

పెనుమంచిలి వెళ్ళడం అంటే, 'మారుటేరు'లో తెల్లారగట్ల రాదారీపడవ దిగి, అక్కడో ఒంటెద్దుబండి చేసుకుని, ఆచంట చేరి, అక్కడనుండి నడకమీద మైలు మైలున్నర నడిచి, మర్నాటి ఉదయానికిగాని ఆవూరు చేరేవాళ్ళంకాదు. ఇది కొంతవఱకు కష్టమైనా, ఆ వయస్సులో కష్టమనిపించేది కాదు. ఎంతదూరమైనా నడిచేవాణ్ణి ఏ నిద్దూరపుపని అయినా చేసేవాణ్ణి! చేసి జయమందే వాణ్ణి! ఆ జయములోనే వుంది అసలు కీర్తి అన్నది అంతా!

ఇంతకూ ఏతావాతా చెప్పొచ్చేదేమిటంటే, ఆ మధ్యాహ్నము రైలెక్కి నిడదవోలులో దిగాను. ఆ రాత్రి రాదారీ పడవ ఎక్కదలచాను.

## కవికొండల వెంకటరావు

నిడదవోలులో ఆ రాత్రి పూటకూళ్లింట భోజనము చేయడానికి బుద్ధి పుట్టింది కాదు, అది అంత శుభ్రంగా వుండదనో ఏమో! అయినా బంధుదర్శనం కూడా నాకు ప్రియమే! ఆ కారణంగా అట్లపాడు-నిడదవోలు మధ్య తిరిగే బల్లకట్టురేవులో నిడదవోలువైపున వున్న "పిండికూరి"వారు మాకు బంధువులవడంచేత, అక్కడ బసచేసి, రాత్రి భోజనం గావించుకొని, అలా అలా రాదారిపడవ ఆవలివొడ్డునో ఈవలి వొడ్డునో ఎక్కొచ్చునే అభిప్రాయంతో ఆ "పిండికూరి"వారింటికి ఆ పూట వెళ్లాను.

"పిండికూరి" వారంటే మా చిన్న పినతండ్రిగారికి అత్తవారు. అసలు వారి యూరు గోలలమామిడాడ అయినా యిక్కడ నిడదవోలులో ఆ పిండికూరి సోదరుల్లో పెద్దతడు ఉద్యోగి అయి, అవూళ్లో ఒక యిల్లు కట్టడంచేత, ఆ వూరే మా చిన్న పినతండ్రిగారి అత్తవారివూరని చెప్పుకోవడం మామూలు. మరిన్నీ మా చిన్న పినతండ్రిగారి అత్తగారు, అత్తగారి తల్లి, ఇద్దఱు ముసిలివాళ్లు, ఒకరి కంటె ఒకరు ముసలివాళ్లై, ఇద్దఱూ వితంతువులై, ఆచార వ్యవహారాల్లో, ఒకరి కొకరు తీసిపోకుండా వుండేవారు. ఆ వృద్ధురాండ్రను మాదామనే తలంపు నాలో ఆ ప్రొద్దు ప్రజ్వలించింది వాళ్లు ఇద్దఱుండటంచేత ఒకరు కాకపోతే ఒకరు అయినా వంటపెట్టు చేయడానికి సమర్థురాండ్రని నా వూహ. అయినా నేతినేదంత? నా కోసం వాళ్లు కష్టపడే దెంత?

అంతా ఆ సంజ అలా ఎల్లపొద్దు పడే సరికి—భోజనం అదీ ముగించి నేను నిడదవోలుమడుగుకేసి చూచాను. "ఏమి అప్పుడే మడుగుకేసి చూస్తున్నావు! ప్రయాణమేనా ఏమిటన్నారు ఆ యిరువురూను

"మరేం పని? మిమ్మల్ని చూచాను. మాంచని ఎప్పుడు పడితే అప్పుడే చూడవచ్చు. అతడు ఇంటికి వచ్చేసరికి, చాలారాత్రి అయ్యేటట్టుంది," అని నేను నాతో వేళ్లే మాటమళ్లీ లేని కారణంగా పంచే బిగించి కట్టుకుని "సెల విప్పించండి." అన్నాను. వాళ్ళుకూడా "వెళ్ళిరా!" అన్నారు.

'వెళ్ళిరా' అన్నది తడవుగా, బల్లకట్టు ఎక్కాను; ఎదరవొడ్డు నంటి అప్పుడే రాదారిపడవలు నర్సాపురంకేసి పోతూ వుండడం చూస్తూ, "ఓరబ్బీ! అందులో ఒక పడవను అందుకోవాలి" అన్నాను. బల్లకట్టుతోసేవాడు, "అదెంతపని? రోజూ నే చేస్తూండేది అదేగా," అని బల్లకట్టుకు ఓ త్రోపు ఇచ్చాడు.

రాత్రి పడిందికాని, వెన్నెలగా వుంది శ్రావణశుద్ధ ఏకాసికాబోలు వర్షాకాలము అయినా, ఆనాడు మబ్బుగాని, వానగాని లేదు. నిడదవోలు మడుగులో నీరు నిచ్చివ్వంగా ప్రవహిస్తూవున్నది. చంద్రుని యొక్క మూర్తి కాంతి తప్ప మరే రెండో కాంతిలేదు. నీరు కలిగిన రంగుతోవున్నా, బాడినీరులాగు లేదు. గోస్తనది వెంపునుండీ, పొర్లు కలింగవాలు అవీ వప్పేడు అవుతూవున్నాయి, హోరుమంటూ ఆవలిగట్టు పచ్చపచ్చగా కనిపిస్తూవుంది. నేనూ బల్లకట్టతడూ కూడా మరో తొందరపాటుగాని, మరో ఏమఱుపాటుగాని లేకుండా, వెడుతున్నాము. అతగాడు "అందడం లేదండి, ఇక్కడ మడుగు," అన్నాడు, గడ బల్లకట్టుమీద పడేస్తూ, ఒడ్డుకట్టిన తాడు లాగుతూ!

మేము అప్పుడే ఒక రాదారిపడవను మించిపోయాం రెండో రాదారిపడవ తెడ్లు వేసికొంటూ పదాలు పాడుకుంటూ

## ★ ఒకే ఒక గంతు ★

నవ్వుతూ వుంది.—అది దాటిపోయిందా మతి పోలకొల్లు వెళ్ళే పడవ లేనట్టువుంది—

బల్లకట్టాతడు తాడు లాగుతున్నాడు. ఇక అట్లపాడు వైపుకి బల్లకట్టు చేరాలి! నేను బల్లకట్టు వెనుకకొసని నిడదవోలు వైపు నిలబడి వున్నాను. మధ్య మడుగమ్మట ఆరాదారీపడవ తెడ్లమీద పోలకొల్లువైపు అంతా దాటి పోయింది. వెనక భాగంకూడా రాదారీ పడవ నన్ను దాటిపోయింది అని చెప్పవచ్చు అపాళంగా కేకెయ్యపోగాను. "ఓహోయి? ఓ అబ్బీ! ఓ రాదారి పడవ అబ్బీ! గదులేమన్నా ఖాళీగా వున్నాయా? అని 'టాపు' మీద రాదారి పడవచుక్కాని పట్టుకొన్నాతణ్ణి పిలుస్తూ.

అతడు, "లేకేంఅండి! అన్ని గదులు ఖాళీయే! వెనకాలగదులు ముందుగదులు!" అన్నాడు. అతడామాటంటూనే వున్నాడు. రాదారి పడవ ఆమాత్రం ఎడమెంది బల్లకట్టుకు. ఏమాత్రం? ఒకగజం, రెండు గజాలు, మూడుగజాలు—ఇంకా దూరమవుతూ నేవున్నాము. దూకాను బల్లకట్టుమీదనుంచి—మడుగులో నే పడ్డానో—పార్లుకళింగలో కే కొట్టుకుపోయానో—అని అనుకొన్నారు అంతాను.—బల్లకట్టాతనితో చెప్పనైనా చెప్పలేదు. అతడు అలా వింటూ నేవున్నాడు. నా ప్రశ్న ఇంకా అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తూ నేవుంది.

నేను ఆదూకుదూకు అంజనేయుని దూకులాధూకి, రాదారి పడవ వెనుక కొసని చుక్కాని నడిపేవొయ్యకుతగిలి నిలబడ్డాను, ఆముఖ్యను వెన్నెల కరిగిపోయిందన్నట్టు! బలకట్టాతడు తన బల్లకట్టు మీద నిలబడి తన పని మఱచి చూశాడు నావంక. రాదారి పడవతెడ్డీత గాళ్లు చూసేరు తెల్లాపి నావంక.

"ఎంతపని చేశావయ్యా! ఎంతపని చేశావయ్యా!" అన్నాడు చుక్కాని నడిపే ఆసామీ! "ఎంతపనిచేశాను? ఇదిగో నీ బాటుగ! వెనుక గది చూపించు!" అన్నాను నేను.

"వెనకగది చూపించినట్టేవుంది ఈదాకా మాకు! చచ్చిపోదువు కాదుటయ్యా నీళ్ళలో పడి!" అని అన్నాడు. "మన్యనంతా నీకే! ఇది అందని మడుగుకూడాను" అని రెట్టించాడు. అంటే అతగానితో "నీరూ లేదు. నురగాలేదు అంతా వెన్నె"లంటూ చుట్టూ ఉపలక్షిస్తూ, వెనకగదిలో క్షేమంగా ప్రవేశించాను.

మఱి కిమన్నాస్తి కుక్కినపేనులా! నేను! కాని చావలేదు దానిలా! ★

వేణూ చాలా డిటెక్టివ్ కథలు చదివాడు.

డిటెక్టివ్ పుస్తకం ఏది వచ్చినా, ముందు కొనేవాళ్ళలో ముఖ్యుడు వేణూ!...అర్ధరాత్రిహత్య, అమావాస్యహత్య," నదిలో హత్య, పడిలో హత్య, కొండమీదహత్య, బండమీదహత్య, మేడమీద హత్య, ఓడమీద హత్య, ఆ హత్య...ఈ హత్య.... నీ...హత్య...నాహత్య... అబ్బబ్బ... ఎన్నో హత్యలు చదివాడు వేణూ!

ఇక శవాలకయితే... లెక్కే లేదు! ... కిటికీలో శవం, అద్దంలో శవం, అటకమీద శవం, శ్మశానంలో శవం, తలలేని, శవం, కాళ్ళులేని శవం, చచ్చిన శవం, బతికినశవం, మొండిశవం, శిఖండి శవం, కుర్చీలోశవం, బార్చీలో శవం, గూట్లోశవం...కుళ్ళినశవం, నీ.. శవం...నాశవం... చెప్పాగా...వాటి కయితే...లెక్కే లేదు. వేణూ ఇట్లోనూ, బీరువాలోనూ, పెట్టెల్లోనూ ... అన్నీ శవాలే...! అన్నీ హత్యలే...!!

ఐతే, ఇన్ని నవలలూ, కథలూ...చదివిన వేణూ...ఒక్క...డిటెక్టివ్ పుస్తకం అయినా ...రాయలేక పోవడం.... చాలా విచారించవలసిన విషయం!...వీళ్ళంతా ... ఇంగ్లీషు పుస్తకాల కాపీగాళ్లు...అంటాడు వేణూ! అమెరికాలో...ఏదో మూల హత్య జరిగిందని...ఏ గార్డనరో రాస్తే.. దాన్ని కాపీ కొట్టి...మద్రాస్ మౌంట్ రోడ్ లో అనో, బెజవాడ గవర్నర్ పేటలో అనో రాస్తాడు ఓ.. ఖూనీకోర్! ఖూనీకోర్ రచయిత పేరులెంక!—ఇలా డిటెక్టివ్ రచయితల్ని దుయ్యబడతాడు వేణూ, మిత్రుల దగ్గర... పడి బజార్ లో!

"పోనీ...నువ్వే డిటెక్టివ్ నవల రాయరాదూ!" అన్నాడు రామూ.

"ఇప్పుడు కాదు! అటైమొస్తే తప్పకుండా రాస్తాను! నే చెప్పాగా!—వీళ్లలా ...కాపీ బ్రతుకు బతికేం మనం! నిజంగా పరిశోధనచేసి, సహజంగా కథ రాస్తాం!...వేణూ పుస్తకం బజార్లోకి వచ్చిందంటే మిగతా డిటెక్టివ్ పుస్తకాలన్నీ మూలపడాల్సిందే...!" అన్నాడు వేణూ, రెండు చేతులూ...రెండు జేబులో ఉంచుకొని.

"ఔను...అటువంటి కథే రాయాలి!" అన్నాడు నవ్వుతూ రామూ.

"నా పుస్తకం...మరీ అంతగా ... అర్ధరూపాయి అయితే, అంత బాగోదేమో! ఓ రూపాయి అయితే, క్లాస్ గా ఉంటుంది! ఏమంటావ్?..." అన్నాడు వేణూ, సిగరెట్టు ముట్టించి—

"కాదూ...మరి!... అర్ధరూపాయి అయితే చౌకగా పడిపోతుంది!" అన్నాడు రామూ వెటకారంగా!

"ఒరే...రామూ! నా డిటెక్టివ్ నవల ఎన్ని వందల పేజీలు ఉంటే బాగుంటుంది?..." అని అడిగాడు వేణూ.

"ఓ మూడొందలూ...!" అనేసి ఊరుకున్నాడు రామూ.

"అబ్బ...మూడొందలే...!" అన్నాడు కొంచెం బిగ్గరగానే వేణూ.

"గొడవ చేయకయ్యా...!" అన్నారు ఎవరో!

"సినిమాకొచ్చి మాటలేంటి?..." అన్నారు మరొకరు.



# భయంకర పరిశోధన

"తర్వాత మాట్లాడుకుందాంలేరా!" అన్నాడు రామూ.

రామూ కూడా వాళ్ళలో కలిసిపోయాడు కానీ...లేకుంటే, వాళ్ళిద్దర్నీ...సినిమా హాల్లోనే హత్యచేసి ఉండేవాణ్ణి-అనుకున్నాడు వేణూ.

సినిమా విడిచిపెట్టేరు—"ఏమిట్రా...! గొప్ప...డిటెక్టివ్ పిక్చరన్నావ్! ఊరక బాదుస్తుందనుకున్నాను!! అసలు పిక్చర్లో సస్పెన్సే...లేదు! చప్పగావుంది కథ!..." అన్నాడు చప్పరించి వేణూ, చిత్రం గురించి

అసలు వేణూ...చిత్రం చూస్తేకదా!... అలా అనడం కూడా...ఓ గొప్ప! తన విమర్శనని, ఎవరేనా సంతోషించేరేమో... అని నలుగురువైపూ చూశాడు వేణు. వేణూ వైపు ఎవరూ చూడలేదు.

ఓనాడు కాలేజీలో ... ప్రశ్న వేస్తే, పాఠం చదవట మన్నారేమో అని... పాఠం చదివిన బాపతు అని...వాళ్ళకి కూడా తెలుసునేమో...మరి!

"రామూ...నే వస్తారా!...గుడ్ నైట్!!" అని, ఇంటికి బయలుదేరాడు వేణు

ఆ వేళ అమావాస్య! వీధిదీపాలుకూడా.. గుడ్డిగా కునుకుతున్నాయి మెల్లగా నడుస్తున్నాడు ఏమేమో ఆలోచిస్తూ వేణూ. ఇంతలో 'అమావాస్య హత్య' గుర్తుకు వచ్చింది. గుండె ఝల్లుమంది! ఆ కథలో—చచ్చిన చెంచయ్య 'హీఁహీఁ...' అంటూ యెదురుగా వచ్చి నుంచున్నటు అయింది!

"శ్రీ...శ్రీ..ఆ...ంజనేయం..!ప్ర... ప్ర..." అని వణికేసు వేణూ! —అమెరికాలో డిటెక్టివ్ నవలలురాసే డిటెక్టివ్ లంతా....రాత్రిపూట తిరిగి, పగటిపూట కథలు రాస్తారని—విన్నాడు. ఔను, తానొక డిటెక్టివ్ కదా, అలాభయపడితే... ఎలా? కథలో విషయానికే యింత భయపడితే, నిజంగా హత్యజరిగితే - శవాన్ని చూడొద్దూ?... అందుకని కొంత ధైర్యాన్ని తెచ్చుకున్నాడు.

ఇంతలో బ్రహ్మాండమయిన కేసు దొరికింది! సందులోకి వెళ్ళబోతూండగా—ఇద్దరు దొంగలు, దొరల వేషంలో వే ఉన్నారు, ఓ ఇంటిగోడ ఎక్కుతున్నారు. అది చూశాడు వేణూ!

ఒకడి చేతిలో అయితే, ఏదో తళ... తళ...మెరుస్తోంది! కత్తే అయివుండాలి!!

వీళ్ళిద్దరూ—ఆ ఇంట్లో ఎవర్నో 'హత్య' చేసివస్తారని నిర్ధారణ చేసుకున్నాడు వేణూ!

మొదటివాడు బూటువిప్పి, చేతో పుచ్చుకొని...గోడ ఎక్కాడు. రెండోవాడు మెల్లిగా తలుపుతట్టేడు. ఎవరూ మేలుకున్నట్టులేదు! ఇద్దరూ ఇంట్లోకి వెళ్ళారు.

ఇద్దరూ లోపలకు వెళ్ళగానే-వేణూ ఆ ఇంటిదగ్గరకు వెళ్ళి...రెండోవాడు పగం కాల్చిపారేసిన సిగరెట్టుని తీసి జేబులో పెట్టుకున్నాడు. ఆ తర్వాత ఆ చీకట్లో

(43 వ పేజీ చూడండి)

పిళ్లా సుబ్బారావుశాస్త్రి



# బుడుగు!
## చిచ్చుల పిడుగు

అందుచేత గుండు ఉండడం సుద్దదండుగ అన్నమాట. దండుగేమిటి డేంజరు కూడాను. ఉట్టిపుణ్యానికి మొట్టికాయలు కొట్టుతారు అందరూ.

అసలు దీనివల్ల అన్నీ డేంజరులే. ఇప్పుడు నాకు బోడిగుండు అనుకోండి. (నిఝంగా ఇప్పుడు లేదనుకో. పూర్వకాలం ఉండేది.) ఉంటే అందరూ పెంకిజెల్ల లిచ్చుకుంటారు. అప్పుడు నేను ఘట్టిగా వాళ్లనికొప్పచేస్తాను. ఒక్కొక్కసారి నిఝం కొరడాతో కొట్టేస్తాను. అప్పుడు పెంకిజెల్ల కొట్టినవాళ్లే నను పెంకి వెధవాయి అంటారు. వీటన్నిటికీ ఫలితం గుండుఉండడమేకదా.

ఇంకోటి ఈ గుండు మనకి ఉంటేనే డేంజరు కాదు. ఎవళ్లకిఉన్నా డేంజరే. అన్నీ డేంజరులే.

ఇప్పుడు సంబరానికి మానాన్నతో కలిసి వెళ్లామనుకో. అక్కడ గుండుఉండేవాళ్ళు చాలామంది ఉంటారు. మానాన్న మనని ఎత్తుకుంటాడు కదూ. అందుకని మనం ఎంచక్కా దగ్గిరికొచ్చిన ప్రతివాడి గుండు మీద, ఓ మొట్టికాయో, అందకపోతే చేలిగ్గా ఓ జెల్లకాయో కొడతాంగదా. కొట్టాలనికోటం. అలాకోట బుద్దేస్తుంది. నీకేనాపరి

ఓసారి మానాన్న నన్ను సంబరానికి తీసికెళ్ళాడు.

నన్ను ఎత్తుకోవద్దు సుమా. నా అంతవాడిని నేను అని. నాన్నని, ముందుగానే బెదిరించాను

బెదిరించడం అంటే ఏమిటంటే——

నాన్నెప్పుడే నా కోడ్డుమీద రెండు జడల పిల్లలాంటిదాన్ని చూసి, బావుంది కదురా బుడుగూ, మెల్లిగా ఈలవెయ్యగలవా అంటాడనుకో అప్పుడు నేను యీల వేస్తే ఆపిల్ల హు అని ఇలా మొహం పెట్టి కోపంగా గబగబా వెళ్లిపోయి, సందు చివర వెనక్కి తిరిగి నవ్వి మళ్లీ వెళిపోతుందనుకో. అనకేమో నాన్న నన్ను ముద్దు పెట్టుకుని అమ్మతో చెప్పకేం అంటాడు కదా? నాన్నకి నేను ముద్దిస్తే అమ్మకి ఎందుకు చెప్పకూడదూ? అయినా నాన్న వద్దన్నాడుగా. అందుకని నేను చెప్తానంటాను కదూ. అదీ బెదిరించడం అంటే.

### ఎప్పుడూ నిజం చెప్పకూడదు

చెప్తే పళ్ళు రాలగొట్టేస్తా నని నాన్న అంటాడు చూడు? అదికూడా బెదిరించడమే.

ఏం? ఎత్తుకోవద్దని నేను ముందస్తుగానే బెదిరించినా, జనం మట్టైస్తారు వెధవా అని నాన్న నామాట వినకుండా ఎత్తుకున్నాడు. సరే నాకేం అని, నేను దగ్గిరిగావచ్చిన వాళ్ల నెత్తిమీద మొట్టికాయలు కొట్టేస్తున్నాను వాళ్లకి ఎవళ్ళు కొట్టారో తెలీటం లేదనుకో. కాని, అంతట్లోకి ఇంకో తళతళమెరిసిపోయేగుండాయన దగ్గిరికి వచ్చాడు. వాణ్ణి నేను పూర్వం ఎరుగుదును కాని, ఎప్పుడూ తలపాగా పెట్టుకునే కనబడే వాడు నాకు. అందుకని ఆయనకి అలాంటి గుండు ఉందని తెలీదు నాకు. మా నాన్నకీ తెలీదు.

"నాన్నోయ్! చూశావా. వీడిది బోడి గుండు!" అన్నాను హాశ్చర్యపడి పోతూ.

నాన్న పకపక నవ్వేశాడు. నేను కూడా నవ్వేస్తున్నాను. అంతట్లోకీ ఆయన ఆ ఇరుకులోనే వెనక్కి తిరిగాడు. వాడు చాలా ఎత్తు నాన్న కన్నాను ... నాన్న నన్ను ఎత్తుకున్నంత ఎత్తు.

"ఏమిటా పొగరు ఎందుకలా నవ్వుతారు?" అన్నాడు వాడు.

"నా యిష్టం నీ గుండు చూసి నవ్వొచ్చింది" అన్నాను నేను.




"ఛప్ నీతో ఎవడు మాట్లాడాడు." అన్నాడు వాడు.

"నేను నీఅంత ఎత్తున్నాను నాతోనే మాట్లాడావు." అన్నాను నేను.

ఇంతట్లోకీ మానాన్న "ఛప్ ఊర్కోరా" అన్నాడు.

అప్పుడు ఎదురుగుండా ఉన్న గుండు వాడికి ఇంకా కోపం వచ్చేసింది.

"నన్ను చూసి నవ్వి, పైగా ఛప్ అంటావా" అన్నాడు.

"నిన్ను కాదు. మాఅబ్బాయిని" అన్నాడు నాన్న.

"నన్నే" అన్నాడు వాడు కోపంగా.

వాడు మానాన్నకి ఫ్రెపేటు చెప్తాస్తాడని నాకు అవమానం వేసింది. అందుకని నిజం చెప్పేశాను.

"యేయ్! అబ్బీ మానాన్న నిన్ను చూసి నవ్వాడూ, నన్ను ఛీ అన్నాడూ" అని చెప్పేశాను

"ఎందుకు నవ్వాలి? అంటూ" అన్నాడు.

"నేను నవ్వలేదు వాకి దేపనా" అన్నాడు నాన్న.

"నీకేం పనో నాకేం తెలుసు నువ్వు నవ్వావు అంతే." అన్నాడు వాడు.

"మా నాన్నకి రివిన్యూ బోర్డులో పని" అని చెప్పా నేను.

నామాట యెవళ్ళూ వినలేదు

"నేను నవ్వలేదు" అని అబద్ధం చెప్తాడు నాన్న

"నువ్వు నవ్వావు" అని నిజం చెప్తాడు వాడు.

యెలాగా? అంతట్లోకి నాకు మొటికాయ సంగతి జ్ఞాపకం వచ్చింది ఆ సందట్లో దటుక్కున ఒక్కటికొట్టాను వాడు అటు తిరిగి ఉన్నప్పుడు ఆ పెనకాతల ఇంకో అబ్బి ఇంకో పిల్లాడ్ని ఎత్తుకున్నాడు. ఆ పిల్లాడు నన్ను చూచి కాపీకొట్టాడు అంటే ఓ మొట్టికాయ కొట్టాడు.

అందరూ నవ్వేశారు. తిరవాత యుద్ధం జరిగింది దీనికంతో ఫలితం, ఆయనకి గుంటు వుండడమే గదా?

అలా అని పెద్ద ఫ్రొపెంగు ఉన్నా కష్టమే నమకో గుండుఉంటే ఫ్రెపేటు మేష్టరు ఒక దెబ్బ కొట్టేసరికి పారిపోవచ్చు. అదే ఫ్రొపింగు ఉంటేనా. ముందసుగా జటు గట్టిగా పట్టుకుని తిరవాత చాలాసేపు చితకొట్టేస్తాడు ఒక్కోసారి ఇలా పైకి ఎత్తి పట్టుకుంటాడు

ఇందాకా చెప్పానే సంబరంలో సంగతి. ఆ వేళ నాన్న. ఇంటికెళ్లాకా కోప్పడ్డాడు నామీద.

ఎందుకు వాణ్ణి బోడిగుండు అనాలి అసలు? అంటూ.

వాడికి నిజంగా గుంటుఉందిగా అన్నాను నేను.

"ఏడిశావు. బోడినిజం నువ్వూను" అని గసిరాడు నాన్న.

నాన్న ఇలా అనగానే ఎందుకో అమ్మకి నవ్వొచ్చింది.

వాడు చెప్పిన నిజం దాన్ని గురించే గా? అంది.

అప్పుడు నాన్నకి నిజం కోపంవచ్చింది వేళాపాళా ఉండద్దూ నిజం చెప్పడానికి అన్నాడు.












# ★ బుడుగు! చిచ్చుల పిడుగు! ★

ఇగో! నిజం చెప్పేస్తాను విను. నాకు ఇంత అనుభవం ఉందిగాని, ఈ నిజం అనేది ఎప్పుడు చెప్పాలో నిజంగా బాగా తెలీదు.

ఒక్కోసారి మాయింట్లో అమ్మ మినప రొట్టె చేస్తుందా ఆదివారంనాడు!

సరిగ్గా తినడానికి కూర్చునేప్పటికే కొందరు మీసాలవాళ్ళు నాన్నతో మాట్లాడడానికి వచ్చేస్తారు. ఎంత సేపటికీ లేచివెళ్ళరు. నాన్న వచ్చేదాకా అమ్మ నాకు రొట్టెని పెట్టదు. ఆ రొట్టె కాస్తా చల్లారిపోతోంది. ఎలాగా!

పాపం అమ్మ విసుక్కుంటుందికూడా. పోనీవాళ్ళకి పెట్టుదామంటే, మేం ముగ్గురం గదా అని కొంచెంగానే చేసింది మరి.

“కబుర్లు చాలు ఇంక ఇళ్లకి పొండి” అని గసుర్దామనుకో నామాట ఖాతరు చెయ్యరు.

“మినపరొట్టె చల్లారి పోతోంది, ఈ మీసాలవాళ్లు ఎప్పుడు పోతారో అని నాలోనేనే (వాళ్లకి వినబడేలా) విసుక్కుంటే, నాకు ఇలా మొహాలు పెడతారు. అనక నాన్న నన్నుపట్టుకుని మొట్టికాయ వేస్తాడు. నిజం అయితే మాత్రం అప్పుడెందుకు చెప్పాలని. మళ్లీ నవ్వుతాడు కూడా.

ఇంకోసారి ఇలాగే అయింది. నాన్న ఊళ్ళోలేడు. నాకు అర్జెంటుగా డబ్బు కావల్సింది. అమ్మని అడిగాను ఇలా అర్జెంటుగా డబ్బుకావాలి అని ఏడిస్తావు లేదుపో ఇంట్లో అసలే ఇబ్బందిగా ఉంది అంది అమ్మ.



— తుప్పజుట్టు వున్నామూడా చిక్కే —

నాకు నాన్నమీద కోపం వచ్చేసింది. అంటే పెన్సిగా రూ వాళ్లూను.

డబ్బు లివ్వకుండా ఊరెళ్ళి అమ్మని ఇలా కష్టపెడతాడాఅని. సరే నాకూ అర్జెంటుగా కావాలిగా పక్కింటి పిన్నిగారి దగ్గర ఓ అర్ధణా అప్పు అడిగాను ఓ కాణీ పెట్టి ఓ బొంగరంకొని, మిగతాడబ్బుతో బియ్యం బస్తా బొగ్గులూ అవీ కొందామని. ఆవిడ నామాట నమ్మదే మద్దిస్తాకా అంది అర్ధణా సంగతి మాట్లాడకుండా.

నాకు ఒళ్లు మండిపోయింది సుమీ. నిజం చెప్పినా ప్రజలు నమ్మరేమని. ప్రజలు

కాని నేను చెప్పింది నిజంకాదుట. అమ్మదగ్గిర డబ్బులు ఉన్నాయట. ఉత్తినే అంది లేదని.

లేదు అంటే ఇవ్వనని అర్థం అన్నమాట అని అప్పుడు తెలిసింది.

ఈ అమ్మమాటలు గబుక్కుని అర్థం అవవు.

అంతెందుకు. అమ్మపేరు రాధ కదా. నాన్న రాధా అంటాడు ఒక్కోసారి పిల్లా అంటాడు. అంటే నవ్వుతుందా. నేను అలా పిలిస్తే చవ్ వెధవకానా అంటుంది కోపంగానూ నవ్వుతూనూ.

ఓ సారేం బలేగా అయిందిలే

నాన్నేంచేశాడంటే - అదికాదు. ముందస్తుగా అమ్మ వంటింట్లో వంట చేస్తోంది నాన్న ఏంచేశాడంటే, తలుపు దగ్గర నుంచుని, అచ్చంగా నాలాంటి గొంతుకతోటే, “పిల్లావంటయిందా” అన్నాడు అనేసి నవ్వుతూ వంటింట్లో కెళ్లాడు. అమ్మ అటు వెనక్కి తిరిగి ఉందిగా. చూళ్లేదు. నేనే అనుకుంది.

ఆవకంగా, “వెధవకానా ఏమిటా పొగరు!” అంటూ గిర్రున ఇటుతిరిగింది.

(48-పేజీ చూడండి)



“నాన్నా మినపరొట్టె చల్లారిపోతోంది — ఈ మీసాల వాళ్ళు ఎప్పుడు పోతారో అంటూంది అమ్మ —”

# గాఢానురాగం

౬

గతసంచిక తరువాయి

కాంచనమాల రుగ్ణతపరిస్థితి విని చంద్రవర్మ ఉరకలు వేసుకుంటూ ధారానగరానికి పరుగెత్తుకువచ్చాడు. ఆమె తల్లిదండ్రులంతకుపూర్వమే విక్రమవర్మ భవంతికి చేరుకున్నారు. విక్రమవర్మ తల్లిదండ్రులుకూడా కాంచనమాల అనారోగ్య పరిస్థితిచూసి గుడ్లనీరు గుక్కుకోవడం ప్రారంభించారు నేను నానాటికీ కృశించిపోతున్న కాంచనమాల దేహస్థితిచూసి ఆమె మరి జీవించదనే అనుకున్నాను

కాని క్రమంగా కాంచనమాల ఆరోగ్యం కొంచెం కుదటపడడం ప్రారంభించింది. ఇంకొక నాలుగైదురోజులు గడిచేసరికి మరి కాంచనమాలకిక భయంలేదని అనిపించింది. తరవాత కొన్నాళ్ళకు కాంచనమాల తల్లిదండ్రులిద్దరు తమ భవంతికి వెళ్ళిపోయారు విక్రమవర్మ తల్లిదండ్రులకుకూడా కాంచనమాలకేమీ భయంలేదని ధైర్యం కలిగింది. అయినా అప్పటినుంచీ వాళ్ళు కాంచనమాలకింకా బాగా ఆరోగ్యం కలగడంకోసం గృహదేవతలకు పూజాపునస్కారాలు చేయించడం మొదలుపెట్టారు స్వయంగా తాముకూడాపూజాపునస్కారాలు ప్రారంభించి రాత్రింబగళ్ళా జంజాటంలో పడిపోయారు

చంద్రవర్మ రాకవల్లనే కాంచనమాల ఆరోగ్యం కొంచెం కుదటబడుతున్న సంగతి విక్రమవర్మ గ్రహించకపోలేదు ఆసంగతి చంద్రవర్మకూడా పసిగట్టాడు కాని అతడా పరిసితి గమనించినప్పటినుంచీ బాగా ఇరుకులో పడిపోయాడు. త్వరలోనే తిరిగి విశాలానగరానికి మరలిపోవాలని అనుకున్నాడు

క్రమక్రమంగా కాంచనమాల ఆరోగ్యం ఇంకా బాగా అభివృద్ధి చెందింది మంచం పట్టిపోయిన కాంచనమాల మళ్లీ లేచి భవంతిలో నాలుగుమూలలా మసలడం మొదలుపెట్టింది.

ధారానగరవైద్యులెవరికీ ఆమె ఆరోగ్యం క్షీణించిపోడానికిగాని, మళ్లీ కోలుకోవడానికిగాని కారణమేమో తెలియలేదు. ఇంకా కొంచెం గొప్ప రాజవైద్యులెవరినైనా పిలిపించి వైద్యం చేయిస్తే మంచిదని ఆ ఇంట్లో ఉన్నవారందరు అనుకున్నారు. విశాలాపురంలో అలాంటి పేరెక్కిన ఘనవైద్యులున్నారనీ వారిని పిలిపిస్తే మంచిదనీ చంద్రవర్మ అన్నాడు. కావలిస్తే వెంటనే తాను విశాలానగరం వెళ్లి ఆ రాజవైద్యులను వెంటనే ధారానగరానికి పిలిపించే ఏర్పాటు చేస్తానని కూడా చెప్పాడు.

ఆ మాట వినగానే కొంచెందూరంలో విశ్రాంతికోసం శయ్యపై ఒరిగిన కాంచనమాల ముఖకవళిక హఠాత్తుగా మారిపోయింది పక్కనే కూర్చున్న విక్రమవర్మ అది గమనించినా గమనించనట్టే నటించాడు. చంద్రవర్మ ఇక ఎవరివైపు చూడకుండా గవాక్షం కేసి చూస్తూ కూర్చున్నాడు. కొంతసేపటికి విక్రమవర్మతో వినబడీ వినబడనట్టుగా నెమ్మదిగా అన్నాడు :

“నేను రేపే విశాలాపురానికి బయలుదేరి రాజవైద్యులెవరినైనా ఇక్కడికి పంపిద్దామనుకుంటున్నాను.”

ఆమాటవిని కాంచనమాల చంద్రవర్మకేసి రెప్పవాల్చకుండా చూసింది విక్రమవర్మ

## ప్రాచీన గాథాలహరి

కొంచెం తటపటాయించాడు.

“పోనీ నేనే విశాలానగరం వెడితే?”

“మీరక్కడి రాజవైద్యుల నెవరినైనా ఎరుగుదురా?”

“ఒక్కవైద్యుణ్ని కొంచెం బాగానే ఎరుగుదును.”

“పోనీ నేనుకూడా మీతో వస్తాను!”

“మీరెందుకు? నేను తిరిగివచ్చేదాకా ఇక్కడే ఉండండి! ఇక్కడ ఎవరో ఒకరుండకపోతే ఎలాగ? మా నాయనగారు బొత్తిగా కాలుకదపలేని స్థితిలో ఉన్నారు! తలవనితలంపుగా ఏదైనా అవాంతరం వస్తే?”

అని విక్రమవర్మ ఆ నాటి సాయంత్రమే విశాలానగరానికి బయలుదేరాడు. వెళ్ళేటప్పుడు ముందుగా కాంచనమాలతో ఆ సంగతి చెప్పాడు. ఆమె కొంత సేపటివరకు అతనివైపు కళ్లెత్తి చూడనేలేదు. విక్రమవర్మ మళ్ళీ అడిగాడు:

“నేను బయలుదేరి వెళ్లనా మరి?”

దానిమీద కాంచనమాల మూతి బిగించింది:

“మీరు వెళ్ళవద్దు!”

“ఎవరో ఒకరు వెళ్ళకపోతే ఎలాగ?”

అని విక్రమవర్మ అలాగే ఆమె వైఖరి గమనించాడు.

“ప్రస్తుతం నాకేమీభయంలేదు. క్రమంగా నా దేహస్థితి దానంతట అదే కుదటపడుతుంది మీరు లేకపోతే నా కెందుకో గుబులు బయలుదేరుతుంది.”

“సరే గాని మళ్ళీ రోగం తిరగబెడితేనో?”

“ఏమైనా సరే! మీ రక్కడికి వెళ్ళడానికి వీలేదు.”

అని కాంచనమాల గట్టిగా విక్రమవర్మ చెయ్యిపట్టుకుంది. విక్రమవర్మ ఆమెను బుజ్జగిస్తూ నెమ్మదిగా చేతిపట్టు విడిపించుకున్నాడు:

“కాంచనమాలా! నేను మళ్లీ త్వరలోనే తిరిగివచ్చివేస్తాను ఎంతయినా రెండు మూడురోజులకంటె ఎక్కువ ఆలస్యంకాదు. నన్ను వెళ్లనీ ఏమో! ఎవరి హస్తవాసిలో ఏమి విశేషం ఉం[illegible] ఎవరు చెప్పగలరు? అక్కడి వైద్యులెవరయినా వ్యాధి పూర్తిగా నయంచేస్తారేమో. ఎందుకైనా మంచిది. కొంచెంముందుగానే మేలుకోవాలి”

అని విక్రమవర్మ నెమ్మదిగా విశాలాపురానికి బయలుదేరి వెళ్లిపోయాడు. కాంచనమాల అతడు కనిపించినంతవరకు రెప్పపాటు లేకుండా నిశ్చలంగా అతనివైపు చూచింది. తరవాత నీరసంగా కళ్ళు మూసింది. ఆమె కళ్ళు రెండు వేడి కన్నీటిలో నాని పోయాయి.

౭

తరవాత అపరాజిత ఒకటి రెండు నిమిషాలవరకు ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. రత్నావళి ఆమె నేదో అడగబోయింది. అది గ్రహించి అపరాజిత మళ్ళీ మొదలుపెట్టింది:

“రత్నావళీ! అదేమిచిత్రమోగాని ఆ మరునాడు కాంచనమాల అభ్యంజనస్నానంచేసి నూతనవధువులా ఎంతో చక్కగా అలంక

పి. గణపతిశాస్త్రి



# గాఢానురాగం



రించుకొని స్వయంగా గృహదేవతాపూజ చేసింది. అత్తమామలిద్దరికీ ఎంతో భక్తిగా నమస్కరించింది.

ఆతరవాత నాకు నమస్కరించింది. నే నడిగాను.

"కాంచనమాలా! ఏమిటిదంతా? సాక్షాత్తూ కొత్త పెళ్ళికూతురులా అలంకరించుకొన్నావే!"

"నేనీ వేళ పుట్టినరోజు!" ఆ మాటవిని నేనాశ్చర్యపోయాను. మేమందరము ఆమె రుగ్మతగొడవలలో పడి ఆవిషయమే మరిచిపోయాము. నేను కాళు కొంచెం వెనక్కి తీసుకొన్నాను 'నాకెందుకమ్మా నమస్కరిస్తావు!'

"చిన్నప్పటి నుంచీ నాకు తల్లివైనా తండ్రివైనా నీవే!"

అని కాంచనమాల ఆ పక్కనే కొంచెం దూరంలో నిలబడిన చంద్రవర్మకు కూడా నమస్కరించబోయింది. చంద్రవర్మ 'చిన్నవాణ్ణి నాకెందుకు నమస్కరించడం' అని పక్కకు తప్పుకున్నాడు. కాని అంతలోనే ఆమె అతని పాదాలపై వాలిపోయింది. అలాగ ఒక నిమిషంవరకు అతని పాదాలపై తలవాల్చి మళ్ళీ లేచి తన శయ్యపై కూలబడిపోయింది.

చంద్రవర్మ రెండు పాదాలు కాంచనమాల కన్నీళ్ళతో తడిసిపోయాయి. నేను కాంచనమాల ధోరణి గమనిస్తూనే ఉన్నాను. ఆమె కాశ్మీర శాలువా కప్పుకుని కుమిలి కుమిలి దుఃఖించింది ఆమె హృదయ విదారక శోకధ్వని తలుచుకుంటూంటే నా కిప్పటికీ గుండె తరుక్కుపోతూంది"

అని అపరాజిత ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది. మళ్ళీ ఒకటి రెండు నిమిషాలదాకా ఆమె మరి మాటాడలేదు. రత్నావళి ఎంతో ఆత్రంగా "ఆ తరవాత?" అని అడిగింది.

అపరాజిత మళ్ళీ మొదలు పెట్టింది:

"అసలు జరిగిందంతా ఆ తరవాతే జరిగింది ఆనాడు చంద్రవర్మ, నేను కాంచనమాల శయ్యపక్కనే కూర్చున్నాము మా ఇద్దరితోను ఆనాడామె ఎంతో ఉల్లాసంగా మాట్లాడింది. తనంతట తానే ఎన్నో ఛలోక్తులు విసిరింది కాంచనమాల అంత ఉత్సాహంగా ఉల్లాసంగా ఉండడం నే నెప్పుడు చూడలేదు తరవాత కొంతసేపటికి చంద్రవర్మ వాహ్యాళికి వెళ్ళిపోయాడు కాంచనమాల తల్లి దండ్రు లిద్దరు మళ్ళీ సాయంకాల పూజా పునస్కారాలలో మునిగిపోయారు.

నే నొక్కత్తెనే కాంచనమాల దగ్గర కూర్చున్నాను. చంద్రవర్మ వాహ్యాళికి వెళ్ళిపోయిన తరవాత కాంచనమాల ముఖంలో అంతగా ఉత్సాహోల్లాసాలు కనిపించలేదు ఆమె ఆ వేళంతా కలకలలాడుతూ ఆ భవంతి అంతా తిరిగింది. సాయంత్రందాకా మా ఇద్దరితోను, నవ్వుతూ, పేలుతూ మాట్లాడింది కాని తరవాత ఆమె ధోరణి మారిపోయింది చంద్రవర్మ దగ్గిర లేకపోవడంవల్ల నయితేనేమి, అటూ ఇటూ తిరిగి బాగా అలిసిపోవడంవల్ల నయితేనేమి ఆమె ఆ విధంగా మారిపోయి ఉండవచ్చునని అనుకున్నాను.

తరవాత బాగా చీకటి పడింది. కాంచనమాల తలిదండ్రులు విక్రమవర్మ తల్లిదండ్రులు భోజనాదికాలు ముగించుకొని నెమ్మదిగా విశ్రమించారు.

క్రమక్రమంగా రెండు ఝాములరాత్రి గడిచింది ఇంట్లోవారంతా సుఖంగా నిద్రిస్తున్నారు. చంద్రవర్మకూడా భవంతికి తిరిగి

వచ్చి కాంచనమాల నొకమారాప్యాయంగా పలకరించి ప్రాసాదంమీదికి వెళ్ళిపోయాడు.

నే నెక్కడే కాంచనమాల దగ్గర కూర్చున్నాను. కొంతసేపటికి నాకు కునికిపాట్లు వచ్చాయి.

అంతలో కాంచనమాల యమ యాతన పడుతున్నట్లుగా మూలగడం మొదలు పెట్టింది నేను రోగం మళ్లీ మొదటికి వచ్చిందేమోనని భయపడ్డాను కాంచనమాల పక్కమీదకూర్చుని ఆమె నెంతో ఆప్యాయంగా ఓదార్చాను:

"కాంచనమాలా! ఎందుకలాగ బాధపడుతున్నావు?"

"నా నాలుక పిడచగట్టుకు పోతూంది! నేనే నింక ఎంతో సేపు జీవించను!"

అని నాకేసిచూసి కళ్ళనీళ్లు పెట్టుకుంది

"అదేమిటి కాంచనమాలా! రోజంతా ఎంతో ఉత్సాహంతో తిరిగి ఇంతలో ఇలాగ మారిపోయావు! ఈ వేళ సాయంత్రం నేనిచ్చిన ఔషధం పుచ్చుకున్నావా? ఎవరినైనా వైద్యుణ్ణి పిలిపించమన్నావా?"

అని బాగా కంగారుపడుతూ అడిగాను. కాంచనమాల పెదవిపై ఒకచిరునవ్వు మెరిసింది:

"ఇంకా నాకు వైద్యులెందుకమ్మా! ఇక అంతా అయిపోయింది.. చంద్రవర్మ నొకమారిక్కడికి పిలుచుకురాగలవా?"

అని వినబడీ వినబడనటు బాగానీరసంగా అడిగింది

"ఎందుకలా గంటున్నావు! నేనిచ్చిన ఔషధం పుచ్చుకున్నావా? లేదా? దానితో నీకు బాగా నయమవుతుంది!"

అని వణికిపోతూ అడిగాను:

"ఆఁ పుచ్చుకున్నాను. కాని అది ఔషధం కాదు! విషం!"

అని కాంచనమాల తనపక్కనే ఉన్న ఔషధపాత్రికేసి నీరసంగా వేలెత్తి చూపించింది. అది నేనిచ్చిన ఔషధం కానే కాదు! కాంచనమాల చెప్పినట్టది విషమే! ఎక్కడ సంపాదించిందో! మరి ఆమె ఆ పాత్రిలోని విషం సగంవరకు తాగి వేసింది. నాకింక కాళ్లాడలేదు:

"ఎంతసేపైంది?"

"ఇప్పుడా! అప్పుడే చాలా సేపయింది"

అని కాంచనమాల మరి కళ్లుకూడా తెరిచే ఓపిక లేక మెల్లిగా కళ్లు వాల్చింది అప్పటికి ఆమె కంఠస్వరం బాగా నీరసించి పోయింది

౮

నాకా ప్రత్యుత్తరంతో నరనాడులూ కుంగిపోయాయి. ఏమిచెయ్యడానికీ పాలుపోలేదు. కాని నాపాదాలప్రయత్నంగా నన్ను చంద్రవర్మ దగ్గిరికి తీసుకు వెళ్ళిపోయాయి. నేనతన్ని గబగబా లేపి సంగ్రహంగా జరిగినదంతా చెప్పాను. అతడు నేనుకలిసి వెంటనే కాంచనమాల శయ్య దగ్గిరికి పరుగెత్తుకు వచ్చాము. నేనతనితో త్వరగా విషవైద్యుల నెవరినైనా పిలిపించమని చెప్పాను.

కాని ఏం లాభం! అప్పటికే వ్యవహారం అంతా మించిపోయింది. అక్కడనించి కదిలి వెడితే ఇక ఘడియలలో కాంచనమాలను చూచే అదృష్టంకూడా దాటిపోతుం దేమోనని చంద్రవర్మ చాలా భయపడ్డాడు. ఆ మాటే మెల్లిగా నాతో అన్నాడు.

అంతే! చంద్రవర్మ మరి మాటాటలేదు. అంతలోనే మా ఇద్దరి అడుగుల సవ్వడీ విన్న కాంచనమాల హఠాత్తుగా కళ్లు తెరిచింది. అప్పటికే ఆమె నేత్రాలు, ఆమె శరీరం అంతటా శైతిల్యం కమ్ముకుంది

కాని ఆమె నేత్రాలు, ఆమె చూపులు అలాగే జాజ్వల్యమానంగా నిలిచి వెలిగాయి! చంద్రవర్మను చూసీ చూడగానే ఆమె నేత్రాల్లో నేకాక ముఖంలో కూడా ఆనంద చైతన్యం కలకలలాడింది!

ఆ ఆఘాతంతో చంద్రవర్మ శిలా ప్రతిమలా అలాగే నిలబడిపోయాడు! అంతలో నే అతని కేమితోచిందో! కాంచనమాల సగం తాగివిడిచిన విషపాత్రి చేతి దొరకబుచ్చుకుని ఒక్క గుక్కలో అదంతా తాగివేశాడు.

నేను కాంచనమాల మీది మమకారం కొద్దీ ఆమె వైపే చూసూ అలాగే ఆశయ్య పక్కనే కూలబడిపోయాను. అంతే గాని చంద్రవర్మ అలాగ సాహసిస్తాడని కలలో కూడా అనుకోలేదు. లేకపోతే నేను ముందుగా కొంచెం జాగ్రత్తపడి ఉందును. ఏమైనా గతి జల సేతుబంధనంవల్ల ప్రయోజన మేమిటి?

అటు పిమ్మట చంద్రవర్మ వంటనే కాంచనమాల శయ్య మీద కూర్చుని ఎంతో ఆప్యాయంగా ఆమెశిరస్సుతన ఒడిలో పెట్టుకున్నాడు. ఒళ్లు తెలియని ఆవేశంతో ఆమె నేత్రాలపై ముద్దుల వర్షం కురిపించాడు. ఆ స్పర్శానందంతో తిరిగి కాంచనమాలకు చైతన్యం కలిగిందేమో! ఆమె అతన్ని గాఢంగా కౌగలించుకుని అతని నుదుటపై శాయశక్తులా గట్టిగా ముద్దు పెట్టుకుంది చంద్రవర్మ తిరిగి ఆమె నేత్రాలు రెండు అదిమి గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు అంతే! ఆ ఆనంద పారవశ్యంలో నే కాంచనమాల నేత్రాలు రెండు శాశ్వతంగా మూసుకుపోయాయి.

అది చూస్తూనే చంద్రవర్మ స్పృహ తప్పి ఆ పక్కనే ఒరిగి పోయాడు ఇదంతా నీతో చెప్పడాని కింతసేపు పట్టిందిగాని ఒకటి రెండు నిమిషాల్లోనే అంతా జరిగి పోయింది!

నా కౌతుకంలో చంద్రవర్మ ప్రాణాలైనా రక్షించాలని అనిపించింది. వెంటనే ఆ విషయం భవంతిలో ఉన్న విక్రమవర్మ తల్లిదండ్రులకు తెలియజేశాను. అంతవరకు వారంతా కాంచనమాలకు బాగా నింపాదిగా ఉన్నదిగదా, అనే భ్రమలోపడి సుఖంగా నిద్రపోతున్నారు

వెంటనే లేచి వారందరు ధారానగరంలోని విషవైద్యుల ఇళ్లకు పరుగులు పెట్టారు.

అప్పటికప్పుడే రాత్రి మూడోయామం సగంవరకు గడిచింది. పోయింది. అంత అపరాత్రివేళ నిలుచున్నపాటుగా విషవైద్యులెక్కడ దొరుకుతారు!

అయినా తెల తెల్లవారే వేళ ఒకరిద్దరు విషవైద్యులు వచ్చారు. అప్పటికి చంద్రవర్మ ఇంకా కొనఊపిరితో మూలుగుతూనే ఉన్నాడు విషవైద్యులు శాయశక్తులా వైద్యాలు చేశారుగాని చివరికేమీ ప్రయోజనం కలగలేదు చంద్రవర్మ మూసినకళ్లు మరి తెరవలేదు అలాగే ప్రాణాలు విడిచాడు.

అప్పటికింకా తెల్లవారలేదు. ఇంటో ఉన్నవారందరు ఒళ్లెరగని శోకావేశంతో

## 'ఎందుకేనా మంచిదని!'

దొంగతనం చేశాడన్న నేరంపై ఒక ఆసామిని కోర్టులో హాజరుపరచారు. ముద్దాయి తరఫు న్యాయవాది అద్భుతంగా వాదించాడు చివరకి నిందితుడు నిర్దోషి అని మేజస్ట్రేటు తీర్పు నిచ్చాడు.

కోర్టు అవతల, న్యాయవాదికి, ముద్దాయి కృతజ్ఞత తెలుపుకున్నాడు. చివరకి "నెల వండే తాపీగా తమ దర్శనం చేస్తాను" అన్నాడు

"చూడుబాబూ కాస్త తెరిపి చేసుకుని పగటిపూటే పరామర్శకిరా సుమీ" అన్నాడు దూరదృష్టిగల న్యాయవాది

 

# గాఢానురాగం



ఎలుగెత్తి అంగలారుస్తూ దుఃఖిస్తున్నారు. నాకసంతా ఏదో మహా భయంకరమైన పీడ కలలా కనిపించింది. ఎందుచేతనో ఆ సమయంలో నాలో దుఃఖం అంతా స్తంభించిపోయింది. దానితోబాటు శరీరంమీది స్మారకంగా కూడా తప్పిపోతున్నట్టనిపించింది.

నేనలాగే జీవచైతన్యం లేకుండా పడి ఉన్న కాంచనమాలా చంద్రవర్మల ముఖాల వైపు చూస్తూ కూర్చుండిపోయాను. అక్కడి దీపంకూడా వారిద్దరి ముఖాలకేసీ నిశ్చలంగా చూస్తూన్నట్లే కనబడింది

కాని ఆ ముఖాలు చూస్తూంటే నాకెంతసేపటికీ వారిద్దరు మరణించారనే నమ్మకమే కలగలేదు మరణించినా వారి ముఖాలలో ఆనందతౌరళ్యం అలాగే తాండవించింది. వారి పెదవుల పై చిరునవ్వాలాగే వాడని దివ్య పారిజాతంలా మెరిసింది! వారిద్దరి ముఖాలు మృత్యుదేవతను చూచి చిరునవ్వులు నవ్వుతున్నట్లుగానే కనిపించాయి

ఎండకన్నెరగక ఐశ్వర్యాలతో తులతూగుతూ కళ్లుమూసినవారి ముఖాలెన్నో నేను చూచాను. మరణించిన ఉత్తర క్షణంలోనే వారి ముఖాలత్యం భయంకరంగా మారిపోయాయి. కాని కాంచనమాలా చంద్రవర్మల ముఖాల్లో ఎక్కడా విషాదచ్ఛాయా లేశమైనా పొడగట్టలేదు. ఆ అద్భుతఘట్టం నాకే క్షణానికికూడా కళ్ళకు కట్టినట్టుగానే కనిపిస్తూంది."

అని అపరాజిత ఒకటిరెండు నిమిషాల వరకు అలాగే కూర్చుండిపోయింది. రత్నావళి ఆ విషాదగాథవిని ఉస్సురని ఒక దీర్ఘ నిశ్వాసం విడిచిపెట్టింది. తరవాత ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. అంతలో అపరాజిత మళ్ళీ తనగాథ మొదలుపెట్టింది:

"రత్నావళీ! వివాహమైనప్పటి నించీ కాంచనమాల ఎంతటి దురంత వేదన అనుభవించింది! విక్రమ వర్మ అనురాగం చవి చూచిన కొద్దీ ఆమెలోని ఆ యాతన మరింతగా ఇనుమడించింది.

చంద్రవర్మమీది మమకారం అంతా మళ్లించు వేసుకోవాలని ఆమె ఎంతైనా ప్రయత్నించింది. భర్త మనస్సు నొప్పించకూడదని తన మనస్సాయన పాదాలపై నిలుపుకోవాలనీ ఆమె ఎంతగానో ప్రయత్నించింది! కాని అలాగ ఎంతగా ప్రయత్నించినా అది సాధ్యంకాలేదు. ఆ నిరంతర యాతనవల్లనే ఆమెలో అలాంటి అసాధ్య వ్యాధి ప్రవేశించి ఆ విధంగా ఆమె జీవచైతన్యం అంతా దహించి వేసింది!

ఎన్ని మారులు నొక్కి నొక్కి ప్రశ్నించినా ఆమె తన హృదయం దుఃఖం ఎన్నడు నాతో వెళ్ళబోసుకోలేదు! ఎంత సన్నిహితంగా అడిగినా ఒక్క చిరునవ్వు నవ్వి ఊరుకునేది అంతే! చివరి రోజుల్లో ఆమె కేవలం నరక యాతనే అనుభవించిందనుకో! ఇక మరి ఆ యాతన భరించలేక ఆవిధంగా విషం తాగి హాయిగా కన్ను మూసింది. కాంచనమాలను చిన్నప్పటినించీ నా కన్నకూతురుకన్నా ఎంతో అల్లారు ముద్దుగా పెంచుకున్నాను. చివరికామె జీవితం అలాగయి పోయింది"

ఆపైన అపరాజిత గద్గద స్వరభారంతో మరి మాట్లాడలేక పోయింది. ఒక్క నిమిషం సేపాగి మళ్ళీ మొదలు పెట్టింది:

"రత్నావళీ! కాంచనమాల జీవితం తలుచుకున్నప్పుడల్లా ఎవరైనా ఇద్దరు అన్యోన్యానురాగంతో సుఖిస్తూంటే దైవం కూడా అదిచూచి ఓర్వలేడనే అనిపిస్తుంది. లేకపోతే కాంచనమాలా చంద్రవర్మల వివాహానికన్ని విఘాతాలెందుకు రావాలి? వారిద్దరి జీవితాలు చివరి కలాగెందుకు బుగ్గి అయిపోవాలి!

వీరిద్దరి మాటేమిటి! ప్రపంచంలో ఎక్కడ చూచినా ఇంతే! స్త్రీ పురుషులలో ఒకరికి ఎవరి మీదనైనా ఇంకొకరిమీద బాగా మమకారం కుదిరిందనుకో! ఆ రెండవ వారికి తిరిగి వారిమీద అనురాగం కలగనే కలగదు! ప్రపంచంలో చాలా చోట్ల జరిగేదింతే. ఒక వేళ ఎవరికైనా ఇద్దరి మధ్యన గాఢానురాగం కలిగిందనుకో! వారిద్దరికీ చివరికి వివాహమే జరగదు! ఒక వేళ బ్రహ్మాండం మీద అలాంటి వివాహమే జరిగినా అది ఆట్టే కాలం నిలవదు! ఆ ఇద్దరిలోను ఎవరో ఒకరు మరణించడమో లేకపోతే మరేదో విద్దూరమో జరుగుతుంది అంతే!

ప్రపంచంలో అందరు అనురాగాలనీ మమకారాలనీ ఊరికే తల్లక్రిందులై పోతారు గాని అసలు అనురాగాలు లేని వాళ్ళే హాయిగా సుఖపడతారని అనిపిస్తుంది. ఒక వేళ ఎవరికైనా మరి ఎవరి మీదనైనా కొంచెం అనురాగం కలిగిందంటే అది ఏదో విధంగా గుండెల్లో ఒక పెద్ద కుంపటిలా మారిపోయిందన్నమాటే! ఇంకా ఎక్కువ గాఢానురాగమే కలిగిందంటే దానితో ఆ మనిషి బతుకంతా బుగ్గి అయిపోయినట్లే!

నిజంగా అసలు అనురాగం అంటే ఏమిటో తెలియని వాళే అదృష్టవంతులు! ఆలోచించగా ఆలోచించగా నాకలాగే తోస్తూంది."

అని అపరాజిత ఏదో ఆలోచిస్తూ కథ అంతటితో నిలిపివేసింది. అది గమనించి రత్నావళి మెల్లిగా నిట్టూర్చి అడిగింది:

"అయితే విక్రమవర్మకు భార్యను ఆవిధంగానైనా చూచే అదృష్టం కలిగిందా?"

అపరాజిత సమాధానం చెప్పింది:

"అదే చెబుతున్నాను! ఆ మరునాడు ఝాముపొద్దెక్కేసరికి విక్రమవర్మ విశాలాపురం నించి రాజవైద్యుల నిద్దరిని వెంట బెట్టుకువచ్చాడు. ధారానగరంలో అడుగు పెట్టగానే అతని కావిషాద వార్త కొంచెం మాచాయగా తెలిసింది. అంతేగాని స్పష్టంగా ఏమి జరిగిందో తెలియలేదు. అది విన్నవెంటనే అతడు ఉరకలు వేసుకుంటూ భవంతి గుమ్మంలో అడుగు పెట్టాడు.

—సశేషం.

# నా నోరు



[తరిగొప్పుల శాంతాదేవి]

హరియనమంటే ఎంతచెప్పినా
అనజాలదురా నా నోరు
దేశసేవకై పాటుపడెదనని
దీక్ష వహింపదు నా నోరు.

లెక్కలేని తన తప్పులన్నియును
కప్పిపుచ్చుకొను నా నోరు
ప్రక్కవారినీ దెప్పి పొడుచుటకు
బయలుదేరురా నా నోరు.

ఇతరుల మంచిని చెప్పుటకెపుడూ
ఇష్టపడదురా నా నోరు
తనగొప్పను తా చెప్పుకొనుటకే
తయారౌనురా నా నోరు.

తినుటకుమాత్రం తనకుతానుగా
తెరచుకొనునురా నా నోరు
వచ్చినవారిని ఆదరించుటకు
విప్పబడదురా నా నోరు.

ఇతరుల గొడవలు మనకెందులకని
ఊరుకోదురా నా నోరు
లొంగినవాళ్ళను లోకువజూచి
తిట్టసాగురా నా నోరు

తిననుమించి సుఖపడువారిని -
చూచిసహింపదు నా నోరు
ఏదోలోపము జూపి వారినీ
ఏడిపించురా నా నోరు

పరులచూచి పరిహాసించుటకు
పరుగెత్తునురా నా నోరు
లంచములిచ్చిన వారినిమాత్రం
రక్షించునురా నా నోరు

అక్కడి విక్కడ ఇక్కడి వక్కడ
అందించునురా నా నోరు
దానిఫలితమును తెలుసుకోదురా
తగవులమారిది నా నోరు.

వచ్చినవారిని మెచ్చుకొనునురా
నీతిలేనిదిర నా నోరు
దాణావేసిన వారిని తప్పక
దీవించునురా నా నోరు.



నేపాల్ ప్రధానమంత్రి
శ్రీ తంకప్రసాద్ ఆచార్య.

# ★ దేశరక్షణదృష్ట్యా కీల

# టిబెట్, నేపాల్, సిక్కిం

నవంబరు నెల ఆఖరివారంలో ఒకే రోజున ముగ్గురు అతిథులు ఢిల్లీ విమానాశ్రయంలో దిగారు.

ఒకరు దలైలామా.

మరొకరు పంచన్‌లామా.

వేరొకరు సిక్కిం రాజా.

స్వతంత్రభారతదేశంలో మొదటిసారిగా వీరు అడుగుపెట్టారు.

టిబెటన్ మతానికి, రాజ్యాంగానికీ కూడా అధినేత దలైలామా. టిబెట్ ప్రపంచానికి మకుటంలాంటి దేశం. ఈ దేశానికి చుట్టూ హిమాలయపర్వతాలే దుర్గమ దుర్గాలవలె విస్తరించి ఉన్నాయి. శతాబ్దాల తరబడి ఇతర ప్రపంచంతో సంబంధం లేని విచిత్ర దేశం. ఈ దేశాన్ని పాలించే లామాలు కట్టుకథల్లోని వ్యక్తులుగా ఒక ప్పుడు కనిపించేవారు.

ఈనాడు లామాలందరికీ అధినేతలైన దలైలామా, పంచన్‌లామాలు భారతదేశంవచ్చి బుద్ధజయంత్యుత్సవాలలో పాల్గొన్నారు. అవలోకితేశ్వరుని అవతారమైన దలైలామాకు, అమితాభ బుద్ధుని అంశగల పంచన్‌లామాకు ఆతిథ్యంఇచ్చే అవకాశం భారతీయులకు కలిగింది.

దలైలామా (21 సం॥), పంచన్‌లామా (22 సం॥) ఇద్దరూ యువకులే. ఒక్కసారిగా నాగరిక ప్రపంచంలోకి అడుగుపెట్టడంతో దలైలామా ఉక్కిరిబిక్కిరయ్యారు. అమూల్య కాషాయాంబరాలు ధరించి, బాలునివలె మందహాసంచేస్తూ, దూపరుల హృదయాలను తస్కరిస్తూ, "దలైలామాకీ జై" అనే నినాదాలమధ్య, ఒక చేయి నెహ్రూ, మరొక చేయి డా॥ రాధాకృష్ణన్ పట్టుకుని నడిపిస్తుండగా వేదిక ఎక్కి టిబెటన్ భాషలో "నా రాకతో భారత టిబెట్ దేశాల సాంస్కృతిక, ఆధ్యాత్మిక బాంధవ్యం దృఢతరమౌతుందని నా నమ్మకం. మీ ఆదరాభిమానాలకి నా కృతజ్ఞత," అని ప్రకటించారు.

చైనావారి శిక్షణలో ఆత్మవిశ్వాసం పెంపొందించుకుని ఆరితేరి, చైనా సైన్యాలు టిబెట్‌ను ఆక్రమించుకున్న తరుణంలో టిబెట్‌లో అడుగుపెట్టిన పంచన్‌లామా కూడా, భారత ప్రజలు తమకిచ్చిన ఆతిథ్యానికి కృతజ్ఞత ప్రకటించారు.

సిక్కిం మహారాజా, కొడుకు కోడలు వెంటరాగా, లామాలు దిగిన కాసేపటికి విమానాశ్రయంలో దిగారు వారికి కూడా భారత ప్రభుత్వం రాజోచిత సత్కారం ఇచ్చింది.

## నవచైనా యాత్రికుడు

వీరు వ మూడురోజులకు నవంబరు 28 న చైనా ప్రధాని చౌ ఎన్ లై ఢిల్లీ విమానాశ్రయంలో దిగారు. ప్రధాని నెహ్రూతో చెట్టా పట్టాలు వేసుకుని, "భారత చైనాలస్నేహం వర్ధిల్లా" లనే నినాదాలు మారు మ్రోగుతుండగా భారత ప్రజలఆతిథ్యానికి చౌ ఎన్ లై కృతజ్ఞత ప్రకటించారు.

వీరందరూ భారత దేశాన్ని దర్శిస్తున్న సమయంలోనే ఈనెల 3 వ తేదీన మరొక అతిథి వచ్చారు. ఆయన నేపాల్ ప్రధాని శ్రీ తంక ప్రసాద్ ఆచార్య. బుద్ధుడు జన్మించిన దేశంనుండి. బుద్ధుడు నిర్వాణం పొందిన దేశానికి, పరినిర్వాణ జయంతి జరుగుతున్న తరుణంలో నేపాల్ ప్రధాని అతిథిగా రావడం గొప్ప విశేషం. శ్రీ తంక ప్రసాద్ భారతాతిథ్యానికి కృతజ్ఞత తెలుపుతూ, నేపాల్‌లో ప్రజాస్వామ్యం కోసం తాము సాగించిన పోరాటానికి మహాత్మాగాంధీ సిద్ధాంతాలే ఒరవడి పెట్టాయని, శాంతి అభ్యుదయాలకు చిహ్నమైన భారతదేశమే ముందు ముందుకూడా తమకు ఆదర్శప్రాయ మనీ అన్నారు.

ఇందరు అతిథులు ఒక్కసారిగా భారత దేశం రావడం, అందులో అందరూ భారత దేశానికి ఉత్తర సరిహద్దులలో నివారు కావడం రాజకీయంగా ప్రాధాన్యం కలిగిన సంఘటన.

## "పంచశీల"

ప్రజల ఆర్థికజీవనాన్ని పటిష్ఠంచేసే కార్యక్రమంలో భారతదేశం ముందుకు సాగిపోతోంది. ఈ కార్యక్రమం నిర్విరో



పంచన్ లామా, చౌ ఎన్ లై.

## ...కస్థానాలలో వున్న



# ...ం, భూటాన్ల చరిత్ర



భూటాన్ రాజు జిగ్మె వాంగ్ చుక్.

ధంగా నెరవేరడానికి ప్రపంచమంతటా శాంతి, సహకారవాతావరణం అత్యవసరం. భారత విదేశాంగనీతి ఈ సూత్రం మీదనే ఆధారపడిఉంది. ముఖ్యంగా దేశం సరిహద్దులలోను, సరిహద్దుల కవతలా స్నేహ బాంధవ్యం పాటించేదేశాలు ఉండడం ఎంతైనా అవసరం.

ఈనాడు భారతదేశానికి శత్రువు ననుకునే దేశం ఒక్కటే తూర్పు పడమటి సరిహద్దుల్లో ఉన్నది. పాకిస్థాన్ మినహాయిస్తే మిగతా సరిహద్దురాజ్యాలు, ఆసియా రాజ్యాలు, అన్నీ భారతదేశంపట్ల స్నేహం, గౌరవం పాటిస్తున్నాయి.

భారత, చైనాదేశాలు కలిసి ప్రతిపాదించిన 'పంచశీల' ఆధారంగా ఈ స్నేహ గౌరవాలు ఏర్పడ్డాయి. 'పంచశీల' ను 'ప్రపంచశీల' గా భారతదేశం రూపొందించింది దీన్ని పటిష్టం చెయ్యడమే ఇటీవల ఇంవిరు అతిథులను భారతదేశానికి ఆహ్వానించడంలో అంతర్యం

అయితే ఈ దేశాలతో భారతీయుల స్నేహసంబంధం ఈనాటిదికాదు.

బుద్ధుని జన్మస్థలమైన కపిలవస్తు ఇప్పుడు నేపాల్ లోనిదే నా, ఒకప్పుడది అంతా భరతఖండంలోనిదే. వేషభాషల్లో, మత విశ్వాసాలలో నేపాలీలకు భారతీయ సంపర్కమే ఎక్కువ సంస్కృత సాహిత్యాన్ని "నేపాల క్షితిపాలురు" ఎంతో ఆదరించి పోషించారు

("నేపాల క్షితిపాల ఫాలతిలకే పంకేన శంకేత కః". నేపాలరాజులు బురదతో తిలకం పెట్టుకున్నా, కస్తూరి తిలకంగానే భాసిస్తుందిగాని పంకమనే శంక కలగదని పూర్వం ఒక సంస్కృతకవి చమత్కరించాడు. నేపాలంలో అంత సమృద్ధిగా కస్తూరి లభిస్తుందని భావం.)

## నేపాల్ వెళ్లిన రాష్ట్రపతి

రాష్ట్రపతిపదవి స్వీకరించిన తరువాత భారతదేశం దాటి ఎన్నడూ ఏ దేశానికి వెళ్లనిడా|| రాజేంద్ర ప్రసాద్ అక్టోబరు 21 వ తేదీన మొదటిసారిగా నేపాల్ వెళ్లారు. నేపాల్ కు వెళిన మొదటి విదేశ అధినేతకూడా మన రాష్ట్రపతే భారత రాష్ట్రపతిని నేపాలీ ప్రజలు అత్యంత గౌరవ భావంతో సత్కరించారు. నేపాల్ రాజు మహేంద్ర, రాణి రాజ్యరత్న రాష్ట్రపతిదంపతులను పుష్పమాలాలంకృతులను చేశారు. నేపాల్ తో స్నేహ సంబంధాలు అభివృద్ధి చేసుకునే ఉద్దేశంతో తాను వచ్చాననీ, నేపాల్ లో అభివృద్ధి ప్రణాళికలకు భారతదేశం ఆర్థిక సహాయం చేస్తుందనీ రాష్ట్రపతి హామీ ఇచ్చారు.



...హా. దలైలామా.

భారత దేశానికి నేపాల్ తో నేకాదు, ఆ ప్రాంతాలలో నే ఉన్న సిక్కిం, భూటాన్, టిబెట్, చైనా దేశాలతో కూడా ప్రాచీన సంబంధా లున్నాయి బౌద్ధమతం ఉచ్ఛదశలో ఉన్న కాలంలో ఆయా దేశాలకు మన దేశానికీ మధ్య రాకపోకలు, వాణిజ్య సంబంధాలు విరివిగా ఉండేవి మన బౌద్ధ మతాచార్యులు ఆ దేశాలకు వెళ్ళి బౌద్ధ ప్రచారం చేశారు. ఆ దేశాలనుండీ ముఖ్యంగా చైనానుండి, యాత్రికులు మన దేశం వచ్చి ఏళ్ళతరబడి ఇక్కడ నివసించి మన నాగరికతా వైభవాన్ని తమ దేశీయులకు తెలియజేశారు. మనదేశానికీ, ఆదేశాలకుమధ్య ఎప్పుడూ స్నేహమే తప్ప వైరమనేది లేకపోవడం, ఆ స్నేహమే ఈ ఆధునిక యుగంలోకూడా క్రొంగొత్త రూపాల్లో కొనసాగుతూండడం గమనించదగిన విశేషం.

## త్రివిష్టపం (షాంగ్రిలా)

మంగోల్ జాతికి చెందిన టిబెట్ దేశం 1950 నుండీ కమ్యూనిస్టు చైనాలో అంతర్భాగంగా ఉంటోంది. దీనివైశాల్యం 4 60,000 చ. మైళ్లు జనాభా ఎంతో ఖచ్చితంగా తెలియదుగాని ఏభైలక్షలవరకూ ఉండవచ్చునని అంచనా. ఇక్కడి జనులు టిబెటన్, మంగోల్ భాషలు మాట్లాడతారు. బౌద్ధమత శాఖ అయిన లామామతం ప్రచారంలో ఉంది. టిబెట్ ను ఒకవిధంగా మతరాజ్యమని చెప్ప వచ్చును. లామాలసంఖ్య జనాభాలో

# టిబెట్, నేపాల్, సిక్కిం, భూటాన్‌ల చరిత్ర

అధిదోవంతు. 15వ శతాబ్దం నుంచి రాజ్యాధికారం దలైలామా, పంచన్ లామాల చేతుల్లో ఉంది. వీరిహోదా ఒకటే గాని, దలైలామాకే రాజ్యాంగంలో అధికారం ఎక్కువ. ఒక దలైలామా చనిపోగానే, ఆయన మరొకచోట పునర్జన్మ ఎత్తుతాడని టిబెటన్లు నమ్ముతారు. అలా జన్మించిన వాడికోసం అన్వేషించి అతనికి పట్టంకడతారు. పంచన్ లామాను కూడా అలాగే ఎన్నుకుంటారు. ముఖ్యపట్టణమైన లాసా పట్టణంలో "పొతాళ" బౌద్ధ విహారంలో దలైలామా, తషీలుంపో అనే పర్వతారామంలో పంచన్‌లామా నివసిస్తారు. దలైలామాకు పరిపాలనలో సహాయంచేసే మంత్రివర్గాన్ని "కషగ్" అనీ, లామాల శాసనసభను "త్సోంగ్డూ" అనీ అంటారు.

దలైలామా చనిపోయినా, మళ్లీ జన్మించి దలైలామా అవుతాడని నమ్ముతారు గనుక, పూర్వపుదలైలామాలు చేసిన పనులనుకూడా తానేచేశానని ఇప్పటి దలైలామా అంటారు. ఏ జంకూ గొంకూ లేకుండా ఇప్పటి దలైలామా "నేను అయిదువందల ఏళ్లకిందటే చైనాతో సంధి చేసుకొన్నాను" అని అనగలరు. 1939 లో 13వ దలైలామా చనిపోగా, 14వ దలైలామాకు పట్టంకట్టి, అతనికి యుక్తవయస్సు వచ్చేదాకా "ప్రతినిధి"ని ఏర్పాటు చేశారు. 1947 లో పూర్వపు "లామా ప్రతినిధి" జాచెన్ దలైలామాను చంపడానికి, ఇతర లామాలతో కలిసి కుట్రలన్నీ తిరుగుబాటు చేశాడు. కాని తిరుగుబాటు అణచివేయబడింది. జాచెన్ ఖైదులో చనిపోయాడు మిగతా తిరుగుబాటు 250 కొరడాదెబ్బలు, యావజ్జీవంఖైదు, కళ్లు పీకించడం వగైరా శిక్షలు వేశారు.

## కీలక ప్రాధాన్యం

టిబెట్ భౌగోళికంగా కీలక స్థానంలో ఉంది జారిస్టు రష్యా, బ్రిటిషు ఇండియా ఒకరిని చూసి ఒకరు భయపడే రోజుల్లో టిబెట్ ప్రాధాన్యం పెరిగింది. టిబెట్‌పై చైనా అధిపత్యాన్ని బ్రిటను ఆ రోజుల్లో స్వీకరించింది 1890 లో జరిగిన ఒడంబడిక ప్రకారం సిక్కిం, టిబెట్ సరిహద్దులగుండా వ్యాపారం జరుపుకోవడానికి ఉభయులూ అంగీకరించారు. కాని ఈ ఒడంబడిక రష్యన్ జోక్యంవల్ల అమలు జరగనే లేదు. దానిమీద, 1904 లో బ్రిటిష్ ప్రభుత్వం సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్బెండ్ నాయకత్వాన లాసాకు సైన్యాన్ని పంపింది. టిబెటను లొంగిపోయి 1890 ఒడంబడికను మన్నిస్తామన్నారు. గ్యాంజీ, గార్టక్, యాటుంగ్‌లలో వ్యాపార కేంద్రాలు ఏర్పరచుకోనివ్వడానికి, 75 లక్షల రూ॥ నష్టపరిహారం 75 ఏళ్లలో ఇవ్వడానికి టిబెటన్లు ఒప్పుకున్నారు. కాని రెండేళ్ల తరవాత 1906 లో మరొక ఒడంబడిక చైనాతో జరిగింది. టిబెట్‌ను ఆక్రమించుకోమని, టిబెట్ పరిపాలనలో జోక్యం చేసుకోమనీ బ్రిటిష్ వారు హామీ ఇచ్చారు టిబెట్‌లో ఇతరుల జోక్యానికి అనుమతించమని బ్రిటనుకు చైనా హామీ ఇచ్చింది అడ్డంకులు లేకుండా వ్యాపారం చేసుకోవడానికి వీలుకలిగింది. టిబెటన్ వ్యాపార కేంద్రాలకు ఇండియాకుమధ్య టెలిగ్రాఫ్ సౌకర్యాలు ఏర్పరచడానికికూడా బ్రిటన్‌కు అధికారం లభించింది. 1922 నుంచీ టెలిఫోను సౌకర్యాలుకూడా ఏర్పడ్డాయి.

చైనాలో ప్రథమవిప్లవం తరవాత టిబెటన్లకూ, చైనీయులకు సంఘర్షణలు జరిగాయి కాని 1914 లో బ్రిటన్ జోక్యం చేసుకుని అప్పుడు భారతదేశంలో విదేశాంగ కార్యదర్శిగా ఉన్న సర్ హెన్రీ మెక్‌మహాన్ ద్వారా ఒడంబడిక కుదిర్చింది. టిబెట్ స్వతంత్రదేశమని చైనా అంగీకరించింది ఆ తరవాత చైనా వరసగా కల్లోలస్థితిలో ఉండడంమూలంగా టిబెట్ పూర్తిగా చైనీస్ ఆధిపత్యాన్ని తొలగించుకుని స్వతంత్రంగా ఉంటూ వచ్చింది.

## చైనా దండయాత్ర

1949 అక్టోబరులో చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది. టిబెట్‌ను "విముక్తం" చేస్తామని చైనా ప్రభుత్వం 1950 జనవరి 1వ తేదీన ప్రకటించింది. సెప్టెంబరు 30వ తేదీన చైనా ప్రధాని చౌఎన్‌లై తిరిగి ఆ ప్రకటన పునరుద్ఘాటించారు. చివరకు అక్టోబరులో చైనా సైన్యాలు టిబెట్‌పై దండెత్తి ఆక్రమించుకున్నాయి.

1950 ఏప్రిల్‌లోనే టిబెటన్ ప్రతినిధివర్గం ఒకటి, చైనీస్ ప్రతినిధులతో సంప్రదింపులుజరిపి, చైనా టిబెట్లమధ్య విభేదాలు పరిష్కరించుకునే ఉద్దేశంతో భారతదేశం వచ్చింది. జూన్‌లో హాంగ్ కాంగ్ వెళ్ళి చైనా ప్రతినిధులతో సంప్రదించడానికి ఏర్పాట్లు చేసుకున్నది. కాని బ్రిటిష్ అధికారులు వీసాలివ్వకపోవడం చేత హాంగ్ కాంగ్ వెళ్ళడం పడలేదు. అందుచేత ఢిల్లీలోని చైనీస్ రాయబారితోనే సంప్రదింపులు సాగించవలసి వచ్చింది. ఈ సంప్రదింపులు ఎటూ తేలకుండా అక్టోబరు 1వ ఆగిపోయాయి,



బుద్ధజయంతి ఉత్సవాలకు
భారతదేశంవచ్చిన సిక్కింమహారాజా.

భారతప్రభుత్వపు సలహామీద టిబెటన్ ప్రతినిధులు పెకింగ్‌కే సరాసరి వెళ్లి మాట్లాడదామనుకున్నారు. ఇంతలో టిబెట్‌లోకి చైనా సైన్యాలు ప్రవేశించాయి. పశ్చిమ చైనాలోని సికాంగ్, చింగాయ్ రాష్ట్రాలగుండా చైనీస్ సైన్యాలు ప్రవేశించి సరిహద్దు స్థావరాలను ఆక్రమించుకున్నాయి. లాసాకు 300 మైళ్లలో ఉన్న చాందో అనే పెద్ద పట్టణాన్ని కూడా పట్టుకున్నాయి. టిబెటన్ల సైన్యం అంతా కలిపి పదివేలకు మించి లేదు. పెద్ద పోరాటమేమీ జరగలేదు.

## భారత ప్రభుత్వ నిరసన

అక్టోబరు 27వ భారత ప్రభుత్వం చైనీస్ దండయాత్రకు విచారాన్ని, ఆశ్చర్యాన్ని వెల్లడిస్తూ ప్రకటన చేసింది. టిబెటన్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించి ఉండవలసిందని, టిబెటన్ ప్రతినిధులకు హాంగ్ కాంగ్ వీసాలు దొరక్కపోవడంవల్ల వారు రాలేకపోయారేగాని ఇష్టం లేక కాదనీ, దానికి టిబెటన్ల తప్పిదం ఏమీ లేదని భారత ప్రభుత్వం తెలిపింది. దీనికి అక్టోబరు 30వ చైనా సమాధానమిస్తూ, టిబెట్ చైనా అంతర్భాగమనీ, ఇతరుల జోక్యాన్ని సహించమనీ తీవ్రంగా చెప్పింది. ఇతరుల ప్రోద్బలంతోనే టిబెటన్ ప్రతినిధులు పెకింగ్‌కు రావడం ఆలస్యం చేశారనీ, అసలు భారత వైఖరిలో చైనా శత్రువుల ప్రభావం కనిపి

(55 వ పేజీ చూడండి)

# మంత్రాలు: నమ్మకాలు

## మంత్రాల తత్త్వం ఏమిటి?

నా అనుభవాలు కొన్ని చెబుతాను. ఒక మహాకవి చతుర్విధ కవిత్వములను అనర్గళముగా చెప్పగా విన్నాను. ఆశక్తి ఆయన కెట్లువచ్చినదని వాకబు చేసినాను ఆయన ఉచ్ఛిష్ట గణపతి ఉపాసకుడని విశ్వసనీయ వర్గాలద్వారా తెలిసింది. నిజమే ననుకొన్నాను. కష్టపడి ఆమంత్రాన్ని పునశ్చరణ చేసినాను. సంవత్సరముల తరబడి నష్టకష్టాలపాలైనాను. తర్వాత కనుగొన్నాను ఈ వెచ్చించిన కాలమును చదువుకు వినియోగించి యుండిన ఎంత బాగుండెడిదని.

కనులార గాంచినది: భార్యాభర్తలిద్దరు అన్యోన్యానుకూలత లేకయుండిరి అతని కామెను తన కనుకూలురాలుగా చేసికొనవలెనని బుద్ధిపుట్టినది ఒక మంత్రగాని నాశ్రయించినాడు ఆతడిట్టి కార్యములందు దిట్ట అని ప్రతీతి. ఆయన రహస్యముగ తన గోడు వెళ్ళబోసికొని నా కాపురము నిలబెట్టుమని కాళ్ళు పట్టుకొన్నాడు. అతడు దీక్షపూనినాడు. మంత్రోదకాలిచ్చినాడు. తాయెత్తులు కట్టినాడు. హోమాలు చేసినాడు. వందలాదిగ డబ్బులాగినాడు. తుదకామె మంత్రగానికి వశ్యమైనది. అది మంత్రప్రభావమే నేమో ? లోగుట్టు పెరుమాళ్ళ కెరుక.

మాయూర నొకమంత్రవాది అమావాస్య ఆదివారమునాడు అర్ధరాత్రిమున స్మశానములో మంత్రోపాసనకు పూనినాడు వెంట సంగరతుకు లున్నారు. అందులో నేనొకడను. కొండి పూడ్చిన శవమును పైకిదీసి, దానిపై దిసమొలతో కూర్చుండి అనుష్ఠానమునకు ఆరంభించినాడు పదినిమిషములలో ఆచిమ్మచీకటిలో అతడు కెవ్వున కేక వేసి పడిపోయినాడు. పదిఅడుగుల దూరములో నొకగోరీచాటున ఒక గాడిద కాళ్లుకొట్టుచు చీదరించుచు మాత్రముండినది. ఎట్లో అతనిని ఇల్లు చేర్చితిమి. కొన్ని మాసములకు గాని ఆయన మరల మనుషులలో కలవలేదు మంత్రసిద్ధి యేమోకాని, జ్వరసిదిమాత్ర మాతనికైనది.

మాయూరిలో సాయెబులు యంత్రాలు వేయుటకు ప్రసిద్ధి సన్నపిల్లలకు గ్రహచికిత్సలు, వాయువులకు బిళ్లలు దూరగ్రామములనుండి వచ్చి వేయించుకొని పోవుదురు. కొందరు గుణమిచ్చినదని చెప్పకొనుట విన్నానుకూడ. మాచిన్నపాపను అతనికి చూపగా ఇది బాలగ్రహము. మందులు పట్టవు యంత్రము వేయించిన మూన్నాళ్ళలో గ్యారంటీగా కుదురునని హామియిచ్చినాడు. నాయందతనికి గౌరవమే లెండి ఆతనిమాటపై విశ్వాసముతో మాపాప నాసుపత్రికి తీసుకొనిపోకుండ ఆచికిత్స చేయించితిని. రెండవనాడే మాపాప మాకుమాత్రము కష్టము పెట్టి తన కష్టము కడతేర్చుకొన్నది.

దయ్యముల విషయములలో నిట్టియనుభవములే కొన్ని చూచాను. దయ్యాలున్నవని నేటికిని చాలామందికి నమ్మకమే. మా యూరిలో పాతఊరికి ఎక్స్‌టెన్‌షన్‌కు నడుమ గోరీలున్నవి. ఆప్రాంతమున నిత్యము దయ్యములు తిరుగుట చూచినవారిప్పటికి నున్నారట ఆ దయ్యాలెట్లుంటాయో చూడవలెనని నాకు కుతూహలం. నేటికి నా ఆశ లీడేరలేదు. ఒకనాడదేపనిగ రాత్రి 12, 1 గంటలనడుమ నటువైపే పోవుచుంటిని ఒక బాటసారి పరుగెత్తివచ్చుచుండెను నేను కొంచెము నిలిచితిని. 'అయ్యా! దయ్యం' అని డగ్గుత్తికతో నాచెంత కతడువచ్చెను అతనికి ధైర్యము చెప్పి అతడు చూపినచోటికి పోయి టార్చిలైటు వేసితిని. కుక్క కొక్కును పట్టుకొనుచున్నది. అదిచూచి అతనిగుండెదడ తగ్గినది.

చాలామందిని దయ్యాలకబుర్లు చెప్పువారిని నిలదీసి అడుగగా ఎవరో తమకు చెప్పినారని ప్రత్యక్షమున చూడలేదని పలుకుచుందురు. ఇట్లే దేవతామహిమలు కూడ. ఈ మంత్రాలు, దయ్యాలు, దేవతలు ఒకొక్కప్పుడు కాకతాళీయముగ ఫలించినట్లే కనబడును. అంతమాత్రమున వానిని యథార్థములని విశ్వసించుట విజ్ఞానమనిపించుకొనదు. ఎన్ని దేవతలకు మ్రొక్కినను ఏమియు ఫలితము కలుగక ఏడ్చువారిని మన మెంతమందిని చూచుటలేదు? ఇక దానికి నీ ప్రారబ్ధమని ఉత్తరము చెప్పుదురు. మరి? ప్రారబ్ధముతో నగువానికి దేవుళ్లు, దయ్యాలు, మంత్రతంత్రాలతో అంటకట్టడం ఏమిటిది? అని అడిగితే నాస్తికులంటారు. 'సత్యమైతే అందరికీ సత్యముకావలెను. అసత్యమైతే అందరికీ అసత్యములు కావలెను ఆస్తికులకు ఉండడము, నాస్తికులకు లేకపోవడం అని ఉంటుందా?

సచ్చిదానందరూపమైన బ్రహ్మమే ప్రకృతి అను ఉపాధితోకూడి జీవుడను పేరుతో వ్యవహరింపబడుచున్నది ఈ ఉపాధిని విడిపించుకొన్నచో జీవుడు శుద్ధ పరబ్రహ్మమగుననుట అద్వైతసిద్ధాంత సారాంశం. ఆ జీవపదార్థము మాత్రావిషయవాసనామాలిన్యము నింకను పొంది మనస్సయినది. అది జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు నియంత్రయై ఏకాదశేంద్రియ మనబడుచున్నది. అయినను మనస్సు మహాశక్తివంతమైనది మంచి చెడ్డలకు మనస్సే మూలకారణము. మనోదార్ఢ్యమువలన మహాకార్యములు నిర్విఘ్నముగ నెరవేరుచున్నవి. 'మనోబలంతు మాండవ్యః' అను వాక్యమే అందుకు సాక్ష్యము అట్టిమనోదార్ఢ్యము మహాత్ములకు స్వతస్సిద్ధముగనే ఏర్పడును. వారు ఘనకార్యములు నవలీలగ చేయగలుగుదురు.

అట్టిదార్ఢ్యము లేనివారికి దార్ఢ్యముకలుగజేయు సాధనములె మంత్ర తంత్ర యంత్రాదులు. మనసు నిలుకడ లేనివారికి మంత్రాదులును పనిచేయజాలవు. దృఢనిశ్చయముతో తదేకమనస్సుతో మంత్రానుష్ఠానము చేసిన అభీష్టసిద్ధి యగుటకుమాత్ర మనుమాన మనవసరము మంత్రమననముతో మనసు మంత్రాధిష్ఠాన దేవతగా మార్పుచెందును నేత్రాదీంద్రియములకు తద్రూపముననే ప్రత్యక్షమగును దేవత ప్రత్యక్షమగుట అన తనమనస్సే ఆరూపమున తనకు కనిపించినదని గూఢార్థము. నిజముగ దేవత కొకరూపమున్నది కనుకనా?

ప్రియురాలిని మననము చేయువానికి తద్రూపముననే ప్రత్యక్షమగును. మహాదేవతను గాని క్షుద్రదేవతను గాని మననము చేసిన నదేవిధముగనే అగుపడును. కావుననే మనోబలము కలవానికి మంత్రసిద్ధి అయితీరును. మనోబలము చాలనివానికి మంత్రతంత్రాలు

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

గను మాత్రము పని చేయలేవు. ఆ తత్త్వము తెలిసినవారికి కాదు; దేవతలు దయ్యములు సత్యములా? అసత్యములా? అను వివేకము తనకు తానే కలుగును. మరి మంత్రాలు దయ్యాలు నిజమా? అబద్ధమా? వేరె చెప్పనేల! అందువలననే కొందరు క్షుద్రమంత్రోపాసకులు భీకర జుగుప్సారూపముల మననము చేయుచు, ఆ మననమున ధైర్యము చాలక మనోవికలత్వమునకు గురియగుచున్నారు. సౌమ్యరూపముల మననము చేయువారట్టి ప్రమాదముల నంతగా పొందుట లేదు. దయ్యములును మనోబలము చాలనివారిని పట్టి పీడించును కాని, ధైర్యము కలవానిని బాధించుట లేదని మనయనుభవమున తెలిసిన విషయమే. తేలిన దేమనగా మనోధైర్యమే దేవత. మనోభయమే దయ్యము. చాల మట్టుకు అబలలకే దయ్యముల బాధ ఏల? మనోదార్ఢ్యము చాలమియే కారణము. ఇందులో మరొక చమత్కారము కూడ కలదు. కొందరు తమ కోరికలను నెరవేర్చుకొనుటకును, ఇతరుల నేడిపించుటకును, దయ్యము పట్టినదని అభినయించుట చాల కలదు. ఆ దొంగదయ్యాలకు, దొంగమంత్రాలు, దొంగతంత్రాలు కావలసివచ్చును.

ఇక తంత్రము. ఆ మంత్రమననము చేయుటకు ఉపష్టంభకముగ తంత్రములు బయలుదేరినవి. తంత్రమనగా మనోభావకు ప్రత్యక్ష వాతావరణ సన్నివేశము. దేవపూజకు (భావనకు) విగ్రహము - శుచిస్థలము - పూజాద్రవ్యములు - ఉత్సవములు - తీర్థప్రసాదములు మొదలైనవి తంత్రకలాపాలు. సౌమ్యదేవతోపాసనకు ప్రశాంత వ్యవస. క్షుద్రదేవతోపాసనకు భీకర, రౌద్ర, భీభత్స వాతావరణ కల్పన. అందుకే వానికి కల్పములని ప్రథ. శ్మశానము, శవము, విభూతి కుంకుమములు, బలులు, వేపమండలు, కటుపరుష వర్ణోచ్చారణము, 'హుం ఫట్' మొదలగు బీజములు కల్పతంత్రములు. ఈ తంత్రములచేత ఉపాసకుని మనస్సునందు లేదా పీడితుల మనస్సునందు అనుకొన్న వాతావరణము సృష్టింపబడును.



మనస్సు ఆయా భావములను మననము చేయు పరిస్థితికి వచ్చును. తద్వారా అభీష్టసిద్ధి కావచ్చును.

కాని యెట్టి వాతావరణమునందును వికలము చెందని మనోదార్ఢ్యము కలవానికి ఈ మంత్రతంత్రములు ఏమియు చేయజాలవు. ప్రశాంత మనస్కునకు భీకర దృశ్యముల వలన ప్రమాదము లేదు కదా! 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః' అని మహాకవి వాక్యం. అంతే కాదు వాతావరణాన్ని తనలో ఉపసంహరించుకొనగల శాంతిమూర్తికి ప్రకృతి విజృంభణము దాసోహ మనును. మునుల సముక్షమున క్రూరసత్వములు సయితము క్రూరత చూపవని గ్రంథాదుల వర్ణితము.

ఇంతకు తేలిన ఫలితాంశం. మంత్రతంత్రములు మనోదౌర్బల్యము కలవారిపైన పని చేయును గాని, ధైర్యవంతులపైన పని చేయజాలవు. ఇంతవరకు ఈ పత్రికాముఖమున ప్రకటించిన మంత్రాల మహిమలు నూటికి తొంబదితొమ్మిదివరకు కాకతాళీయముగ ఫలించినవనుకొన్నవి కొన్ని, దొంగదయ్యాలు దొంగమంత్రాలు కొన్ని, నిజమయిన వనుకొన్నను మనోబలమువలన ఫలించినవి కొన్ని, మనోదౌర్బల్యమువలన మానవుని మనసుపై ప్రభావము చూపినవి కొన్ని, కనుకట్టులూ ఇంద్రజాలములు మరేవో కొన్ని ఈ రీతిగా నానారకములుగ నున్నవి. అసలు మంత్రాలలో తత్త్వమిది.

జె. వి. శర్మ—తాడిపత్రి.

* * *

## చెట్టు తిరగవేయుట

మా వూరిలో ఒక మహమ్మదీయ మంత్రవేత్త ఉన్నాడు. అతను కంటికి సంబంధించిన వ్యాధులు అనగా పచ్చకామెరు, వుబ్బుకామెర్లు మొదలగు కామెర్లకు మంత్రం వేస్తాడు. దానినే చెట్టు తిరగవేయుట అంటారు. ఈ వ్యాధి సోకినవారు రావనవసరములేదు రోగి పేరు, ఇంటి పేరు, గోత్రం, గ్రామం తెలియజేసిన చాలును అతను ప్రతిగురువారం ఆదివారం చెట్టు తిరగవేస్తాడు ఆ రోజులలో నిష్ఠగా ఉంటాడు. అతనికి చదువు రానందున వచ్చిన కాగితములను చదువుకున్నవారి దగ్గరకువచ్చి చదివించుకొంటాడు. అట్లా మనము చదువుతున్నప్పుడే మంత్రం లోలోపల పఠిస్తాడు. అతడు ఇట్లు చెట్టు తిరగవేసినందుకు డబ్బులు యేమీ పుచ్చుకోడు. అతనేమి వున్నవాడు కాదు. బీదవాడు మాత్రమే. డబ్బు తీసుకున్నచో మంత్రము పనిచేయదట. ఇతను దాదాపు 10 సం॥ల నుండి పై వుపకారము చేస్తున్నాడు.

మంత్రాలమీద నమ్మకము లేనివారికొక సలహా. మీ గ్రామములోగాని, లేదా మీ యిరుగు పొరుగు గ్రామములలోగాని యెవరికైనా కామెర్ల వ్యాధి ఉన్నచో ఒక కార్డుపై యింటిపేరు, పేరు, గోత్రము, గ్రామము పేరు వ్రాయించండి; మూడు వారములలో పూర్తిగా నయమగును అసలు ఒక వారమునకే జవాబిస్తాడు. అట్లు కానిచో మరల తెలియపర్చిన తప్పక నయమగును. వివరములు మాత్రం తప్పులేకుండా వ్రాయవలెను అతని అడ్రసు. షేకు కీలారు సాహెబు, కుందుర్రు పోష్టు, నర్సరావుపేట తాలూకా, గుంటూరుజిల్లా.

కుందుర్తి శ్రీకృష్ణమూర్తి,
కుందుర్రు (గుంటూరుజిల్లా).

* * *

చాలదినముల క్రింద అనగా 10 సం॥ క్రితం, ఒక స్నేహితుడు తాను మంత్రించినచో పాము, తేలు వగైరా విషజంతువుల వల్ల కలుగు బాధలు నివారణ అగునని చెప్పగా నేను - నమ్మలేదు. అప్పుడతను ఒక అరటిదవ్వ తీసుకవచ్చి చివరను ఒక తేలు చేత కుట్టించెను మేము చూచుచుండగానే అరటిదవ్వ పూర్తిగా విషపూరితమై రంగుతో నిండిపోయెను. ఆ విషపు రంగుగల దవ్వను అతడు చేతపట్టి తేలుకుట్టిన చోట వేలువుంచి మంత్రం వుచ్చరించగా 5 నిమిషములలో క్రమంగా మేము చూచుచుండగా రంగుతిరిగి దవ్వకు ఎప్పటి తెలుపు వచ్చెను విషము కరిచినచోట గూడుకట్టి నిచెను. మంత్రములందు నమ్మికలేని నాకు యీనాటికి అది మరపురానిది.

మా గ్రామంలోనే కర్ణపిశాచి అను నీచగ్రహ వుపాసకుడు ఒకడు గలడు. అతను మన జేబులో ఎంతవున్నది, ఉదయంనుండి గనిజేరికి ఎంత ఖర్చు చేసినది, ఇంటివద్ద ఎంత సొమ్ము జేబులో వేసినది కొన్నాళ్ళక్రితం వరకు చెప్పుచుండెడివాడు. మనతో మాట్లాడుచు మధ్యను చెవిపట్టుకొని "ఆ-ఏమిటి-మరలచెప్పు" అని మనం టెలిఫోనులో మాట్లాడినట్లు అనెడివాడు. గాని ఇప్పుడు పూర్తిగా చెడినదిలెండి నీచగ్రహాలకి ఒక దశ, అనగా పది సంవత్సరములుమాత్రమే వుండును—

నాకు నమ్మిక వున్నదా లేదా అని మీరు అడుగవద్దు నా అనుభవాలు రెండు వివరించినాను.

★

బోటు జగన్నాథస్వామి,
పార్వతీపురం.

# నా తొలి రచన

"కథ రాయాలి, నేనూ రచయితనవ్వాలి, నా పేరు ఒక పత్రికలో చూసుకుని ఆనందించాలి. పదిమంది చూసి నన్ను అభినందించాలి" ఇదీ నన్ను పట్టుకుని పీడించే బాధ.

* * *

ఎప్పట్నుంచీ ఈ ఆలోచన బయలుదేరిందో నాకే తెలియదు. నాకు తెలిసిన వాళ్లో, బంధువులో, స్నేహితులో, ఎవరిపేరో ఒకరిపేరు చూసిన ప్రతి పుస్తకంలోను కనుపించటం, నా మనస్సు చివుక్కుమనిపించటం, దానిమీద నేనుమాత్రం 'రచయిత' నెందుకు కాకూడదూ? అన్న ఆలోచన దాంతో, భోంచేసేటప్పుడు, స్నానం చేసేటప్పుడూ పొద్దస్తమానమూ అదే ఆలోచన అయిపోయింది. అన్నానికి కూర్చొని ముద్ద ఎత్తకపోవటం, అక్కడితో అమ్మచేతా అన్నయ్యలచేతా అందరిచేతా చీవాట్లూను వాళ్ళందరూ ఏమనుకునే వారంటే దీనికేదో పెళ్ళి పిచ్చి పట్టినట్టుంది అందుకే ఇలా ఆలోచనలు ప్రబలిపోతున్నై ఎలాగైనా పెండ్లి చేసెయ్యాలి" అని.

ఒకనాడు అందరం భోజనాల ముందు కూర్చున్నాం (ఒక్క మా నాన్నగారు తప్ప.) ఆయనకు మా అమ్మ సాధారణంగా మాతో ఒడ్డించదులెండి. మా గోలలో ఆయనకు సరిగ్గా నాలుగూ అందవని, ముందైనా పెడుతుంది, లేదా వెనకైనా పెట్టుంది అలాగే ఆరోజు ముందు మా పిల్లబంతి అన్నమాట మా అన్నయ్యలు, కాలేజి టైమ్ అవుతోందని, చెల్లెలు, తమ్ముడు స్కూల్ టైమ్ అవుతోందనీ, చిటి చెల్లాయ్ బొమ్మలాటకు వెళ్ళాలనీ, ఇలా ఒక హడావుడితో మూతి కాల్తున్నా, చెయ్యి కాల్తున్నా గబగబా భోంచేసేస్తున్నారు. ఏ హడావుడీ లేని నేను మాత్రం తీరిగ్గా ఆలోచిస్తూ అమ్మచేసిన వంటకు వక్రాన్నాలెంచుతూ కందించుతూ ఇది నెట్టేసి, అది నెట్టేసి చెయ్యి కడుక్కుందామని లేస్తున్నాను. అమ్మకు కంపెడు దిగులేసింది 'అయ్యో!' దాని మనసులో ఏమూలో దనో సరిగ్గా భోజనమన్నా చెయ్యలేదు. పోనీ ఈయనగారు దాన్ని కాలేజిలో నన్నా చేర్పారు కాగా ఏదో అలా చదువు ధోరణిలోన్నా పడి ఉంటుందని అనుకోడానికి' అని అమ్మ ఏమేమో చదివేస్తోంది అష్టావధానం శతావధానమున్నా. అసలు ధోరణి ఏమిటో అమ్మకు మాత్రం ఏం తెలుసు పోనీ చెబుదామా అంటే ఈ అన్నయ్యలది పెద్ద గొడవ నేను ఏ పని చేయబోయినా ఆక్షేపణే తమరు మహా ప్రవీణులైనట్టు. పోనీ అచ్చంగా అమ్మతో చెప్పి దిగులు పడకే అసలు సంగతి ఇదీ అంటే ఊరుకుంటుందా. ఇప్పటికే తన కూతురు పెద్ద బియ్యే పాసైనట్టు, మా అమ్మాయి ఇంద్రుడు చంద్రుడంటుంది. అన్నయ్యలకు తగని

## కొల్లూరి సుబ్బాయమ్మ

మంట అసలమ్మకు నామీద ఎందుకంటే అంత అభిమానం, నేను పరీక్షకు వెళ్ళిన మొదటిసారే పాసయ్యానండి పాపం! మా అన్నయ్యలు పెద్దవాడు ఇంటర్‌లో ఒకసారి ఫెయిలయితే, రెండోవాడు, స్కూలు ఫైనల్‌లో రెండుసార్లు ఫెయిలయ్యాడు అందుకని మా అమ్మకు నన్ను చూస్తే కాస్త గురి. దానికి తగ్గట్టు నేను కథ రాస్తున్నానని తెలిసేనా ఆవిడ సంతోషానికి హద్దు మీరిపోయి పొరుగింటి పుల్లమ్మతో, ఎదురింటి సుబ్బమ్మతో చెప్పి, గబగబా అన్నయ్యల ముందుకు పోయి 'మాకాగ్రటా! మీకన్నా అదినయం. దక్కగా అది గనక మగబిడ్డగా పుట్టుంటే ఇంకా ఏంతొ పేరొచ్చేదో' అని అనేసుంది అసలే నామీద కోపమేమో, మా పెద్దన్నయ్యా నన్ను మింగేంత పని చేస్తాడు! మళ్ళీ ఏ డబ్బో అవసరమౌతుందనుకోండీ అప్పుడు మాత్రం అమ్మకన్నా తనే ఎక్కువగా ఫిట్రాజా కీర్తనలు చదివేస్తాడు.

అందుకని కంచాలు కడుగుతున్న దాన్నల్లా ఏదో ఐడియా వచ్చేసరికి అది ఆ బాత్‌రూమ్‌లోనే పారేసి గబగబా నా గదికి పోయి షెల్ఫ్‌లో వెతుకుదును గదా నా పెన్ కనిపించలేదు ఇటు తిరిగి చూసేసరికి మా పెద్దన్నయ్య మహాఠీవిగా జేబులో నా కలం పెట్టుకుని, ఏదో సినిమా పాట ట్యూన్‌లాటిది గానం చేస్తూ అద్దంలో చూసుకుంటూ తల తెగదువ్వేస్తున్నాడు. నిజంగా నాకు ఒళ్ళుమండింది చెప్పొద్దూ! గబగబా వెళ్ళి వాడి జేబులో చెయ్యి పెట్టాను. వాడు నన్ను బతిమాలే ధోరణిలో పోజు పెట్టాడు. నేను ఒప్పుకోలేదు. ఇంకా సమయం మించితే ఎక్కడ అమ్మను పిలుస్తానను కున్నాడో ఏమో గబగబా డ్రాయరో పుస్తకాలు తీసుకొని వాకిట్లో ఉన్న సైకిల్ దగ్గరికి ఒక్క గెంతు గెంతాడు నేనూ వాడి వెనకాలే పరిగెట్టాను. ఏం లాభం! అప్పటికే వాడు వెనక్కు తిరిగి వెయ్యూపుతూ సందుమలుపు తిరిగేశాడు దేముడా! ఏమిట్రా తండ్రీ! విఘ్నేశ్వరుకి పెండ్లికి వెయ్యి విఘ్నాలన్నట్టు, ఐడియా రావడమే అరుదు వచ్చిందేదో గబగబ గీకేదామంటే అన్నీ ఆటంకాలే అనుకున్నాను. ఇంతలో మా చిన్నన్నకి నామీద అపారమైన ప్రేమ పుట్టి, గబగబ పెన్ను తెచ్చిచ్చాడు వాడికీ, నాకూ కొంచెం స్నేహమే లెండి. పెద్దన్నతో తగూలాడినంతగా తగవులాడను గానీ, ఏదో కొంచెం వాడికి తెలుసు నేను కథ రాయబోతున్నానని 'అబ్బ'. వీడికే సమయానికి నామీద ఎంత ప్రేమురా' అనుకొని గబగబ గదిలో ఒళ్లుమంగు కూర్చొని మహా గొప్పగా పేపర్ మీద 'రచయిత' అని రాశానో లేదో ఆ అక్షరాలు 'మహారాజా పులేకథ' అన్నట్టు వలా వెళాపోయి వక్కిరించటం మొదలెట్టాయి. 'వెధవ! సిరాలేని పెన్నిచ్చాడు' అని తిట్టుకుంటూ కుర్చీలోంచి లేస్తును గదా, మా వాడు పకపక నవ్వుతూ "ఓ సైసే కంగాలతో సహా అమ్మ నెత్తిన పారేసి ఇదేమో మహాకథ రాస్తుందట కథ చెల్లమ్మ! మళ్ళీ నేనొచ్చేసరికి పూర్తిచేసుంచాలి కథ." అంటూ ఒక్క దూకుదూకేసు గేట్లోకి నిజంగా నాకు ఏడుపొచ్చినంతపనైంది. "ఇలా కాదు. ఎలాగైనా ఈరోజు వాళ్ళద్దరి

 నా తొలి రచన 

మీద కచ్చకైనా సరే కథ రాయాలి" అని అనుకొని లేచిపోయి పెన్‌లో ఇంక్ పోసుకుందామని అనుకొని కూడ పోనీలే అసలు పదినిముషాల్లో మెయిన్ ఐడియా దాని మీద సంగ్రహంగా రాస్తే, తర్వాత, కంచాలు అవీ కడిగి విపులంగా, విపుల్నగా వ్రాయొచ్చు ఇంక్ పోసేలోపల అయిడియా మారిపోవచ్చు అనుకొని నాన్నగారి పెన్ తెచ్చి పేపర్ మీద పెట్టాను. ఆ ఉన్న ఐడియా కాస్తా మాయమైంది. ఏమౌతుంది మరి? ఇన్ని తంటాలైతే. నిజంగా ఇంట్లో వాళ్లను, నన్నూ కూడా మింగేద్దామన్నంత అక్కసు బయలుదేరింది. కండనిండా నీళ్లు నిండాయి. ఇంతలో మా నాన్నగారు వంటింట్లో నుంచి "అమ్మా! భారతీ!" అని పిలిచారు సరి. పూర్తైందిరా కథ అనుకుంటూ విసుగుతో వంటింట్లోకి వెళ్లాను. కథ రాయలేకపోయానని ఏడుస్తున్న నన్ను చూచి మా అమ్మ ఖంగారెత్తిపోయి నిజంగా నన్నేదో పిశాచం పట్టుకుందనుకొని నాన్నగారికి వడ్డించబోయే పళ్ళెం కాస్తా ఆయన ఆకులో గబ్బున ఎత్తేసింది. నిజంగా నాకు నవ్వొచ్చిందంటే నమ్మండి అంత ఏడుపూ మాయమై ఫక్కున నవ్వాను ఇంతదాక తదేకదృష్టితో ఇదంతా గమనిస్తూన్న నాన్నగారు "ఏమిటమ్మా! అలా వెర్రిపిల్లలా కాసేపు ఏడుపు, కాసేపు నవ్వును అసలు నీ మనస్సులో ఉద్దేశమేమిటో నాతో చెప్పకూడదుటమ్మా?"

"అది కాదు నాన్నా..." అని నేను అంటూవున్నా వినిపించుకోకుండా "నేను సాయంత్రం వచ్చేసరికి నాతో చెప్పటానికి సిగ్గయితే మీ అమ్మతో చెప్పు. ఆ సమ్మంధం కాకపోతే మరోటి దానికి అంత యిదైపోవాలీ నీకిష్టంలేంది నేనుమాత్రం చేస్తానుటమ్మా" అని గబగబా మజ్జిగన్నం తినేసి చెయ్యి కడుక్కుందామని లేచారు నిజంగా నాకు నవ్వాలో, ఏడవాలో తెలియలేదు.

నాలుగ్రోజులనాడో సంబంధం వచ్చిందిలెండి దాన్ని గురించి వీళ్లు మాటాడడం. నాకసలా యోచనే లేదు. నవ్వుతో, కోపంతో గదిలోకి వెళ్లనుగదా, బొమ్మలాటకు పోయిన మా చెల్లాయి అప్పుడే దాని ఆటంతా పూర్తయినట్టు ఆ గదిలో చేరి నాన్నగారి పెన్‌తో ఏదో తెగ బరికేస్తోంది, తన పలకమీద. నిజంగా మీరాలోచించండి నా పరిస్థితి ఎలాగుందో. ఇంతలో మా నాన్నగారు "భారతీ! నాకోటు జేబులో పెన్ ఎవరన్నా తీశారా" అంటూ నా గదిలోకొచ్చారు. విరిగిపోయిన పెన్ చేతిలో పట్టుకున్న నన్ను చూసి నా మీద ఎంత కోపమొచ్చిందో నాన్నగారికి. ఆయన కంత కోపం రావటం అదే చూడటం నేను. "ఏమిటే! అలా చూస్తావు వెర్రిమాపు. ఏం చేశావేమిటె పెన్ను" అని చేతిలోది లాక్కున్నారు

అసలే భయంగా ఉందేమో, వణుకుతున్న గొంతుతో, "అది కాదు నాన్నగారూ, కథ రాద్దామనీ..." ఇంతలో నా మాటన్నా పూర్తి గానీయకుండా అందుకున్నారు నాన్నగారు. ఏడిశావ్, తెలివి తక్కువ పెద్దమ్మా! నీ కథా నువ్వూను. నీ కథ రాయను నా పెన్నే కావాల్సొచ్చిందా? ఇంట్లో ఇంత మందున్నాగా ఏం లాభం! ఒక్కడికీ కలం ఉండదు. పెన్సిలుండదూ. ఛా, కంచాలు కూడ వదిలేసొచ్చింది." అని ఒక్క గుపరిచారు. ఎన్నడూ నాన్నగారి చేత చీవాట్లు తినని నాకు ఎంత ఏడుపొచ్చిందో, పక్కకు తిరిగి చూసేసరికి, టేబిల్ మీది పేపర్సు, వెలాతెలా బోతున్న 'రచయిత' అన్న అక్షరాలు, ఇంక్ లేని పెన్ను, విరిగిన పెన్ను అన్నీ నన్ను చూసి ఒకటే నవ్వు చెప్పేంత సిగ్గేసి ఏడుస్తూ "వెధవకథ రాయనుంటే మాట చీవాట్లు తిన్నాను, పాతిక రూపాయల పెన్ను పాడుచేశాను" అనుకుంటూ నీళ్ళ ఇంట్లోకి వెళ్ళాను, కంచాలు కడుగుదామని. ఇంతలో థర్డు పీరియడ్ లీవ్ అట వచ్చాడు మా చిన్నన్న "రాశావుటే భారతీ! కథ" అంటూ ఏడుస్తున్న నన్ను చూసి 'ఏమైందే" అంటూ అమ్మదగ్గరికెళ్లాడు ఛీ! ఆ రోజంతా నా మొహం ఎవ్వరికీ చూపలేక పోయాను. ఇంక రాయను బాబూ కథలు! బుద్ధొచ్చింది. పోనీ రాద్దామని పూనుకుంటే ఇన్ని అవాంతరాలా?

* * *

అదీకథ "కథ రాయాలీ అది అచ్చుపడాలీ, నేనూ ఓ రచయిత్రి నవాలీ..." ఇదీ నన్ను పట్టుకుని పీడించిన కథ బాధ. ★




# సోమరులు

రాయదుర్గ మేలినట్టి
భీమసింగు పాలనలో
సోమరులందరి వసతికి
సత్రమొకటి వెలిసినదట!

దూరభార మనకుండా
కష్టము గణియించకుండ
నాలుగు దిక్కులనుండియు
అరుదెంచిన సోమరులకు

ఏయకష్ట మిసుమంతయు
జేయకుండ దినమంతయు
భుజించుచు నిదురించెడి
జీవనమ్ము లభ్యమాయె

సత్రవులో నివసించెడి
సోమరు లందరిలోను
మిక్కిలి సోమరి ఎవరో
నిశ్చయించు నూహకల్గి

ప్రభువుగారు వొక్కనాడు
సత్రవు దరి కేగుదెంచి
సోమరు లందరిని గాంచి
క్రింది విధముగా పల్కిరి

"మిక్కిలి సోమరులందరు
నేటినుండి ప్రతిమాసము
వేయి రూప్యముల చొప్పున
బహుమతి పొందుట కర్హులు."

'ఇచటి సోమరుల లోపల
మిక్కిలి సోమరు లెల్లను
చేతులెత్తి తక్షణమే
ద్రవ్యమందుకొను డిదిగో!'

అని పల్కిన ప్రభువుపల్కు-
లాలించిన వారంతా
ఆలసింప కిసుమంతయు
చేతులెత్త సాగిరంత

క్షణములోన ఎల్లవారు
చేతులెత్తిరే కాని
మూలనున్న ముసలయ్యో
చేతులెత్త కూరకుండె

చేతు లెందు కెత్తవంటు
ప్రభువుగారు ప్రశ్నింపగ
"అంత ఓపికుండిన యెడ
ఇచటి కేల నేవత్తును"

అని నుడివిన ముసలివాని
పలుకులు విని ప్రభువతనికి
నెలకు వేయి రూప్యంబులు
ఇచ్చెదనని ప్రకటించెను.

వి. జయలక్ష్మి

# కొత్త కథ

అలపర్తి వెంకటసుబ్బారావు

పండువెన్నెల, పిండారబోసినట్టుగా వుంది. కన్నులపండుగగావుంది. మంచంమీద కూర్చొని వున్న తాతయ్య, ఆరిపోయిన చుట్టని తిరిగి ముట్టించాడు. మంచంలో పడుకున్న మనుమడు, కథ చెప్పమని తాతయ్యనడిగాడు. తాతయ్య చెప్పేకథ వింటూ నిద్రపోవడం మనుమడికి అలవాటు! ఇంకేం! తాతయ్య కథ మొదలుపెట్టాడు...

"అనగనగా ఒక రాజు..."

"ఊఁ"

"ఆ రాజుకి ఏడుగురు కొడుకులు"

"ఊఁ"

"ఏడుగురు కొడుకులూ వేటకెళ్లారు."

"ఎప్పుడూ యీ కథేనా? క్రొత్త కథ చెప్పు తాతయ్యా!"

అయితే, యీ కథనే యిక్కడినుంచి మరోదారి త్రొక్కిద్దాం!"

"సరే!"

"ఆరుగురు కొడుకులు ఆరు చేపలు తెచ్చారు."

"ఏడుగురు కొడుకులు తాతయ్యా!"

"అవును ఏడుగురే! కాని, ఏడో వాడు ఏమీదొరకలేదని ఏడుస్తూ వచ్చాడు..."

"ఎందుకని దొరకలేదు తాతయ్యా?"

"ఇదుగో! మళ్లీ నువ్వు వెనుకటి కథలోకి వెళ్తున్నావ్! కాసేపు ఓపిక బట్టివింటే, ఎందుకు దొరకలేదో నీకే తెలుస్తుంది."

"సరే! తర్వాత?"

"—'ఏరా అబ్బాయ్! ఎందుకు ఏడుస్తున్నావ్?' అని రాజు అడిగాడు 'నాకు చేప దొరకలేదు' అన్నాడు ఏడోకొడుకు ఏడుస్తూనే"

"చేప ఎందుకు దొరకలేదని రాజు అడుగుతాడు ఆ అబ్బాయి అసలుసంగతి చెబుతాడు. అంతేగా తాతయ్యా?"

"ఇంకా నువ్వు పాతకథని విడిచిపెట్టలేదు. ఇది క్రొత్తకథ! గనుక, ఇందులో... చేపా! చేపా! నువ్వెందుకు ఎండలేదు? దుబ్బు అడ్డం వచ్చింది —దుబ్బా! దుబ్బా! నువ్వెందుకు అడ్డం వచ్చావ్? ఆవు మేయలేదు—ఆవూ! ఆవూ! నువ్వెందుకు మేయలేదు?...అనేమాదిరిగా కథ నడవదు."

"పోనీ...తర్వాత ఏం జరిగిందీ గబగబా చెప్పు తాతయ్యా!"

"మరి, మధ్య మధ్య నువ్వు యిలా చొప్పదంటు ప్రశ్నలు వెయ్యకుండా వుండాలి!"

"అలాగే తాతయ్యా!"

"ఆఁ అన్నట్టు మనం ఎంతవరకూ వచ్చాం?"

"నాకు చేప దొరకలేదన్నాడు ఏడో కొడుకు ఏడుస్తూనే!"

"ఇంకేం! రాజుకు కోపం వచ్చింది. కారాలు మిరియాలు నూరుతూ ఏటిదగ్గరికెళ్లాడు. ఏటిలోని చేపలనుద్దేశించి, 'ఏటిలోని చేపల్లారా! నేనెవర్నో తెలుసా? ఈ దేశాన్ని పరిపాలించే రాజును! ఈ దేశంలోని జీవరాసులన్నీ నా ఆజ్ఞను జవదాటరాదు' అన్నాడు. 'తెలుసు మహారాజా! తెలుసు కాని, మీ రిప్పుడిక్కడికి ఎందుకు వచ్చినట్టు?...మా వలన జరిగిన అపరాధం ఏమిటి? తెలియజెప్పండి రాజా!' అని అడిగాయ్ చేపలన్నీ ఒక్కసారిగా-'ఇవ్వాళ మా కుర్రవాళ్లు ఏడుగురూ ఏటికొచ్చారు. అందులో ఆరుగురికి ఆరు చేపలు దొరికాయ్! ఏడోవాడికి మాత్రం ఏ ఒక్క చేపాదొరకలేదు ఏడుస్తూ యింటికొచ్చాడు. ఏం? రాజకుమారుడు గదా! మీలో ఒక్కడైనా వాడికి చిక్కగూడదూ? వాడేం పట్టుకెళ్ళి మిమ్మల్ని కూరవండుకు తింటాడా?...చక్కగా గాజు తొట్టిలోవుంచి కావలసిన ఆహారం



## నరసాపురం రేవు

చిత్రకారుడు : ఎమ్. నీలకంఠం, కాకినాడ.

పెడుతూ వుంటాడాయె' పెద్దవాళ్ళు ఆరుగురూ పట్టుకొచ్చిన ఆరుచేపలూ ఇకనుంచి హాయిగా రాజాల్లాగా జీవిస్తాయ్!' అన్నాడు రాజు కొంచెం తీవికనబరుస్తూ—ఏం బాబూ! ఊ కొట్టడం లేదు. నిద్రవచ్చిందా?"

"లేదు తాతయ్యా! వింటున్నాను చెప్పు!"

"ఉండు. మళ్ళీ ఒక్కసారి యీ చుట్ట ముట్టించనీ!...బాబూ! ఇక తర్వాత కథ చెబుతున్నా విను!... అప్పుడు ఒక పెద్దచేప ముందుకొచ్చి యిలా అంది. 'మహారాజా! మీరు చెప్పింది బాగానేవుంది.. కాని, మా మాటలు గూడ మీరు వినాలి. ఎర వేసి చేపను పట్టడం అన్న విషయం ఎల్లరికీ తెలిసినవిషయమే! వస్తావు పోతావు నాకోసం! వచ్చి కూర్చున్నాడు నీకోసం!! అని ఎర ఎంతగా మొఱబెట్టుకున్నా, మేము దాని మాట పెడచెవినిబెట్టి, కోరి గాలం గొంతులో గ్రుచ్చుకుంటాం! అలాంటప్పుడు—గాలానికి ఎర తగిలించి ఏటిలో వేస్తే, ఎంత ఆత్మనిగ్రహంతో వున్నా, ఏదో యొకటి కాలం ముంచుకొచ్చి గాలం ముందుకొచ్చి పట్టుబడకపోదు. అలాగాక, ఏటి ఒడ్డున చెట్టునీడన నిద్రబోతూవుంటే చేపలు వాటంతటవే అతనిదగ్గరికి పరుగెత్తుతాయా? మహారాజా! దేనికైనా ప్రయత్నం అంటూ ఒకటుండాలిగా! కాకపోయినా, స్వేచ్ఛలేని రాజభోగాలుమాత్రం దేనికి ప్రభూ'—పాపం! రాజు ఇంకేం మాట్లాడతాడు! చిన్న కొడుకు నిద్రమత్తును ఎలా వదిలించడమా అని ఆలోచిస్తూ యింటికెళ్లాడు."

తాతయ్య, కథముగించి మనుమడ్ని చూశాడు. వాడు అప్పటికే నిద్రాదేవి ఒడిలో హాయిగా నిద్రపోతున్నాడు. ★

# సముద్రం నీరు ఉప్పగా ఉందేం?

నదులలోని నీరు త్రాగడానికి వీలుంటుంది కాని సముద్రంలోని నీరు ఉప్పగా ఉండడంచేత మనం త్రాగలేము. నది నీటికీ, సముద్రపు నీటికి యింత తేడా ఉందేం? అనే ప్రశ్న మన కందరికీ కలగక మానదు. దీనిని గురించి మన పెద్దలు ఒక కథ చెబుతారు.

పూర్వం ఒక ఊళ్ళో చక్రానందం అనే ధనవంతు డుండేవాడు. అతడు చాల ముక్కోపి. ఒకనాడు ఆనందం అను సన్యాసి చక్రానందం యింటికి వచ్చి "అయ్యా! కాశీపట్నం యాత్రా నిమిత్తం దక్షిణాదికి వెడుతున్నాను. దయ ఉంచి నాకు కావలసిన సామాను లిప్పింతే వంటచేసుకొని భుజించి ఈ రోజుండి వెళ్ళిపోతాను" అన్నాడు. చక్రానందం కోపం పట్టలేక చిందులు త్రొక్కుతూ "కాశీపట్నమట! సామాను లిప్పించాలట! వంటచేసుకొని భోంచేస్తాడట! ఇచ్చి పెట్టిన ట్లడుగుతున్నావే! పో! వెళ్లు అవతలికి" అని కసిరాడు. ఆనందం చిన్నబోయిన మొహంతో వెనుదిరిగి వెడుతూ సంతోషం యిల్లు చూశాడు. అదొక చిన్న గుడిసె. ఈ గుడిసెలోని వారు నాకే మివ్వగలరు? అనుకొని ఆనందం, సంతోషాన్ని సమీపించాడు. సంతోషం భక్తితో ఆనందాన్ని ఆదరించి తన శక్తికొలది కావలసినవన్నీ సమకూర్చాడు.

ఆనందం ఆశ్చర్యంతో "ఈ చిన్న గుడిసెలో ఎవరిస్తారను కున్నాను. ఈ పేదవాడే ఆ ధనవంతుని కన్న దయాపరుడు" అని సంతోషించి ఒక చిన్న చక్రమిచ్చి, ఒక మంత్రం నేర్పి మాయమయ్యాడు. ఆ మంత్రముతో చక్రాన్ని త్రిప్పటకు, ఆపుటకు వీలవుతుంది. ఈ చక్రంతో సంతోషం కావలసినవన్నీ పొందుతుండేవాడు.

ఈ సంగతి చక్రానందానికి తెలిసింది. వెంటనే చక్రానందం, సంతోషం యింటికివచ్చి చక్రాన్ని ఒక్కరోజు బదులివ్వమని అడిగాడు. సంతోషం దయాశాలి కనుక

వై. రామారావు

చక్రాన్నిచ్చి మంత్రాన్ని చెప్పాడు. త్వర త్వరగా చక్రానందం యిల్లు చేరుకుని చక్రాన్ని త్రిప్పి "ధనము కావలెన"న్నాడు. వెంటనే గల గల మని డబ్బు రాలడం ప్రారంభించింది.

అతని ఇల్లంతా డబ్బుతో నిండిపోయింది. "అయ్యబాబోయ్! దీన్నలా ఆపడం! ఉండటానికికూడ చోటులేదే! అంటూ పరుగు పరుగున సంతోషంఇంటికెళ్ళి మొర పెట్టుకున్నాడు. సంతోషం మంత్రం చదివి చక్రాన్ని ఆపి అది ఇంటిలో దాచుకొన్నాడు. చక్రానందానికి సంతోషంపై అసూయ కలిగింది. సంతోషం పెద్ద మాంత్రికుడని నిందమోపి ఆ చుట్టుప్రక్కల ఊళ్ళలో వుండకుండా తరిమివేయించాడు. పాపం నిరపరాధి సంతోషం పారిపోయి ఒక సముద్రం వడ్డున ఒక చిన్న కుటీరంవేసికొని కాలం గడుపుతున్నాడు.

ఒకనాడు చోరానందం అనే సముద్రవ్యాపారి సంతోషం ఇంటికి వచ్చి విందారగించాడు. "సముద్ర తీరంలో ఇటువంటి ఆహార పదార్థాలెలా దొరికాయా? అని ఆశ్చర్యపడి సంతోషాన్ని అడిగాడు. సంతోషం కల్లకపటం లేనివాడు కనక ఆచక్రంగురించిన మంత్రాన్ని చెప్పాడు. ఆ రాత్రి సంతోషం, అతని భార్యాబిడ్డలు నిద్ర పోతూండగా చోరానందం ఆ చక్రాన్ని దొంగిలించి తన ఓడపై సముద్ర ప్రయాణం చేయ మొదలుపెట్టాడు. కొంతదూరం పోయిన తర్వాత తన వ్యాపారానికి కావలసిన ఉప్పు తయారు చేయమని చక్రాన్ని తిప్పాడు. కొంతసేపటికి పడవంతా ఉప్పుతో నిండిపోయింది. పాపం చోరానందం ఆ కంగారులో మంత్రం మర్చిపోయాడు. చక్రాన్ని నిలపటం సాధ్యంకాలేదు. పడవ బరువెక్కువై మునిగిపోయింది. చోరానందం చనిపోయాడు. చక్రం తిరుగుతూ సముద్రం అడుగుకు చేరుకుంది. అప్పటినుండి అది తిరుగుతూనే ఉంది. దాన్ని ఆపేవారు అప్పటినుండి ఇప్పటివరకు పుట్టలేదు. ఇకముందు పుట్టబోరేమో. ఆ చక్రం ఉప్పుతయారుచేయుచుండుటవల్లనే సముద్రం నీరు ఉప్పగా ఉంటుందట! ఎంతచిత్రమైనకథ! ★



# దాచవలసిన మాట



అనగా అనగా ఓ పూజారి వుండేవాడు. అతనివద్ద ఓ మాంచి అశ్వం వుండేది. దానిపైనే అతను ప్రయాణం చేస్తూ వుండేవాడు. ఆ గుఱ్ఱాన్ని “హే” అంటే చాలు వాయువేగ మనోవేగాలతో దౌడు తీస్తుంది. “హు” అంటే రక్కున చచ్చినట్లు ఆగిపోతుంది. అటువంటి తర్ఫీదు యిచ్చాడు పూజారి ఆ గుఱ్ఱానికి!

ఒకనాడతడు స్వంత పనిమీద పొరుగూరు ప్రయాణం కట్టేడు. సిద్ధంగావున్న గుఱ్ఱాన్నెక్కి “హే” అన్నాడు. వెంటనే గుఱ్ఱం పరుగు లంకించుకొంది. అలా గతడు పుట్టలూ, గుట్టలూ దాటుతూ ఓ చిన్న అడవిగుండా జోరుగా ప్రయాణం సాగిస్తున్నాడు. ఉన్నట్లుండి అతనికి బడలికచేత ఆకలి దాహం అంకురించాయి చుట్టూ కలయజూశాడు. ఎక్కడా చిన్న పిట్టబొట్టు కూడ అగుపించలేదు. నిరాశతో యీసారి యిరుప్రక్కల చెట్లన్నీ పరిశీలించాడు.

మెరుపులా అగుపించి అతని నోరు వూరించింది నేరేడుచెట్టుమీద బాగాపండిన ఓ నేరేడుపండు! తడవుగా చెట్టు సమీపించి “హు” అని గుఱ్ఱాన్ని ఆపేడు. గుఱ్ఱం ఆగిపోయింది ఆపళంగానే గుఱ్ఱంపై నిలుచొని తన ఇష్టమొచ్చిన నేరేడుపండ్లు కోసి రుచి

అంట్యాకుల జోగారావు

చూస్తున్నాడు. ఒకప్రక్క అతని ఆకలి దప్పికలు ఉపసమిస్తుండగా తనలో అతడిలా తలపోయసాగేడు. “నేనిలా పండ్లన్నీ తినడం ఎవ్వరైనా ఈ దారినిపోతూ చూసి “హే” అని అన్నారంటే నాగతి ఏమవుతుందో కదా?” అని ఆ మాట కాస్త గట్టిగా అనేశాడు—“హే” అన్న మాట గుఱ్ఱం చెవిలో దూరింది. తత్క్షణం గుఱ్ఱం తన నాలుగుకాళ్లు లంఘించి గాలితో పందెమువేసింది! ఇంకేముంది? దబ్బున పూజారి దబ్బపండులా క్రిందనున్న ముండ్ల డొంకపైపడ్డాడు. ముండ్లన్నీ వంటికి గుచ్చుకొన్నాయి. ఒడలంతా గీచుకుపోయి రక్తం బాగా కారింది! పూజారి తెలివితెచ్చుకొని “దాచవలసిన మాట యేదైనా అప్రయత్నంగా నోటివెంటజారితే ప్రాణాపాయం తెస్తుంది” అనుకొన్నాడు.



## అప్రస్తుతం

“నువ్వు దొంగ సంతకం చేశావని ఆరోపణ. నిజమేనా?”

“అబద్ధమండి. అసలు నా పేరే నేను రాసుకోలేనండి.”

“అడిగినదానికి జవాబియ్యి. నీ పేరు నువ్వు రాసుకున్నావని ఎవరూ ఆరోపించలేదుగా.”

# పాకప్రవీణులు

క్రిష్టాయి, వేణులకి పాలకోవా అంటే చాలాఇష్టం. పాలకోవా పేరుచెపితే చాలు– ఇద్దరు మిత్రులకి అన్నంకూడా రుచించేదికాదు.

ఆ రోజు ఆదివారం. ప్రొద్దుటే ఆడుకోడానికి క్రిష్టాయి ఇంటికి వేణు వెళ్లాడు. వాడు వెళ్లేసరికి క్రిష్టాయి ఒక్కడే గదిలోకూచుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు వేణుని చూడగానే నవ్వుతూ అన్నాడు:

"నీకు నూరేళ్లు ఆయుస్సురా వేణూ! ఇప్పుడే నీ కోసం వద్దామనుకుంటున్నాను."

"ఏమిటి కథ?"

"అంతపెద్ద కథకాదులే. నువ్వు కాస్త పంచదార తెచ్చావంటే, కావలసినంత తాయం పెడతాను"

"కాస్త ఏంకర్మ, ఎంత కావాలంటే అంత తెస్తాను. మరి డబ్బులు ఏ మాత్రం ఉన్నాయి?"

"నేను డబ్బులు ఇచ్చేట్లయితే నువ్వు తెచ్చేదేమిటోయ్ దద్దమ్మా, నేను పాలుతెస్తాను నువ్వు పంచదార తీసుకురా..."

"ఊఁ, తర్వాత"

"ఇంకేముంది, పాలకోవా తయారవుతుంది"

"నిజంగానా క్రిష్టాయి"

"నిజం. నేను మా అమ్మకి అవీ ఇవీ చెప్పి చల్లగా పాలు సంపాయించాలే! పంచదారకోసం ఎన్ని తంటాలుపడ్డా ఫలితం దక్కలేదు"

"నేను పంచదార తెస్తా కాని, ముందు నా ప్రశ్నకి జవాబుచెప్పు. నీకు పాలకోవా చేయడం తెలుసా?"

"ఛా, మనకి తెలియక పోవడమేమిటి? మళ్ళీ మాట్లాడితే బజారు కొట్టువాడికంటె వందరెట్లు బాగా చేయగలను"

"అయితే, ఇంతకుపూర్వం ఎప్పుడయినా పాలకోవా చేశావా?"

"చేయడం ఎందుకోయ్? మా అమ్మ చేస్తుండగా బోలెడన్నిసార్లు చూశాను. అంతకంటె ఇంకేం కావాలి?"

"సరే, నేను వెళ్లి పంచదార తెస్తానుకాని, ఈ లోపల నువ్వు పాలు, గిన్నెవగైరా సిద్ధంచెయ్యి, ఏఁ"

**మట్టెగుంట రామకృష్ణ**

"ఒక్కమాట. ఈ సంగతి నీకు నాకుతప్ప మరెవ్వరికీ తెలియకూడదు. పాలకోవా పూర్తిఅయిన తర్వాత అందరికీ రుచిచూపించి వాళ్లని ఆశ్చర్యపరచాలి, తెలిసిందా?"

వేణు పరిగెత్తుకువెళ్ళి, పది నిమిషాల్లో ఓచిన్న పంచదారపొట్లంతో తయారయ్యాడు. ఈలోపల క్రిష్టాయి పాలు, గిన్నె, స్టౌవ్ వగైరా సిద్ధం చేశాడు.

ఇద్దరు మిత్రులు స్టౌవ్ వెలిగించారు.

"మొదట ఏంచేద్దామంటావురా క్రిష్టాయి?"

"నువ్వు చూస్తూ కూచుంటే చాలా మంచిది. నాకు అంతా తెలుసు!"

"నియిష్టం. కాని, చేసేవాడివి ఎల్లాగూ చేస్తున్నావు కాబట్టి, కాస్త ఎక్కువగానే చెయ్యి. కొంచెం కనక చేసావంటే మన ఇద్దరమే ఖాళీచేయగలం."

"నువ్వే చూస్తావుగా!"

క్రిష్టాయి పాలని గిన్నెలో పోశాడు. గిన్నె చిన్నది కావడం వల్ల పాలు గిన్నెకి కాస్త తక్కువగా నిండా వచ్చాయి.

"ఇంకా కొంచెం పెద్ద గిన్నె అయితే బావుండేది ఏమంటావు?" వేణు అన్నాడు.

"పాలకోవాకి పెద్దగిన్నె ఉండకూడదు, తెలుసా? మా అమ్మ ఎప్పుడూ చిన్నగిన్నెలతోనే చేసేది"

"సరే కానీయ్"

క్రిష్టాయి పాలగిన్నెని స్టౌవ్ మీద పెట్టాడు. తరువాత ఓచిన్న చెంచా తీసుకుని పాలని కలపెట్టడం మొదలెట్టాడు.

"అట్లా ఊరికే కలపెట్టకోయ్, పాలు పలచన అవుతాయి."

"ఛా, ఎప్పుడయినా పాలకోవా చేయడం చూసి ఏడిస్తేగా తెలియడానికి! మా అమ్మ ఇల్లాగే కలపెట్టడం నేను లెక్కలేనన్నిసార్లు చూసాను."

పదినిమిషాలు గడిచిన తర్వాత పాలు మెల్లగా పొంగడం ప్రారంభించాయి. కిష్టాయి పాలు పొంగకుండా చేయడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, సాధ్యం కాలేదు.

"ఇప్పు డేం చేద్దామంటావురా వేణూ? పాలు ఇట్లాపొంగిపోతున్నా యేమిటి?

"నాకేం తెలుసు? మీ అమ్మ పాలుపొంగితే ఏంచేస్తుందో జ్ఞాపకం తెచ్చుకో, సరిపోతుంది."

"ఆఁ, జ్ఞాపకం వచ్చింది. పాలు పొంగకుండా నీళ్లు చల్లుతుంది. అంతే!"

కిష్టాయి పాలమీద కాసిని నీళ్లు చల్లాడు. దాంతో పాలు పొంగడం ఆగిపోయింది. కాని, ఓ నిమిషం తర్వాత యథాప్రకారం పొంగడం ప్రారంభించాయి. కిష్టాయి మళ్ళీ నీళ్లు చల్లాడు. ఈవిధంగా కొంతసేపు జరిగేసరికి గిన్నె అంచుదాకా పాలు వచ్చాయి. కిష్టాయికి ఏమి చేయడానికి తోచలేదు. చెంచాతో కాసిని పాలు తీసి వేరే గ్లాసులో పోశాడు.

వేణు దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు: ఇట్లా అయితే చివరికి గిన్నెలో ఒక్కపాలచుక్క అయినా మిగులుతుందా అని అనుమానం..."

"ఊరికే శకునపక్షిలా గోల చేయక, నోరుమూసుకు చూస్తూ కూర్చోవడం చాలామంచిది. పాలు పొంగుతుంటే మా అమ్మ ఇట్లా ఎన్నోసార్లు చేసింది"

పాలు పొంగడం ఎంతసేపటికీ ఆగక పోయేసరికి కిష్టాయి విసుగెత్తి పోయాడు. అదీగాక, తన అవస్థ చూసి వేణు వెధవాయి, ముసిముసి నవ్వులు తెగఒలక పోస్తున్నాడు. కిష్టాయి మళ్లీ గిన్నెలో నీళ్లుపోద్దామనుకున్నాడు. కాని, గ్లాసులో ఉన్న నీళ్లు కాస్తా అయిపోయాయి.

"వేణూ, నువ్వు బావిదగ్గిరికివెళ్లి కాసిని నీళ్లు తీసుకురా, త్వరగా రావాలి..."

"బావిదగ్గిరికి ఎందుకోయ్ ఈ భాగ్యానికి, ఇంట్లోకివెళ్లి తెస్తాను"

"పాలకోవా పూర్తిఅయిందాకా నేను చెప్పినట్లు చెయ్యి, తెలిసిందా? మా అమ్మకనుక ఇంట్లోనుంచి నీళ్లు తీసుకురావడం చూసిందంటే నీకు, నాకు చీవాట్లు తప్పవు"

"సరే, ఏంచేస్తాం. అంతాకర్మ" వేణు నీళ్లు తీసుకురావడానికి బావి దగ్గిరికి వెళ్లాడు వెళ్లినవాడు వెంటనే తిరిగి రావచ్చా, పదినిమిషాల తర్వాతకాని తెమిలిరాలేదు. పోనీ, నీళ్లు తీసుకువచ్చాడా అంటే, అదీ లేదు. బిక్కముఖం వేసుకుని, చేతులూపుకుంటూ, ఈసురుమంటూ వచ్చాడు.

"నీళ్లు ఏవిరా? కిష్టాయి ఆత్రంగా ప్రశ్నించాడు.

"నీళ్లు బావిలో ఉన్నాయి"

"వెధవ వేళాకోళాలు ఆపవోయ్, ఇంతకీ గ్లాసుఏదీ?"

"గ్లాసు..." వేణుమధ్యలో ఆగిపోయాడు.

"ఊఁ, గ్లాసుకేమొచ్చిందిరా?"

"గ్లాసు పగిలిపోయింది"

"ఏమిటీ, గ్లాసుపగిలిపోయిందా? ఇవాళ మా అమ్మచేత చీవాట్లు తప్పవు. 'ప్చ్' బాల్చీతో అయినా నీళ్లు తీసుకురాలేక పోయావా?"

"బాల్చీ బావిలోఉంది"

## కాయకష్టం

"ఇవాళ నా గుండె మొత్తం 1,03,000 సార్లు కొట్టుకుంది. నా రక్తం 1,68,000 మైళ్ళు ప్రవహించింది. 23,000 సార్లు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు జరిపాను. తద్వారా మొత్తం 468 ఘనపుటడుగులగాలిని పీల్చుకున్నాను. 4800 మాటలను ఉచ్చరించాను. అందుచేత చాలా అలసిపోయాను."

—బాబ్ హోప్

"బాల్చీ బావిలో ఉండట మేమిటిరా?"

"బావిలో పడింది"

"అదీ, అట్లా చెప్పు. నువ్వే బాల్చీకూడా బావిలోపడేశా వన్నమాట"

"ఊఁ..."

"ఏడవలేక పోయావు. బాల్చీ కనపడకపోతే మా అమ్మ మనఇద్దరి పని పట్టిస్తుంది. ఇప్పుడేం చేద్దామంటావు?"

వేణు ఏమీ జవాబివ్వలేదు.

"పోని, చెంబుతోఅయినా నీళ్లు తెస్తాను, తాడు ఎక్కడఉందిరా?"

"నా దగ్గిర లేదు"

"ఎక్కడ ఉందంటావు?"

"గాంట్లో నే..."

"దేంట్లోరా. కాస్త అర్థమయ్యేట్లు అఘోరించు"

"బావిలో..."

"చచ్చాం పో, బాల్చీతోబాటు తాడుకూడా బావిలో పడేశావన్నమాట"

"ఊఁ..."



# పాకప్రవీణులు



"అయితే, మనకి ఇక పాలకోవ్వా లేదు; పాడూ లేదు. మనం యిట్లా తెల్లముఖాలు వేసుకు కూచుంటే పాలు కాస్తా పొంగిపోతున్నాయి." కిష్టాయి పాలగిన్నె దించేసి, స్టౌవ్ తగ్గించాడు.

"ఇప్పుడు నీళ్లు ఎట్లా వస్తాయి? పోనీ, ఓపని చేస్తేనో..."

"ఏమిటి?"

"నాగదిలో పాత నులక వుందిగా. దాన్ని చెంబుకి కట్టి నీళ్లుతోడుదాం, ఏమంటావు?"

"అట్లాగే చేద్దాం."

కిష్టాయి తన గదిలోంచి పాత నులక తెచ్చి, దాంతో ఓ అతుకుల చేంతాడు తయారుచేశాడు. కాని, ఆ నులక పాతది కావడంవల్ల, మాటిమాటికి తెగిపోవడం ప్రారంభించింది. ఓపదినిమిషాలు తంటాలు పడినమీాదట, ఉన్నదాంట్లో గట్టి నులక ఏరి చెంబుకి కట్టి నీళ్లు తీసుకు రావడానికిగాను ఇద్దరు మిత్రులు బావిదగ్గిరికి బయల్దేరారు.

"ఈ తాడు తెగిపోకుండా నిలుస్తుందని నాకు ఏమాత్రం నమ్మకం లేదు." వేణు నెమ్మదిగా అన్నాడు.

కిష్టాయి జవాబు ఇవ్వకుండా చెంబుని బావిలోకి తిన్నగా విడిచి పెట్టాడు. చెంబులో నీళ్ళు నిండిన తర్వాత మెల్లగా బయటికి లాగడం ప్రారంభించాడు. కొంత దూరం వచ్చినతర్వాత కిష్టాయి తాడు తెగిపోతుందేమోననే భయం పట్టుకుంది. తోడటం ఆపివేసి, వేణుతో అన్నాడు:

"తాడు తెగిపోతుందేమోనని నాకు భయంగా ఉంది, ఇప్పుడేం చేద్దామంటావు?

వేణు బావిలోకి చూస్తూ అన్నాడు: మనం ఇప్పుడు చాలా నెమ్మదిగా లాగాలి. చాలా నెమ్మదిగా..."

కిష్టాయి అతి జాగ్రత్తగా చెంబుని లాగాడు. కాని, కొంచెం దూరం వచ్చిన తర్వాత చెంబ కాస్తా చెప్పకుండా దభీమని బావిలో పడిపోయింది.

"ఏమిటి, తాడు తెగిపోయిందా? వేణు అన్నాడు.

"ఊఁ, ఇప్పుడేంచేద్దామంటావు?"

"ఇంకోచెంబు తెస్తేసరి. తరువాత గాలంతెచ్చి వీటి అన్నింటినీ తీరిగ్గా బయటికి తీసుకోవచ్చు."

"సరేలే, నువ్వు చెప్పేది ఇంకా బావుంది. ఈచెంబు బావిలో పడినందుకే మా అమ్మ ఏమంటుందోనని నేను ఏడుస్తుంటే, మళ్లీ ఇంకోచెంబు తీసుకురమ్మని సలహా ఇస్తుంటివి..."

## మెజారిటీ ఓటు

పిచ్చాసుపత్రి చూడబోయిన ఒక పెద్దమనిషి, అక్కడ హఠాత్తుగా తన మిత్రుణ్ణి చూచి విస్తుబోయాడు.

"నీకు పిచ్చేమిటోయ్. ఎవరేనా నవ్విపోతారు" అన్నాడు.

"అదే నేనూ అనేది. లోకానికి పిచ్చెక్కిందని నేను చెప్పాను. వాళ్ళంతా నాకే పిచ్చెక్కిందన్నారు."

"తరవాత?"

"ఏముంది. మెజారిటీ ఓటు నాకు వ్యతిరేకంగా పడింది."

---

"నాకుతోచింది చెప్పాను. తరువాత నీ ఇష్టం"

"అదికాదురా, ఓవేళ మరో చెంబు తెచ్చినా మనదగ్గిర తాడు లేదుగా"

"లేకపోతే, నేను మా ఇంటికి వెళ్ళి నీళ్ళు తెస్తాను" వేణుఅన్నాడు.

ఇద్దరు మిత్రులు తిరిగి గదిలోకి వెళ్ళారు. ఆ దృశ్యం చూసేసరికి వాళ్ళ గుండె ఆగినంత పనిఅయింది. తెల్లపిల్లి చల్లగా పాలు తాగుతున్నది. కిష్టాయి, వేణుని చూడగానే అమాంతం కిటికీలోంచి దూకి బయటికి పారిపోయింది.

"ఇంకా గిన్నెలో పాలు తాగలేదులే! గ్లాసులో ఉన్నవి మాత్రమే ఖాళీచేసింది"

"ఇంకొంచెంసేపు ఉన్నట్లయితే ఈ పాలుకూడా మనకి దక్కేవి కావు, అదృష్టవంతులం."

కిష్టాయి ఓ క్షణంసేపు తర్వాత అన్నాడు. "మన ఇద్దరం ఈ పంచదార వేసుకుని చెరి కాసినిపాలు తాగుదాం. రేపు మా అమ్మని అడిగి హాయిగా పాలకోవా చేయించుకుందాం. ఏమంటావు?"

వేణు అవునన్నట్లుగా తల త్రిప్పాడు.

ఇద్దరు మిత్రులు పాలుతాగే ప్రయత్నంలో పడ్డారు. ★

---

## భయంకర పరిశోధన

(19వ పేజీ తరువాయి)

వెతికి....వెతికి ఓ చీపురుపుల్ల సంపాయించాడు. ఆ చీపురుపుల్లతో...భూమిలో పడ్డ అడుగుల్ని జాగ్రత్తగా కొలిచి, రెండు ముక్కలూ జేబులో వుంచుకున్నాడు.

మళ్ళా యథాప్రకారంగా వచ్చి, సందు మలుపులో చాటునుంచున్నాడు.

ఇంతలో-'దొంగ...దొంగ...' అన్న అరుపులు వినిపించేయి! చుట్టు ప్రక్కల వాళ్లంతా లేచినట్టుంది.

దొంగలిద్దరూ పరిగెత్తడం మొదలెట్టారు. వేణూ వాళ్లనిపట్టుకోవాలని అనుకున్నాడు-కానీ, ధైర్యం చాలిందికాదు! అయినా దొంగలే దొరికితే, పరిశోధనఏముంది?

'దొంగా...పట్టుకో' అన్న అరుపులు దగ్గరకొచ్చేసేయి-వేణూ దొంగలు ఎటు వెళ్లారో చూద్దామని, చాటునుంచి పరిగెత్తాడు!

చాటునుంచి పరిగెత్తిన వేణు మీద, గుంపుగా జనం పడ్డారు. దొంగలు నిర్భయంగా పారిపోయారు! 'కొట్టండ్రా...కొట్టండి!' అని - వేణూని చితకకొట్టేరు అంతా!...వాళ్లకి మాత్రం తెలుసా ఆయన దొంగకాదనీ-డిటెక్టివ్ వేణూ అని!

'తాడు తీసుకురండి!...స్తంభానికి కట్టేద్దాం!!" అన్నాడు ఒకడు. వేణూ, తాను దొంగకాదని చెప్పాలని అనుకున్నాడు కానీ, నోటంట మాటరాలేదు.

"వెధవ...అవతారం...ఎలా ఉందో చూడండి!" అన్నారెవరో!

"మొన్న రాత్రికూడావీడేనండీ...వస్తా!" అన్నాడొకాయన.

'తెప్పరిల్లి' తనకథంతా చెప్పాడు వేణూ! చీపురుపుల్లల్నీ, సిగిరెట్టు ముక్కనీ .. ఋజువుగా చూపించాడు! అంతా ఫక్కున నవ్వేరు!

"దొంగలొస్తే చీపురుపుల్లతో అడుగులు కొలవడం ఏంవిటి? దొంగా అని కేకేస్తే చాలవున్నుగా!" అన్నారొకరు. వేణూ సిగ్గుతో తల దించుకున్నాడు. బాధగా మూలిగేడు! నిజంగా ఇది చాలా భయంకర పరిశోధన !! ★

# వనితా లోకం

అవిభక్తకుటుంబంలో కలతలు

# తోటికోడళ్ళ బాధ్యత

★ జయప్రద ★

"ఆ సంసారం ఎంత పచ్చగా ఉండేది!"

"ఏముంది, వేరుబడ్డారు, తెలిసొస్తోంది."

ఏ సంసారంగాని విడిపోయింతర్వాత నలుగురూ అనుకొనేమాటలు పైవి. ఇంతే కాకుండా మరో ప్రవాదా ఉంది. అది, ఏకుటుంబమయినా చీలిపోతే దానికంతా కారణం ఆడవాళ్లే అవుతుందని. అన్నదమ్ముల అనైక్యతమూలంగా విడిపోయే సంసారాలు స్వల్పం. ఇంట్లో చీటికిమాటికి రుసరుసలాడుకొనే అత్తా కోడళ్లవల్లనో, తోటికోడళ్లవల్లనో ఎక్కువగా కుటుంబాలు విడిపోతాయని చాలమంది అభిప్రాయం.

మా సంగతే చూడండి. మాది ఇద్దరన్నదమ్ముల కుటుంబం. మా నాయనగారు చిన్నవారు. పెదనాయనగారు సౌమ్యులు. ఇల్లంతా గొల్లుమనే పిల్లలంతా నాచెల్లెళ్లు, తమ్ముళ్లు. పెదనాయనగారికి సంతానం లేదు. ఈసంగతి పెదనాయనగారు ఏమాత్రం ఒప్పుకోరు. మేమంతా ఆయన సంతానమేనని గర్విస్తారు. అట్లా అన్నపుడలా నాకళ్లు చెమరుస్తాయి. నేను పట్నం వెళ్లి చదువుకునేప్పుడు ఆప్యాయంగా నన్ను ఒళ్లో కూచోబెట్టుకొని, "అమ్మా! నేనే వత్తూర్త మీనాయనని! నిన్ను నేనే బాగా చదివిస్తా" అని ఎంతో ప్రేమగా చెబుతూంటే నాకు దుఃఖం ఆగేదికాదు. ఇటువంటి తండ్రికి పిల్లలివ్వని ఆదేవుణ్ని నిందించేదాన్ని. అటు పెదనాయనగారిలాంటివాళ్లకి అందరూ తమ పిల్లల వతూగానే అవుపిస్తారు. నా చదువు శ్రద్ధ అంతా ఆయనే తీసుకొనేవారు.

ఇంత ప్రేమ, వాత్సల్యం మా 'ఆయమ్మ'కు లేవు. గంపెడు పిల్లలు ఇల్లంతా గల్లుమంటే ఈమె ఎప్పుడూ చిరాకుపడుతుంది. చిన్న పిల్లల్ని కూడా గద్దించేప్పటికి బిక్కుబిక్కుమని తిరిగేవారు. వీళ్ళకి ఈమెఅంటే నే ఎక్కడలేనిభయం. ఎవరేనా మారాం చేస్తుంటే 'ఆయమ్మ' వస్తోందని మాన్పించేదాన్ని. నిజానికి నాకూభయమే, ఆమె అంటే. ఎన్నడూ ఒక్క పిలని ముద్దుకు ఎత్తుకున్న పుణ్యాన పోలేదు. మా బామ్మ అంటుంది 'దానికి జన్మలో మాతృత్వం లేదు' అని. బామ్మకి ఆయమ్మకి క్షణం పడదు. ఇంట్లో అధికారం సహజంగా బామ్మకి ఉండాలి. కాని బామ్మకి అత్తవుంటే గయ్యాళితనం, కోడళ్ళ మీద అధికారపు చెలాయింపు, ఇవేమీ లేవు. కోడళ్ళు తన బిడ్డలనుకొనే తత్వం. ఇదే ఆమె దౌర్బల్యం ఏమోమరి, ఆయమ్మ బామ్మని రాచి రంపాన పెట్టేది. ఆమె ఆయమ్మతో వేగలేక అధికారపు [illegible]పు చేతులు వొదులుకొని విశ్రాంతిగా ఉంది.

మా అమ్మ అమాయకురాలు. ఇరవై నాలుగంటలూ వంటింట్లో చేతులు కాల్చుకొనేది. 'ఆయమ్మ' నాలుగిండ్లూ తిరిగి వచ్చి అమ్మని అదికాలేదు ఇదికాలేదని సాధించేది. అమ్మ ఎదురు మాట్లాడి ఎరుగదు. ఆమెభయమల్లా ఆమెకున్న అంతమంది సంతానమే.

పెద్ద నాన్నగారినీ సాధించేది ఆయమ్మ. అసమర్థుని క్రింద లెక్క కట్టేది. ఆయన మాత్రం ఆమెతో పేచీపెట్టుకోక దూర దూరంగా తొలగించుకు పోయేవారు. ఏది ఏమయినా సంసారపు గుట్టు నలుగురిలో పడడం ఆయనకిష్టం ఉండదు. ఆయమ్మ మాత్రం నాలుగిండ్లు తిరిగి పదిమందికి ఇంటి గోడు చెప్పనిది నిద్రపోయేది కాదు.

నేనెప్పుడయినా పట్నం నించి సెలవులకు

(48 వ పేజీ చూడండి)

## కొండ గుర్తు

"ఒరేయ్... మనముందర పోతోందేం ఆ అమ్మాయి బలే బాగుందిరా"

"చూడకుండా చెప్పేస్తున్నావే ఇక్కణ్ణించే?"

"నాదొక సిద్ధాంతం ఉంది. మనముందర ఒక అమ్మాయి నడుస్తోందనుకో ఆమె బావుందో లేదో చూడ్డానికి మనం గబగబ నడవ నక్కర్లేదు, సింపుల్. ఎదురువేపునించి వచ్చే మొగాళ్ళేంచేస్తున్నారో చూస్తే చాలు. వాళ్ళందరూ మన ముందు పోతున్న అమ్మాయి వేపే చూస్తూ ఉంటే, ఆపిల్ల బ్యూటీ క్వీన్. చూడకపోతే కాదు. అంతే"

నిజంచెప్పాలంటే:

# ఇందుగల రందులేరని...

గాలీ, వెల్తురు, దేవుడూ, ఆడపిల్లని హేళన చేయబోని మానవులూ "ఇందుగలరందు లేరని... సందేహముతే" దను కోబుద్దేస్తుంది నాకు.

హేళన చెయ్యకూడదనీ అలా గంభీరంగా ఋషిలా ఉండాలనీ నేను అనటంలేదు కాని, ఈ హేళన ఒక్కొక్కసారి మితిమీరుతూ ఉంటుంది. హేళనకు గురిఅయ్యే మనిషికి బాధ కలిగిస్తుంది. నేనూ ఓ మనిషినే అన్న ధీమాని క్రమంగా చంపేస్తుంది అనుకుంటాను.

హేళన అనేక రకాలు; దీనికి అనేక రూపాలు ఉన్నాయి ఒకటి చీటికీ మాటికీ వంకలు పెట్టడం; గోరంత లోపం జరిగితే కొండంత లోపంలా చూపించి దబాయించడం, మాట్లాడబోతే కొట్టిపారెయ్యడం ఇలాటివి; ఇంకా ఆడపిల్ల కాలేజీకి వెళుతున్నపుడు, కొందరు విద్యార్థులు వెనకాలే వస్తారు. వీళ్లు క్రికెట్ మ్యాచ్ మీద రన్నింగ్ కామెంటరీ చెప్పేవాళ్ళలాగ అలా ఎడతెగకుండా ఏదో ఒకటి వాగుతూనే ఉంటారు. వంకలు పెడుతూ ఉంటారు జోళ్ళుతొడుక్కుంటే హేయ్ జోళ్ళు తొడిగిందిరోయ్ అంటారు. తొడుక్కోపోతే, హేయ్ తొడుక్కోలేదురోయ్ అంటారు

విద్యార్థుల బాధపడలేక నాతో చదువుకుంటున్న చాలా మంది అమ్మాయిలు చదువు మానుకున్నారంటే నమ్మండి.

మరో విషయం స్త్రీ రోడ్ మీద వెళ్తోందీ అంటే 99% మంది మగవాళ్ళ కళ్ళు ఆమె మీదనే ఉంటాయి. ఆ వెళ్తున్న స్త్రీ పిల్లల తల్లి అయినా వీళ్లు గౌరవించరనుకోండి! ప్రక్కనే భర్త ఉన్నప్పుడుకూడా వీళ్లు నోళ్లు వెళ్ళబెట్టి అలా చూస్తూ ఉంటారు. అందుకే కొంత మంది మగవాళ్లు ఆడవాళ్ళని బయటకి తీసుకు వెళ్ళడానికి భయపడరు. అన్నా చెల్లెలూ, అక్కా తమ్ముడూనో వెళ్తున్నా సరే, "జోడీ సరిపడలేదనో" సరిపోయిందనో కామెంటరీ విసుర్తారు. అంతకన్న నీచం ఘోరం మరొకటి ఉందా? తమ స్వంత అక్కచెల్లెండ్ర సంగతి వీళ్ళు ఎందుకు ఆలోచించుకోరు?

పెద్దవాళ్ళు ఒక కథ చెప్తారు—పూర్వం, ఒక మాతృమూర్తి తన కుమారుడిని విద్యాభ్యాసం కోసం పరాయి గ్రామానికి పంపిందిట ఆరోజుల్లో విద్యార్థులు భిక్షాటనం చేసేవాళ్లు ఆ మాతృమూర్తి ఒకరోజున, తనయింటికి వచ్చిన ఒక విద్యార్థికి భిక్ష వేసింది పొరుగామె అందిగదా — "ఎందుకమ్మా వీళ్లకి భిక్ష వేస్తావు? ఇంతకన్న పుంటికీ గుడ్డికీ వేస్తే పుణ్యంకదా" అని. ఆవిడ అన్నదికదా-'నా కొడుకు మరొకఊళ్ళో చదువుతున్నాడమ్మా అక్కడ ఎవరో ఒక మాతృమూర్తి నా కొడుక్కి భిక్ష వెయ్యవద్దా' అని. అలా మనం చేసేపని గురించి మనం ఆలోచించుకోవాలి.

పి. భారతీదేవి (విజయవాడ).

జనం ఇట్లా కంఠశోష పడ్డారు. ఇదనే కాదు, చదువుకున్న ఆడపిల్ల ఉద్యోగంలో చేరితే, ఇంక వీళ్ళ మాటలకి అంతుండదు. ఇక, ఏ మొగపిల్లల కాలేజీలోనో పనిచేసే పంతులమ్మల అవస్థ చెప్పనే అక్కర్లేదు.

తమాషా ఏమిటంటే మళ్ళీ వీళ్ళే స్త్రీకి విద్య, స్వాతంత్ర్యం, సమానత్వం అవీ ఉండాలని సభల్లో ప్లాటుఫారాలమీద నిల్చుని ఉపన్యాసాలు దంచేస్తారు. స్త్రీ విద్య ఎట్లా ఉండాలోకూడా చెప్తారు.

మాటలకీ చేతలకీ పొందిక లేకపోవడం చూస్తే పైపైకి అట్లా అన్నా, లోలోపల వీళ్ళ కట్లాంటిదేం ఇష్టం లేదని తేలిపోతుంది.



## ఇదీ మన ప్రగతి గతి!

మా సావిట్లో మొన్న మా మావయ్యా, ఆయన మిత్రులు కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అబ్బో అది అమెరికాలోనో, పారిస్‌లోనో ఉండాల్సింది ఇక్కడకాదు... మొన్న నేను కళ్ళారా చూశా ఒక స్త్రీ హోటలుకెళ్లి కాఫీ తాగి వచ్చింది. మరొకర్తి అలా వెళ్తుంది" అన్నారొకరు.

ఇదీ మనదేశం సాధించిన అభివృద్ధి ఆ అమ్మాయి ఎవరో ఒకర్తి కాఫీ హోటలు కెళ్లిందిట. అందుకని గంటసేపుదాకా, ఈ

ఇంటి వ్యవహారాల్లో వీళ్లు స్త్రీలని పట్టి దద్దమ్మలక్రింద జమకట్టి, తమ ఆధిక్యత నిరూపించుకోవడానికి పడే తిప్పలు చూస్తుంటే నవ్వొస్తుంది. ఈ బూజుభావాలతో ఉండే వాళ్లు,వాళ్లంతటవాళ్లు మారరు. సమాన ప్రతిపత్తి ఆర్థికస్వాతంత్ర్యం కావలసినది స్త్రీలకే కాబట్టి, విద్యావతులు, ధైర్యశాలినులు అయిన స్త్రీలే ముందుకు వచ్చి ఈ మరమ్మతుకి గట్టిగా పూనుకోవా లనిపిస్తోంది.

సి. జానకి, కొల్లూరు
(తెనాలి తాలూకా)

# ఇందుగలరందు లేరని...

## మాటలలా చేతలలా

“స్వయంగా ఉద్యోగం చేసి సంపాదించుకొనగలమన్న ధీమా, సంపాదించగల శక్తి స్త్రీలకు ఉండాలి. ఆర్థిక స్తోమత, ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడమే నేటి స్త్రీల దుస్థితికి కారణం” అని ఒకవంక వాదిస్తూ మరొకవంక ఇందుకు ఏవిధంగానూ ఉపయోగించని రీతిగా విద్యావిధానాన్ని మార్చడం అవసరం అనడంలో అర్థం లేదు. ఈ కారణంవల్ల, స్త్రీల ఉన్నత విద్యాబోధనలో లలితకళలకే ప్రాధాన్యం ఇవ్వాలని శ్రీమతి బళ్ళ అహల్యాదేవి గారు ఇచ్చిన సలహాను నేను అంగీకరించలేను. స్త్రీ నేర్చే విద్య గృహనిర్వహణకే పరిమితమైన, ఆర్థికంగా అది ఎలా ఉపయోగకారి కాగలదు?

కాకపోతే విద్యావంతులైన స్త్రీలు అందరి దృక్పథమూ ఒక్కలా ఉండకపోవచ్చును. కొందరికి ఉద్యోగం చేసే అవసరం ఉండదు. విద్యమీద గౌరవంకొద్దీ, సంఘంలో గౌరవంకోసం మాత్రమే కొందరు విద్యాభ్యాసం చేస్తారు. మరి కొందరు, ఉద్యోగం చేసి, కుటుంబ ఆర్థిక పరిస్థితికి శక్త్యనుసారం తోడ్పడాలని ఆశిస్తారు.

అయితే ఈనాడు సమాజం వైఖరి స్త్రీ విద్యకు, స్త్రీల అర్జనకూ కూడా చాలవరకు ప్రతికూలంగానే ఉందని చెప్పాలి. స్త్రీని, ఆమె చేసేపనిని, ఆమె సాధనలను సానుభూతితో అర్థం చేసుకొని, పురుషులు గౌరవించడం నేర్చుకోవడం చాలా ముఖ్యం. అన్ని మార్పులకన్న ఈ మార్పు చాలా త్వరగా రావాలి.

ద్వివేదుల విశాలాక్షి,
విజయనగరం.

## నిత్యకృత్యం

చదువుకుంటున్న ఆడపిల్లని ఏదో ఒక విధముగా ఎప్పుడో అప్పుడు వంక పెట్టి “అందుకే ఆడదానికి చదువు కూడదన్నారు” అనడం చాలామందికి నిత్యకృత్యాలలో ముఖ్య కార్యక్రమం అయిపోయింది. ఇలా ఓపక్క వశాయిస్తూనే, నీ మంచికే చెప్తానంటారు మళ్లీ. కొందరు అదీ అనరనుకోండి. ఇలా వంకర్నాలు పెట్టేవాళ్లలో ఆడవాళ్లే ఎక్కువ అనడంలో అతిశయోక్తి లేదంటే నమ్మండి! ఇది నిజంగా దురదృష్టకరం. చదువుకున్న అమ్మాయి మితభాషిగా వుంటే అతి మందకొడి పిల్లమ్మా! ఆ చదువుకి ఎంత గుట్టుగా వుండాలి అంటారు. కొందరు. “మహా ఎలాగైతేనేం బియ్యే చదివిందని టెక్కు. పలకరించినా మాట్లాడదు” అంటారు. పోనీ హుందాగా ఉండి సరదాగా నలుగురితో మాట్లాడుతూ ఉంటే, “ఊఁ హుఁ మిడిసిపడిపోతుందదేమిటో నాకు బోధపడదు. ఎంత విద్య ఉంటే మటుకు, ఆడముక్క వినయం, వందనం లేకపోతే రాణింపుకేమొస్తుంది” అని సన్నాయి నొక్కులు నొక్కుతారు.

కొంతమంది వున్నారు. వాళ్ళు తమపిల్లల్ని చదివించకపోయింది సరిగదా, ఇతర పిల్లలు చదువుకుంటున్నా ఓర్వలేరు అనిపిస్తుంది వాళ్ల మాటల వరస చూస్తే. తమ పిల్లలు ఊరంతా తిరిగి వచ్చినా వాళ్ళకి బెంగ ఉండదు కాని, చదువుకున్న అమ్మాయి కాలేజీ తప్ప ఇంకెక్కడికీ వెళ్ళకపోయినా, “అదేం చదువో గాని ఎప్పుడూ ఊరిమీద పెత్తనాలకే తిరుగుతుంది ఆ పిల్ల” అని ప్రచారం చేస్తారు. ఇంకోటి. చదువుకున్న పిల్ల మాట్లాడినపుడు ఇంగ్లీషు మాటలు (బాగా వాడుకలో ఉన్నవే) దొర్లితేచాలు, వాళ్ళకి తెలిసినా సరే “ఏవమ్మోయ్! నీ ఇంగ్లీషంతా మా మీద ఉపయోగించకు” అని పుసుక్కున అనేస్తారు. అలా అని ఊరుకుంటారా. మళ్ళీ వాళ్ళే మనతో మాట్లాడినపుడు చిత్రంవచ్చినట్టు కొత్త కొత్త ఇంగ్లీషు మాటలు వాడుతారు, వాటికోసం కొత్త నిఘంటువు రాసుకోవలసిందే.

ఇంక ఇంట్లో వాళ్ళు మరీను. అందులో ముఖ్యంగా అన్నయ్యలు. నాకు ఏదేనా తెలీకపోతే మా అన్నయ్యని అడుగుతానా? అడిగితే, నువ్వు చదివావన్నమాటేగాని నీకసలు జనరల్ నాలెడ్జి ఏం లేదు. పొమ్మని హేళనచేసేస్తాడు. నా చదువంతా ఒట్టి దండుగ అని తీర్పు ఇచ్చేస్తాడు. అంతకంటె చిన్న విషయాలు కూడా నాన్నగారిని అడిగి చీవాట్లు తిన్న రోజులు వాడికి గుర్తుండవు. నేను జ్ఞాపకం చేస్తే గతం నాస్తి అనేసి తప్పుకుంటాడు. వీళ్లు చదువుకున్న రోజుల్లో మనకున్న తెలివితేటల్లో నాలుగోవంతు కూడా ఉండవు. అసలు వాళ్ళకి తెలివితేటలూ ప్రపంచజ్ఞానం వృద్ధిఅయింది ఉద్యోగంలో చేరాకనే.

నేనేదేనా పని సరిగ్గా చెయ్యకపోతే, అందుకే దీనికి చదువెందుకు అన్నాను అంటాడు మా అన్నయ్య. అప్పుడు మా అమ్మ “మేం ఈ చదువులెరగం బాబూ” అంటూ తన చిన్ననాటి ముచ్చట్లు మొదలెట్టుతుంది.

ఇలా అని మా అన్నయ్యకి నిజంగా నేను చదువుకోడం ఇష్టం లేదంటున్నానని కాదు గాని, సంగతి సందర్భాలు ఇలా ఉన్నాయి.

కుమారి కె. లలిత
విజయవాడ.

## ★ వృధా కాకుండా ★

ఉగాదినాడు ఉగాదిపచ్చడికి ముఖ్యంగా వేపపువ్వు వాడతాం. పండుగనాడు పచ్చడికేకాక ఎండబెట్టుకుని ఏడాదిపొడుగునా కూడా వాడుకోవచ్చు. ఎండపెట్టిన పువ్వు వేయించుకుని ఉప్పు, కారం చల్లుకుని అన్నం ధరువుగా ఉపయోగించవచ్చు. ఇది బాలింతరాలికి పథ్యంకింద చాలామంచిది. చారులో పోపుతో పాటు ఈ పువ్వుకూడా వేయించి వేసుకుంటే బాగుంటుంది.

ఇంక పచ్చడి చేసేవిధం: రాచిప్పలో గాని, స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నెలో గాని చింతపండు నానేసి, మరీ చిక్కగా కాకుండా, మరీ పల్చగా కాకుండా పులుసు పిసికి ఉంచుకోవాలి. ఇందులో తగినఉప్పు, సన్నగా తరిగిన పచ్చిమిరపకాయముక్కలూ కలపాలి. కొంచెం ఆవాలు, ఎండుమిరపకాయలు ఓ గరిటెలో వేయించి వేగాక, దింపేముందు ఈ వేపపువ్వు అందులో వేసి కలిపి, సిద్ధంగా ఉంచుకున్న చింతపండుపులుసులో వేసుకోవాలి. ఇష్టమైనవారు కొంచెం బెల్లంకూడా వేసుకోవచ్చు. ఈ పచ్చడి ఇడ్లీ దోసెలలో నంచుకోవడానికి బాగుంటుంది

ఇంక చిక్కుడుపాదు మనింట్లో పెట్టుకున్నప్పుడు పందిరికింద రాలిన చిక్కుడుపువ్వుని తీసి ఎండపెట్టుకోడం మంచిది. రోజూ చిక్కుడుపందిరికింద పొద్దున్నే శుభ్రంగా తుడిచేసుకుంటే, రాలే పువ్వు కూడా శుభ్రంగా ఉంటుంది. ఈ పువ్వు ఉప్పురాసి ఎండపెట్టుకుని అప్పుడప్పుడు వేయించుకుని కారం కలుపుకుని అన్నం ధరువుకింద ఉపయోగించవచ్చు. మా ఇంట్లో పూలకుండీలో వేసి డాబామీద పెట్టేం ఈ మొక్కని. గచ్చుమీదే రాలి మా పువ్వు చాలా శుభ్రంగా ఉంటోంది. వీలైతే మీరూ అలా చెయ్యండేం! ★

పంతుల సౌభాగ్యలక్ష్మి,
విజయనగరం.

### పురుగులువస్తాయని జడిసి

# దీపం వెలిగించకపోవడం వివేకమా?

**14-11-56** ఆంధ్ర వారపత్రికలో శ్రీమతి బళ్లి అహల్యాదేవి గారు "ఆడపిల్లల చదువులో అవసరమైన మార్పులు" అనే శీర్షిక క్రింద ఒక అమూల్యమైన సలహా ఇచ్చారు. "కాలేజీలలో చదువుకోడంవల్ల ఆడపిల్లలుకూడా కేవలం పురుషులవలె ఉద్యోగానికి పనికివచ్చే యంత్రాలుగా తయారవుతున్నారనీ గృహనిర్వహణ, శిశుపోషణా, సంగీతం కుట్లూ లాటి లలితకళలూ రావనీ అన్నారు. పిల్లల పెంపకానికి ఆయాలమీదా, గృహకృత్యాలకి నౌకర్లమీదా ఆధారపడి ఉంటారు. దీనివల్ల మొదట్లో సర్దుకున్నా భర్తలు ఓర్పును కోల్పోయి ఇలంటే నరకంగా చేసుకుంటున్నారు. హిందూస్త్రీలు పూర్వపు ఔన్నత్యమును అందుకోవాలంటే శిశుపోషణ, గృహరక్షణ మొదలైన అంశాలకే ప్రాముఖ్యం ఇస్తే తప్ప జాతి అంతా యంత్రవతుగా తయారైపోతుందేమోనని భయాన్ని వెల్లడించారు.

ఈ అమూల్యమైన సలహాలను విని ఒక్కసారిగా "ఆడపిల్లలంతా కాలేజీలు సంస్కరింపబడేదాకా, కాలేజీలకు వెళ్ళరాదు." అని ఏ మహానుభావుడైనా ఓ బిల్లుచేసి పాసేసి, అహల్యాదేవిగారు ఒకటి రెండు నెలలలో తొందర తొందరగా కాలేజీలన్నింటినీ సంస్కరించేసే విధమైన కాలేజీ ఒకటి ఎక్కడో ఒకచోట నమూనాకి మొదలుపెడితే జాతిని మహాప్రమాదమునుండి ఉద్ధరించేస్తేకాని మన జాతి దెబ్బతినిపోతుందేమోనని నాకు చాలా భయం వేసింది

. కానీ నెమ్మదిగా ఆలోచించితే M. Sc., P, H. D., M. B B S మొదలైన పెద్ద పెద్ద డిగ్రీలను పొందికూడా వీణ వాయించడం, కుట్టు, అల్లికలూ, పాకశాస్త్రం మొదలగువాటిలో కూడా ఆరితేరి ఉండడమేకాక, వారు గృహాలను ఉంచిన రీతి, పిల్లలను పెంచిన విధం నాకు కళ్ళకు కట్టినట్టయింది. జాతి జాతి యావత్తూ చదువువల్ల పాడైపోదులే అని నా అంతరాత్మ ప్రబోధించింది.

ఎందరో యువతులు ఉన్నత విద్యాభ్యాసము చేయుటవల్లనే కదా; కన్యలు తమ జీవితాన్ని పెళ్ళిబుచ్చుటకు భర్త (అంటే కూడూ గుడ్డా ఇచ్చి భరించేవాడు.) అవసరంకదా? అని 'ఎవడికో ఒకడికి' ఇచ్చి పెళ్ళిచేసే దుస్థితి తప్పినది.

ఇంక అనేకమంది కాలేజీ చదువులు చదివి సంసారము చేయడం కష్టమని తలంచుటచేత పెళ్ళికి దూరంగా ఉంటున్నారన్నారు. పెళ్ళికి దూరమవడానికి కారణం చదువు అనడంకన్న యువకులుపోయే పోకడలంటే సబబుగా ఉంటుంది.

ఆ అమ్మాయి B A B L. Pass అయినది అంటే 'అమ్మో నాతో అన్నిటికీ లా మాటాడుతుంది బాబూ' అనీ, M B. B. S. Pass అయిందంటే పేషంట్లతోటి, రోగలక్షణాలను కనుక్కోడంతోటే సరిపుతమయే ఆమె నాతో సంసారాన్ని ఎలా చేస్తుంది? అనేవాళ్లనీ తరుచు చూస్తూ ఉంటాము.

## మోచర్ల రామాయమ్మ

కాని, మంచిచెడ్డలు మడిఎడమలు తెలుసుకోవడంలో, మనుష్యుల తత్వాలను ఆకళించుకోవడంలో, తోటివారిపట్లసానుభూతి, జాలి చూపడంలో, సేవలో ఆడపిల్లది పైచెయ్యి పురుషులకన్న స్త్రీలకే ప్రపంచజ్ఞానం ఎక్కువ. పాతికేళ్ళ యువకుడికన్న పదిహేనేళ్ల ఆడపిల్ల ఎంతో ధైర్యస్థైర్యాలతో, సాఫీగా గృహకార్యాలను నిర్వహించగలదు. అన్నిటికన్న ముఖ్యం, చదువు ఎక్కువున్నా తక్కువున్నా ఆడవాళ్ళు నేలమీద నడుస్తారు. స్వప్నసీమలలో విహారాలు చేసేది మొగవాళ్ళే. మంచి చెడ్డా, ముందూ వెనకా స్థిమితంగా, సహేతుకంగా ఆలోచించకుండా 'చదువుకున్న పిల్ల కాపరం ఏమి వెలిగిస్తుందిలే' అని నిర్దాక్షిణ్యంగా అనగలవాళ్లు చదువుకున్న యువకులే. స్త్రీకి మాతృత్వం వల్ల సహజంగా అబ్బే వాత్సల్యం, కరుణ, సహృదయతలను ఊతగా తీసుకుని, స్వార్థపరులైన పురుషులు, ఎట్టి స్త్రీకి హక్కులూ ఆస్తులూ లేకుండా తమపైనే ఆధారపడి ఉండేలా, విద్యాగంధానికి దూరంచేసి తమ చేతి కింద నొక్కిపట్టుకొన్నారు.

కాని విధి బలీయము. ఆ రోజులు మారాయి. అన్ని రంగాలలోను స్త్రీలు ఆరితేరినవారు అగుటేకాక, పురుషులను తీసికట్టుగా చేయుచున్నారు.

దానితో అనాదిగా తమకు, స్త్రీలకు గల పాలిత, పాలక సంబంధముపోయి ఇద్దరూ సమానులనే భావం వస్తుందంటే పాపం చాలా కష్టంగా ఉంటుంది. కాని నలుగురిలో కల్చర్ ఉన్నవాళ్లు పైకి అలా అనేస్తే అందరిచేతా హేళన చేయబడతారు కనుక "తాటిచెట్టు ఎందుకురా ఎక్కావంటే దూడగడ్డికి" అన్నట్లు ఎక్కువ చదువులు చదువుకుంటే స్త్రీలు సంసారాన్ని సరిదిద్దలేరు కనుక చదువులు కూడదు అంటూన్నారు. పురుషులు అలా అంటే ఇంకా స్వార్థం అనుకోవచ్చు కాని స్త్రీలు కూడా వారి వాదాన్ని బలపర్చితే, "మనలో కొమ్మ వెళ్ళి గొడ్డలిలో దూరి తోడ్పడుటచేతనే మనందర్నీ నరికేశక్తి మానవుడికి కలిగింది" అని వాపోయిన కొమ్మలసామ్యం స్త్రీలకు కూడా వర్తిస్తుంది.

చదువుకోవాలన్న ఆసక్తి, లలితకళల మీద సరదా ఇలాటివి అసలేమీ లేకుండా, రోజులు వెళ్ళబుచ్చటంతప్ప మరో వ్యాపకం లేక నీరసించినట్లుండేవాళ్ళనీ, అత్తమామల మాట, భర్తమాట లెక్కచెయ్యకుండా, తాబట్టిన కుందేలుకు మూడేకాళ్ళనే రీతిని ప్రవర్తించేవారినీ, తమకూ, తమతో ఉన్నవారికీ అనేక సమస్యలు తెచ్చిపెట్టేవారినీ అక్షరజ్ఞానం లేనివారిలోనే ఎక్కువమందిని చూస్తాము.

చదువువల్ల ప్రపంచజ్ఞానమూ, పదిమందితో కలిసిమెలిసి తిరిగే తీరు, తమలో నున్న లోపాలను దిద్దుకోగల శక్తివస్తుంది. ఒకే వస్తువుయొక్క రూప స్వభావ లక్షణాదులనుగూర్చి పదిమంది అభిప్రాయాలను తెలుపమంటే ఏ ఇద్దరి అభిప్రాయము కలియకపోవడం సామాన్యం. అంటే దాని యొక్క ప్రభావమైనా మనిషిపై, వాని యొక్క సంస్కార విద్యా, విజ్ఞానములపై ఆధారపడి ఉంటుంది.

మా అమ్మాయికి ఉన్నత విద్య అనవసరం అనే సుభాషితాలకి ఇక స్వస్తిచెప్పి ఒక్కసారి "విద్యవలన వినయంబు" అనే తరహా సుభాషితాలను జ్ఞాపకం చేసుకుంటే బాగుంటుంది.

మనలో చాలామంది ఆడపిల్ల పుట్టగానే "ఆడపిల్లా" అని పెదవి విరవడంతో ప్రారంభించి, అన్ని విషయాలలోనూ ఆటపాటల కాలంనుండీ ఆడపిల్లవు కావూ అని

# దీపం వెలిగించక

కసురుకుంటూ ఆడపిల్ల అవడమే మహాపాపం కాబోలునన్నేలాటి మన స్త్రీత్వము కలిగించుతారు. అన్నదమ్ముల అక్కచెల్లెళ్ళ మధ్య అసూయా, ద్వేషాలు, అసహనం కలకేతేటంత పక్షపాతబుద్ధి చూపుతారు.

కన్న తల్లిదండ్రుల ధోరణి ఇది.

ఇక, జీవిత భాగస్వామి అయిన భర్త, జీవితేశ్వరుడులాగే ఆలోచిస్తాడు. "జీవితాంతమూ నాపై ఆధారపడి ఉండవలసిన నీవూ నాకు చెప్పడమేనా" అన్న తరహాలో మాట్లాడుతాడు. తల్లి దైవమని పుస్తకాల్లో చదువుతున్నా, కన్న పిల్లలకి కూడా ఇదంతా చూచాక, అలత్యుభావం కలుగుతుంది. "ఎవరూ గౌరవించని ఈమెని మనం అట్టే ఖాతరు చెయ్యకపోయినా ఫరవాలేద"న్న ధారిన పడతారు.

ఈ విధంగా స్త్రీకి తన బుద్ధి బలాన్ని, విద్యావిజ్ఞానములను ఉపయోగించుకునే అవకాశం లేకుండా పోతోంది.

కనుక క్రమశిక్షణా లోపాన్ని, వస్తుతః ఓర్పు అనేది తక్కువా స్వార్థము ఎక్కువా అయిన మగవారి చేతిలోనే స్త్రీల మనుగడ ఉండడంవల్లకలిగే అనర్థాలనూ చదువుకి (కళాశాల విద్యకి) అంటకట్టడం ఏమి న్యాయం?

కాకపోతే విద్యావిధానంలో లోపాలు ఉంటే ఉండవచ్చును అవి సవరించుకోడం విజ్ఞఅవుతుంది కానీ, దీపముంటే పురుగులు వస్తాయని దీపంఆర్పేసుకుని కన్ను కానక ఏ తేలో, పామునో తొక్కి అది కరుచుట వల్ల బాధపడంలాగా, యువతులకు కళాశాల విద్య అనర్థదాయకమనడం అవివేకమే అవుతుంది. ★

# తోటికోడళ్ల బాధ్యత

(44 వ పేజీ తరువాయి)

ఇంటికొస్తే మా అమ్మ బాధపడేది. ఉన్న నాలుగు రోజులయినా ఏమయినా చేసి పెట్టాలని ఆమెబాధ. కాని ఆయమ్మ అజ్ఞలేనిదీ, దేనికీఅశక్తురాలు. నే నే సమాధానపరిచేదాన్ని అమ్మని. పట్నం నుండి వస్తూ కనీసం మాట వరసకైనా పిల్లలకి ఏమీ తెచ్చేదాన్ని కాదు. ఓసారి తెస్తే, "అంత డబ్బు ఖర్చు చేసి ఎందుకు తేవాలి?" ఇక్కడవాళ్ళేమీ తినడం లేదా అని ముఖం చిట్లించింది. పిల్లవాళ్లు ఏమయినా తెచ్చిందేమో అన్న ముఖాలు పెట్టేవారు. వాళ్ళముఖాలు చూస్తే నా హృదయం తరుక్కుపోయేది.

చివరికి పెదనాన్నగారు మాతమ్ముణ్ణి 'దత్తం' తీసుకొనేప్పటికి తలప్రాణం తోకకి వచ్చింది. అంతవరకూ పిల్లలూ తల్లులూ నాకేం అవసరం లేదనేది ఆమె. తన కడుపున పుట్టితేగాని తన బిడ్డ అనుకోలేదు ఆమె ఎలా అయితేనేం పెదనాన్న ప్రోద్బలం వల్ల ఒప్పుకొంది. వాడింకా 'ఫోర్త్ స్టాండర్డ్' చదువుతున్నాడు. ఆయమ్మ అంటుంది, వాణ్ని పట్నం పంపించాలని. సమీపాన ఉన్న 'టౌన్'కి పంపిస్తే ఖర్చులుండవని నాయనగారంటారు.

రోజూభోజనాల వద్ద ఆమధ్య ఇదే సమస్య. 'పట్నంలో చదివితే తెలితేటలు వస్తాయి. ఏం, వాణ్ణెందుకు అక్కడే చదివించకూడదు?' అంటుందామె 'టౌన్'లో అయితే తెలిసినటీచర్లు కనుక ఓ వేళ ఫెయిలయినా ప్యాస్ చేయించవచ్చు పట్నంలో మనకు తెలిసిన వాళ్ళుండరు అని నాన్న ఎంతఅన్నా నాతో వాణ్ని కూడాపంపించింది; ఫస్ట్‌ఫారం చదవడానికి. నాకెందుకు వందరూపాయలు నెల నెలా పంపిస్తున్నారా అని ఆమె ఈర్ష్య!

ఇక అమ్మతరఫున బంధువు లెవరయినా ఇంటికివస్తే ఆనాడల్లా చురచురలాడేది. అందుకని ఎవరూ రావడానికి జంకేవారు.

ఒకనాడు ఆయిల్లు రెండుముక్కలయింది. పెదనాన్నగారెంతోగానో బాధపడ్డారు. అదివరకు అంతపచ్చగా ఉన్న మేము వాడిపోయాం. మాఇంట్లో గంపెడుపిల్లలు. సంరక్షణ భారం పెద్దది. పెళ్ళికాని ఆడపిల్లలం ... నా చదువు మానేయవలసి వచ్చింది. ఒకసారి పెదనాయనగారన్నారు 'నేను మీ ఆయమ్మకి తెలీకుండా రూపాయలు పంపుతానమ్మా, నీవు చదువుతల్లీ!' అని. మరోజన్మలో ఆయన కడుపులో పుట్టాలని దేవుణ్ణి ప్రార్థించాను.

బామ్మనేను పట్నంనుండి రాగానే నన్ను కూచోబెట్టి అన్నీ వివరంగా చెబుతుంది ఇవన్నీ వింటూంటే నాకు బాధ కలిగేది. అంచేత అసలు ఇంటికి ఒక్కొక్కతడవ సెలవులున్నా వెళ్ళ బుద్ధివేయదు.

ఆయినా, అవిభక్త కుటుంబాలు కలిమిడిగా మసులుకోకపోతే ఆ సంసారాలు ఎవరికీ పట్టనివిగా నానాటికి తీసికట్టయి క్షీణిస్తాయి. అటువంటప్పుడు విడిపోవడమే మంచిది

ఒక్క కడుపునుండి ఒకేరక్తం పంచుకొని పుట్టిన వారికి సైతం ఈ కుటుంబ విచ్ఛిత్తిమూలంగా పెద్దపెద్దఅంతరాలువేర్పడతాయి. చూస్తూండగానే మేడ ప్రక్కనగుడిసె ఏర్పడవచ్చు.

ఒక కుటుంబ విచ్ఛిత్తికి ఒక స్త్రీయే హేతువై ఉండడంమనవాళ్ళగురదృష్టం ★

# బుడుగు చిచ్చుల పిడుగు!

[22 వ పేజీ తరువాయి]

తిరిగితే ఇంకేముంది. అక్కడ నేనులేను. నాన్న ఉన్నాడు. అయితే, ఇందాక నాన్న నవ్వుతున్నాడు ఇపుడు పాశ్చర్య పోయేస్తున్నాడు.

అప్పుడు అమ్మకి కోపం వచ్చేసింది. "బావుంది మంచీచెడ్డా లేకుండా ఏమిటా సరసాలు" అంది. సరసాలంటే నాకు తెలీదు.

నాన్న నవ్వేసి, అమ్మపక్క నే కూచొని, నువ్వు పిల్లవి కావా అన్నాడు. అయినా అమ్మ నవ్వలేదు.

ధ నోట ఎలాటిమాటలొచ్చాయమ్మా. అంది మెల్లిగా అంతట్లోకి అమ్మకళ్లలోంచి మెలిగా. కన్నీరు వచ్చాయి

"అమ్మ ఏడుస్తోంది. మా అమ్మని నువ్వెందుకు కోప్పడ్డావు" అని నాన్నని కోప్పడ్డాను నేను

"అట్టే, అమ్మ ఏడవటంలేదు. ఉల్లిపాయలు తరుగుతోందికదూ. అందుకూ కన్నీళ్లు" అన్నాడు నాన్న అమ్మకి కళ్లు తుడుస్తూ.

కాని అక్కడఅప్పలుఉల్లిపాయలు లేవు!

"అక్కడ ఉల్లిపాయల్లేవు." అన్నాను నేను.

నాన్నకి కోపంవచ్చింది. నేను నిజం చెప్పినాసరే. హూఁ అన్నాడు కోపంగా.

అందుకే నిజం ఎప్పుడు చెప్పాలో నాకు నిజంగా తెలీదన్నాను. వస్నడిగితే నిజం ఎప్పుడూ చెప్పకూడదు. (ఇంకా ఉంది)

> ## అదీ కారణం!
>
> యువజనసంఘం ఒకటి వరకట్న నిషేధం గురించి ప్రచారం చేయ పూనుకొంది. అరఫర్లాంగు పొడుగున్న కాగితంమీద వరశుల్కం కూడదని వ్రాసి ఊళ్లో వాళ్ల సంతకాలు పోగుచేసుకొచ్చారు సభ్యులు. ఎటొచ్చి సంఘం కార్యదర్శి తండ్రి సంతకం కనబడలేదు.
>
> "అదేమిటోయ్, ఘనుడా 'మీ' నాన్న సంతకమే లేకపోతే ఎలా. వెళ్ళి పెట్టించుకురా" అన్నాడు ఒక సభ్యుడు
>
> "ఏడిశారు. నేనెలా అడుగుతాను; అడిగినా ఆయనెలపెడతాడు. మాకు అసలు అక్కచెల్లెళ్లు లేరుగా. ఇంట్లో అంతా మొగసజ్జే" అన్నాడు కార్యదర్శి
>
> 'వాణి'

# సినిమా

## బొంబాయిసినిమాలేఖ ★ (ఆంధ్రపత్రిక విలేఖరి)

చైనా ప్రధాని చౌ ఎన్ లై ఆగమనంతో డిసెంబరు మొదటివారం బొంబాయి చలన చిత్రసీమ అంతా సంరంభంతో నిండి పోయింది.

డిసెంబరు 3 న, అతిథుల గౌరవార్థం ఇక్కడి ప్రభుత్వ భవనంలో విందు, వినోద కార్యక్రమాలూ ఏర్పాటు అయ్యాయి.

బొంబాయిసినీ తారాపథాన్ని అధిరోహిస్తున్న తెలుగు నాట్యతార వహీదా రెహమాన్ నృత్యంతో కార్యక్రమం ఆరంభం అయింది. తరువాత సుధామల్హోత్రా రెండు 'ఠుమ్రీ'లు, గీతారాయ్ రెండు గీతాలూ పాడేరు. అనంతరం కేశవ్ థోర్ద్రా వేణుగానం జరిగింది. కథక్ నాట్యరాణి సితారాదేవి, బృందం 'మేనకా-విశ్వామిత్ర' నృత్యం చేశారు. తరువాత 'భాంగ్రా' జానపదనృత్యం జరిగింది. మొత్తం కార్యక్రమంలో ఈ నృత్యాలు రెండూ ప్రేక్షకులను ముగ్ధుల్ని చేశాయి. బొంబాయిలో అధికార అనధికార ప్రముఖులలో పెద్దలకు తగ్గవారు వందమంది పైచిలుకు వచ్చారు.

మర్నాడు ఎక్సెల్సియర్ సినిమాలో మరొక ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటయింది. చలనచిత్రపరిశ్రమలో ప్రముఖులందరినీ అతిథులకు పరిచయం చేశారు. లిటిల్ బాలేట్రూప్, ఇండియన్ నేషనల్ థియేటర్, ఓరియంటల్ క్లబ్, భారతీయ విద్యాభవన్ల బృందాలు వివిధ ప్రాంతాల జానపదనృత్యాలు ప్రదర్శించారు.

* * *

ప్రజలకే ఏచిత్రాలు నచ్చుతాయి? అధిక సంఖ్యాకుల అభిరుచులు ఎలా ఉన్నాయి? ఏ తరహాచిత్రాలు ప్రజల అభిమానం చూరగొంటాయి?

ఈ తరహా ప్రశ్నలకు రకరకాల జవాబులు చెలామణీ అవుతున్నాయి. ఇది చాలవరకూ బాక్సాఫీస్ హృదయం అవగత చేసుకున్నామనుకున్న వారి ఊహాగానాలే తప్ప ఇదమిత్థంగా పదిమంది ప్రేక్షకులను అడిగి తెలుసుకుని తేల్చి చెప్పినవి కావు.

ఇప్పుడు, తొలిసారిగా ఇటువంటి ప్రయత్నం జరగబోతోంది. కేంద్ర సెన్సార్ సంఘం కోరికను పురస్కరించుకొని, టాటా సాంఘిక విజ్ఞాన పరిషత్ వారు శాస్త్రీయంగా ప్రజాభిప్రాయాన్ని, ప్రజల అభిరుచులను గ్రహించడానికి పూనుకొంటున్నారు. ఈ పరిషత్తు నియమించే సంఘం, వయస్సు, సమాజంలో స్థానం, అలవాట్లూ, ఆచారాలూ, మతం మొదలైన వివిధ కోణాలనుండి, స్థాయివారిగా వివరాలు సేకరిస్తుంది. దీనికోసం వీరు ఊరూరూ తిరిగి, ఇంటింటికీ వెళ్లి వేలాది జనాన్ని కలుసుకుని వారితో మంచీచెడ్డా మాట్లాడుతారు. పాఠశాలలకూ, కళాశాలలకు, సేవాసంఘాలకూ, క్లబ్ లకు, ఫ్యాక్టరీలకు వెళ్తాయి. రోడ్డు పక్కన కాపురం పెట్టుకు కాలక్షేపం చేసే వారి అభిప్రాయాలుకూడా అడిగి తెలుసుకుంటారు.

అయితే, ఈ కార్యక్రమం ప్రస్తుతం బొంబాయినగరంలో మాత్రమే జరుగుతుంది. ఇలాగే, దేశంలోని ఇతర ప్రముఖ నగరాలలో కూడా పరిశీలనజరిపి వివరాలు సేకరిస్తే ఈ అంశంపై సమగ్రమైన ప్రజాభిప్రాయాన్ని ఆకళించుకోవడానికి అవకాశం కలుగుతుంది. అది ఇటు ఫిలిం పరిశ్రమకూ, అటు సెన్సారుసంఘానికీ కూడా ఉపయోగకరంగా ఉంటుంది.

టాటాసంస్థ ఇటువంటి సత్కార్యానికి పూనుకొంటున్నందుకు ఫిలిం పరిశ్రమలో యావన్మందీ సంతోషిస్తున్నారు. ఫిలిం ఫెడరేషన్ ఇప్పుడు, ఈ కార్యక్రమాన్ని మిగతా ప్రాంతాలలో కూడా నిర్వహించవలసిన ఆవశ్యకత గురించి కేంద్ర సెన్సారు సంఘానికి నచ్చ చెప్పడం వాంఛనీయం. అంతేకాదు; ఆ ప్రత్యేక సంఘం సమగ్రంగా వివరాలు సేకరించడానికి ఫెడరేషన్ కాయకష్టులా తోడ్పడాలి. అవసరమైతే, ప్రేక్షకులు థియేటర్లలో ఉండగా వారిని ఇంటర్వ్యూ చేయడానికి కూడా వసతులు కల్పించాలి.

* * *

రష్యాలో ద్వితీయ భారత చలనచిత్రోత్సవాలలో పాల్గొనబోయిన భారత ప్రతినిధి వర్గంలో కామినీ కౌశల్, సురయ్యా, సొహ్రాబ్ మోడీ ప్రభృతులు తిరిగి వచ్చారు. నర్గీస్, రాజ్ కపూర్లు లండనులో నాలుగు రోజులు ఆగి వచ్చారు.

* * *

నానాటికి మంచి ఫిలిం గిరాకీ పెరుగుతూ

ప్రభా ప్రొడక్షన్సువారి 'ఆడపెత్తనం' లో గుమ్మడి, రాజసులోచన



శ్రీ ధనసాయి ఫిలిమ్సువారి "బలేబావ" లో జానకి.

## ★ బొంబాయి సినిమా లేఖ ★

ఉన్నందువల, ఈ ఫిలిం ఉత్పత్తికి మన దేశంలో ఫాక్టరీ నెలకొల్ప వలసిన అవశ్యకతను ప్రభుత్వం గుర్తించక తప్పని పరిస్థితి ఏర్పడింది మనకి ఈ రంగంలో అనుభవం లేదు. ఇటువంటి ఫ్యాక్టరీ నెలకొల్పినప్పుడు, ఆర్థికంగా అది దెబ్బ తినకుండా జాగ్రత్త పడాలి. దేశంలో పరిశ్రమ అవసరాలను బట్టి, ఏ ఏ రకాల ఫిలిం, సాలీనా ఎంతెంత అవసరం ఉంటుందో చూచుకుని, ఆ ప్రకారం ఫ్యాక్టరీ ఉత్పత్తి కార్యక్రమాన్ని రూపొందింప చేసుకోవలసి ఉంటుంది

ఇందులో సాంకేతిక బాధకాలను విచారిద్దాం

ఇంతవరకూ ఫిలింఉత్పత్తి పరిశ్రమ అనేదాన్ని ఉష్ణమండలంలో ఎవరూ ఎక్కడా నెలకొల్పలేదు. అలాచేసి నెగ్గుకురావడం సాధ్యమా అన్న సంగతి ఇంతవరకూ తేలలేదు. అమెరికన్, యూరపియన్ దేశాల ప్రవీణులు అసాధ్యమనే అభిప్రాయ పడుతున్నారు.

ఈ మధ్య తూర్పుజర్మనీనుండి ఒక నిపుణులబృందం భారతప్రభుత్వ ఆహ్వానం పురస్కరించుకొని, మనదేశంలో ఫిలిం ఫ్యాక్టరీ నెలకొల్పడానికి యోగ్యమైన స్థలంకోసం అన్వేషణ జరిపారు. యోగ్యమైన స్థలానికి ఉండవలసిన ముఖ్య లక్షణాలు కొన్నిటిని ఈ సందర్భంలో వారు తేల్చారు. స్థూలంగా అవి ఈ విధంగా ఉన్నాయి.

వాతావరణం ఫిలిం ఉత్పత్తికి వీలైనంత అనుగుణంగా ఉండాలి దుమ్ముధూళి, ఫాక్టరీల పొగ మొదలైనవాటితో కలుషితం అయిన వాతావరణం తగదు. శుభ్రమూ, స్వచ్ఛమూ అయినగాలి అవసరం.

శుభ్రమైన జలం పుష్కలంగా లభించాలి.

సంవత్సరం పొడుగునా, ఉష్ణోగ్రత ఎంత తక్కువగా ఉంటే అంత మంచిది.

అతితక్కువ ఉష్ణం ఉండే ప్రాంతాలలో బాగా చల్లగా ఉండే ఫ్యాక్టరీ గదులలో రోజంతా ఉండి పనిచేయడానికి అలవాటుపడ్డ పనివారు తగినంతమంది లభించాలి

ఫ్యాక్టరీలోపల ఉండవలసిన శీతోష్ణస్థితికి, ఫ్యాక్టరీ నెలకొల్పే స్థలం శీతోష్ణస్థితి ఎంత దగ్గరగా ఉంటే అంత మంచిది. రిఫ్రిజిరేషన్ యంత్రాలఖర్చు ఇందువల్ల తగ్గడానికి వీలు ఉంటుంది ఫిలిం ఉత్పత్తి ఖర్చు దీని మీదే ఆధారపడి ఉంటుంది. ఎందుకంటే ఉష్ణోగ్రత ఎక్కువగాఉన్న ప్రాంతంలో ఫ్యాక్టరీ నెలకొల్పితే, ఫ్యాకరీ లోపలి భాగాన్ని చలవచేయడానికి చాలా డబ్బు ఖర్చవుతుంది. అలాగే వాతావరణం ధూళి, పొగ, ఫొటోగ్రాఫిక్ ఎముల్షన్‌కు హానిచేసే వాయువులు మొదలైనవి లేకుండా చల్లగా శుభ్రంగావుంటే, బోలెడు డబ్బుపోసి ఫిల్టర్లుకొని అమర్చవలసిన అవసరం తప్పుతుంది.

ఇవన్నీ చూడగా, లాభసాటిగా ఫాక్టరీ నడపాలంటే హిమాలయాల దగ్గర ఎక్కడైనా చోటు వెతకాలేమో ననిపించింది గాని, నీలగిరి ఈ విషయంలో అన్ని విధాలా యోగ్యమైన ప్రాంతం. పరిశీలక సంఘం వారు ఉదకమండలంలో అనుకూల వాతావరణమే కాక నీటి సరఫరా, రవాణా వసతులు మొదలయినవి కూడా ఉన్నాయని సూచిస్తూ ఈవిషయాలు, ఫ్యాక్టరీ నిర్మాణానికి సంబంధించిన ఆర్థిక విషయాలు వివరిస్తూ సమర్పించారు.

* * *

షమ్మీకపూర్ భార్య, నటి గీతా బాలి నవంబరు 30 న తన 26 వ పుట్టినరోజు పండుగ చేసుకుంది. గీతాబాలికి ఈఏడాది అనేక విధాల ఆనందమయంగా సాగింది. చలన చిత్రాలలో ఆమె నటించినవి విజయవంతం అయ్యాయి ఈ ఏడాదే ఆమె కులదీపకుడిని కన్నది కూడా.

గీతాబాలి నటించిన తొలిచిత్రం సొహాగ్ రాత్. ఆనాడు తానింతటి స్థాయినందుకొనగలదని కలలో కూడా అనుకొని ఉండదు. సహజప్రతిభవల్ల ఆమె రాణించింది గణకెక్కింది. చలన చిత్రాల నేవి తయారైనా బాజ్లీ బావరే సైంయా, అల్బేలా, బాకీ, మిలాప్, వచన్ చిత్రాలను ఎవరూ మర్చిపోరు. ప్రతిభావతి అయిన గీతాబాలిని చూచి ఆమె అభిమానులూ పరిశ్రమలోని వారూ కూడా గర్విస్తారు.





రావల్ ఫిలిమ్సువారి "మిస్ ఇండియా"లో నర్గీస్, ప్రదీప్ కుమార్.

చిత్రసమీక్ష:

## జాపనీస్ చిత్రం 'గాడ్జిలా'

"గాడ్జిలా" అనే జపాన్ చిత్రాన్ని ఇటీవల రేవతీ ప్రివ్యూథియేటర్‌లో పత్రికల వారికి చూపించారు. జపాన్‌లోని టోహోకంపెనీ దీన్ని నిర్మించింది.

బికినీదీవుల వద్ద సాగిన అణ్వస్త్ర పరీక్షలవల్ల, కల్లోలిని అల్లకల్లోలం అయిపోయింది.

శాంతి మహాసముద్ర గర్భంలో అట్టడుగున నిద్రావస్థలోపడి ఉన్న ఇరవైలక్షల ఏళ్ళనాటి జంతువు ఒకటి అప్పటికి, ఆ కల్లోలానికి మేలుకుంది. మేలుకుని పైకి వచ్చింది. నాలుగువందల అడుగుల ఎత్తూ ఎంతటి ఆధునిక ఆయుధాలకైనా దుర్భేద్యమైనకవచం, విద్యుదాఘాతానికి అతీతమైన తత్వంగల ఆ జంతువు కదలివస్తున్న అగ్నిపర్వతంలా జపాన్ రాజధాని టోక్యో నగరం మీదికి విరుచుకపడింది. పెద్దపెద్ద భవంతులను, ఓడలనూ, రైళ్ళను, అప్పడాలకి మల్లె చితగ్గొట్టగల దెబ్బ శక్తితోపాటు, వాటిని భస్మీపటలం చేసేటంత వేడి వాయువును ఆవిర్భవింపచేసే శక్తి కూడా ఆ జంతువుకు ఉంది. దాని పేరు గాడ్జిలా.

గాడ్జిలా క్రమంగా టోక్యోలో చాలా భాగం ధ్వంసంచేసివేసింది. దాన్ని అరికట్టే ఆయుధం లేకపోయింది. బ్రతికి బయటపడే మార్గం లేకపోయింది. ఇవాళటోక్యో, రేపు జపాన్, ఎల్లుండి ఇంకో దేశం—దీనికి అంతెక్కడ?—

ఒక్కచోట-ఒక్క శాస్త్రజ్ఞుడి మేధలో ఈ గాడ్జిలా రాక్షసిని సంహరించగల ఆయుధం ఉంది.

అది హైడ్రోజన్ బాంబుకు పైమెట్టు. ఆక్సిజన్ ప్రభావంగా తయారైన విధ్వంసకాస్త్రం. ఆ శాస్త్రజ్ఞుడు టోక్యోలోనే ఉంటూ, గాడ్జిలా విధ్వంసకాండ కళ్ళారా చూస్తూ, తనకుటుంబు తనూ ఆ మృత్యుదేవత నీడలోనే ఉంటూ, దాన్ని సంహరించే ఆయుధం చేతఉండి కూడా ప్రయోగించకపోవడానికి, ఆ ఆయుధం ఉన్నట్టు ఎవరికీ చెప్పకపోవడానికీ ఒక్కటే కారణం ఉంది..

అది "మనుషుల మనసు" పట్ల ఉన్న అవిశ్వాసం, భయం. అటంబాంబు కనిపెట్టిన మనిషి, దాన్ని తోటిమనిషిమీద ప్రయోగించి నిరపరాధులైన ప్రజలను చంపడానికి వెనుకాడలేదు. పోటీలుపడి హైడ్రోజన్ బాంబు పరీక్షలు సాగిస్తున్న మనుషులంతా



పత్యేన్ బోస్ చిత్రం "ఏక్ గాఁవ్ కీ కహానీ"లో మాలాసిన్హా.

## చిత్రసమీక్ష

శత్రు అణవరంత స్త్రీ అటువంటి తని ఉప కారదు. ఈ స్థితిలో ఇప్పుడు తను ఆక్సిజన్ అస్త్రంతో గాడ్జిలాను ఇవాళ ధ్వంసం చేస్తే ప్రస్తుతానికి ఈ సమస్య పరిష్కృతం అయి నట్టు కనబడుతోంది గాని, అదిరేపు ఇతర గాడ్జిలాల కన్నా, ప్రపంచ మానవాళిమీద విరుచుకు పడుతుంది. తను ఈనాడు దాన్ని ప్రయోగిస్తే, శత్రు అధికారులూ, అనధి కారులూ, అంతా ఆ అస్త్రం నిర్మించే మార్గం బలవంతాన బయటపెట్టిస్తారు. ఏ ప్రభుత్వమైనా ఇక ఆక్సిజన్ అస్త్రాలు తయారు చేసి, వాడుతుంటుంది. దానికి అడ్డువుకి అంతెక్కడికి శాస్త్రజ్ఞుడు ఇలా మథన పడు తున్నాడు. ఎదట మానవవిధ్వంసన భారీ విత్తన సాగిపోతోంది.

చివరకతడు తెగించి ఒక మహాత్తరమైన నిర్ణయం చేశాడు.

గాడ్జిలాను తాను సంహరిస్తానని ప్రకటిం చాడు. అధికారులు సన్నాహాలు చేశారు.

పగలంతా గాడ్జిలా సముద్ర గర్భంలో దాగి ఉంటుంది.

శాస్త్రజ్ఞుడు తన ఆక్సిజన్ అస్త్రం పట్టు కుని ఓడమీద బయలు దేరాడు.

కొంత పరిశోధన జరిపినమీదట గాడ్జిలా ఉన్న చోటు అయూకి తెలిసింది. శాస్త్రజ్ఞుడు ఒక సహాయకుడిని వెంటపెట్టుకుని నీటిలోకి దిగాడు. సముద్రం అడుగుభాగన గాడ్జిలా ఒక చోట కనబడింది. సహాయకుడిని పైకి పద మన్నాడు శాస్త్రజ్ఞుడు.

సముద్రం ఉపరితలాన ఓడలో ఆతృతగా ఎదురుచూస్తున్న వారంతా, సహాయకుడు ఒక్కడే తిరిగి రావడం చూసి ఆరాట పడ్డారు.

కొద్ది నిముషాలలో 'గాడ్జిలా' మహా కాయం విలవిల తన్నుకుంటూ పైకి తేలింది. మళ్లీ మునిగి పోయింది. క్రమంగా ఆక్సిజన్ మంటలకి దహించుకుపోయి, చివరి అస్తి పంజరం మిగిలింది.

దాన్ని సంహరించిన శాస్త్రజ్ఞుడు కూడా ఆ గాడ్జిలాతో పాటే, తన అస్త్రానికి బలి అయిపోయాడు.

తప్పించుకువచ్చి ప్రకటకకారుడు, ప్రతి భూలోకంలో జలచరాల పీడ వుడి, మరో మహాస్త్రాన్ని మానవుడి చేతికి ఒప్పగించి చిరస్మృతుడు కాలేక, తనతోపాటే, తన రహస్యాన్ని కూడా స్వంతం చేసుకుని మృతజీవి అయ్యాడు.

ఇదీ కథ. ఇది జపాన్ ప్రజల హృదయ ఘోష. ఎందుకంటే, అటంబాంబు ధీధత్సా నికి గురిఅయినది జపాన్ ప్రజలు. తరువాత హైడ్రోజన్ బాంబు పరీక్షలవల్ల అణుకిరణ ధూళిపాలై నష్టపడ్డవారు జపాన్ జాలరులు.

అందువల్ల వారికి ఈ మారణాయుధాలను గర్హించడానికి ప్రపంచంలో అందరికన్న ఎక్కువ అధికారం ఉంది. అంతటి అధి కారంతో ఉద్రేకంతో గాడ్జిలా రూపేణా ఈ అణ్వస్త్రాల విధ్వంసక శక్తిని ఇందులో చిత్రించారు, హిరోషిమా విషాదగాధను ఇందులో ప్రతిబింబించారు.

ఈ తరహా చిత్రాలు హాలీవుడ్ నుండి అనేకం వచ్చాయి. కథా వస్తువు దృష్ట్యా, దీని ముందు అవన్నీ తూగకపోవు గాని, టెక్నికల్‌గా మటుకు ఇది నాటిస్థాయిని అందుకోలేదని చెప్పవలసి వస్తుంది. అయితే, ఆలోపం ఎక్కడా కొట్టొచ్చినట్టూ కనబడకుండా నిర్మాతలు కప్పుకురాగలిగారు.

ఈ చిత్రాన్ని అమెరికాలో రెండవ సారి ఎడిట్ చేసి, ఇంగ్లీషులో డబ్ చేశారు.

## గౌతమబుద్ధ

భారత ప్రభుత్వం పేరిట బిమల్ రాయ్ ప్రొడక్షన్ వారు 'గౌతమ బుద్ధ' అనే డాక్యుమెంటరీ నిర్మించారు. నాగార్జున కొండ, అమరావతి. అజంతా, ఎల్లోరా శిల్పాలను, బర్హూ, పయాం, సాంకాశం, కాంబోడియా దేశాలలోని చిత్ర శిల్పాలనంటాటిని ఒక చోట చూడ చూడడానికి ఈవిధంగా అవకాశం కలిగింది. ఈ చిత్రాల, శిల్పాలతోనే బుద్ధుని కథను ఆయా సంకేతాన్ని ఇందులో చిత్రించారు. ఈ చిత్రాన్ని దేశంలోని ప్రముఖ నగరాలలో అధికార అనధికార ప్రముఖులకు చూపించారు. ★



## నాగేశ్వరరావు చిత్రషష్టిపూర్తి

నటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావు త్వరలోనే, షష్టి చిత్రపూర్తి అయిన సందర్భంలో, మహోత్సవాలు జరుపు కొనబోతున్నారు. ఈయన నటిస్తున్న అరవయ్యో చిత్రం విజయవారి 'మాయా బజార్'.

చలన చిత్ర కథ

# హవానా రోజ్

ఉపకారం ఖరీదు ప్రతిఫలం.

ఎదటిమనిషి అవసరాన్ని బట్టి ఈ రేటు పెరుగుతూ ఉంటుంది.

ఈ నాడు ఏ వెనకబడ్డదేశమో అప్పుకోసం ఏ దేశమేగినా, "ఆదేశం కూడా పుచ్చుకోవాలి" అనే షరత్తు కాళ్ళకి అడ్డు తగులుతుంది.

అనగనగా స్పెయిన్‌కోస్తా ప్రాంతంలో దిగువ సెలామియా అనేదేశం ఉంది (ట). ఆదేశపు ప్రభుత్వానికి రెండుకోట్ల రూపాయలు అప్పు కావలసి వచ్చింది. డబ్బున్న దేశాల ప్రభుత్వాల నడగడంకన్న, కొద్ది మాత్రమే కాబట్టి, ఆదేశాలలో కోటీశ్వరుల్ని మంచిమాట చేసుకోవడం మెరుగన్న ఊహలో, ప్రభుత్వం, తన రాయబారులకు ఆవిధంగా సలహాయిచ్చింది. వాషింగ్టన్‌లో సెలామియా రాయబారి, లోపాయికారిగానే, ఫిల్మోర్ అనే కోటీశ్వరుణ్ణి ఈవిషయమై కదలేశాడు.

"రెండుకోట్లా," అంటూ పాలోచనగా కోటుజేబులు తడుముకున్నాడు ఫిల్మోర్ "లేనట్టుందే... మరేఉన్నట్టులేదు... నీదగ్గర చిల్లరేమేనా ఉందా" అన్నాడు భార్యవంక తిరిగి.

రాయబారి ఈ సరసంలో స్వారస్యం గ్రహించినట్టు నవ్వాడు. "ఏమి చక్కని ఛలోక్తి... ఏమిరిది!.. మీరుబహు గొప్పవారు. ఎంతగొప్ప హృదయం. ఎంతటి మేధ. ఏమి ఔదార్యం..."

"మరే...ఎంతడబ్బు..." అన్నాడు ఫిల్మోర్ నిర్వికారస్వరంతో.

ముఖస్తుతులు చెలవని గ్రహించి నవ్వేశాడు రాయబారి. "ఈ కాంట్రాక్టుమీద సంతకం పెడితే..."

ఫిల్మోర్ పాకెట్ పంచాంగంతీసి చూశాడు.

శనిబుధులు, ఏఇంట్లో ఉన్నారు. గురు శుక్రచారం ఎలాఉంది. వ్యయాధిపతి అభిప్రాయం ఏమిటో అని కనుక్కున్నాడు

"లాభం లేదు నాకివాళ మంచిదికాదు అప్పులు మంజూరు చెయ్యడానికి" అన్నాడు చివరకి.

"ఏమిటా మతిలేనిమాటాలు" అని గసురుకుంది ఫిల్మోర్ సతి. "ఇలా ఇయ్యండి



"బర్సాత్" చిత్రంతో పేరుతెచ్చుకున్న దక్షిణ భారతనర్తకి విమల, ఇప్పుడు తిరిగి రెండు మూడు బొంబాయి చిత్రాలలో బుక్ అయింది

ఆ కాగితం-సంతకం పెట్టేది మీరు కాదు; నేను" అందావిడ "మరే నువ్వే కదూ" అన్నాడు ఫిల్మోర్.

ఫిల్మోర్‌కు చాలాసంగతులు తెలీవు. అతనేం తినేది, తాగేది, ఎక్కడికి వెళ్ళేది వెళ్ళనిదీ అన్నీ ముందర ఆవిడకే తెలుస్తాయి. ఆ తరవాత ఆయనకి తెలుస్తాయి. ఓహో అనుకుంటాడు.

ఫిల్మోర్ సతి అప్పు కాంట్రాక్టు మీద సంతకం పెట్టేసుకోబోతోంది. సెలామియా రాయబారి హమ్మయ్య అంటు గుండెలమీదబరువుని దించుకోబోతున్నాడు. బల్లమీద కప్పులలో బట్లరుకాఫీ పోయబోతున్నాడు. కాని, అంతలోనే బట్లర్ వెనకాల తలుపు దూకుడుగా తెరచుకుని అతన్ని కోపపడింది. అందుచేత అతను ముందుకు తూలాడు. అందుచేత జార్‌లో కాఫీ కప్పులో పడకుండా ఇంకొంచెం ముందుకుతూలి కాంట్రాక్టు కాగితాలమీద, సంతకం పెట్టబోతున్న ఫిల్మోర్ సతిమీద పడింది.

ఈ ప్రమాదాలకు కారణం తలుపు. అది దూకుడుగా తోసుకురావడాని కారణం రాయబారి కూతురు ఎస్పెలిటా.

ఫలితం ఫిల్మోర్ దంపతులకు కోపం రావడం. దాని ఫలితం అప్పు మంజూరు తాత్కాలికంగా రద్దు కావడం.

రాయబారికి ఒళ్లు మండిపోయినా, చాటు నుండి ఇదంతా గమనిస్తున్న సెలామియా దేశపు గూఢచారికి గుండెలమీద రాయి దిగింది. ఆదేశంలో ఒక తిరుగుబాటు ముఠా పని చేస్తోంది. ప్రభుత్వానికి అమెరికాలో అప్పు పుట్టకుండా చేస్తే, ప్రజలకి నమ్మకం పోయి, కోపం, వస్తుందనీ, అప్పుడు తిరుగుబాటు ధోకాలేకుండా జరుగుతుందని వాళ్ల నమ్మిక.

* * *

ఎస్పెలిటా, ఉన్న తెలివితేటలన్నీ ఉపయోగించి జిప్సీ వేషంలో ఫిల్మోర్‌ను కలుసుకుని, జోస్యం చెప్పింది. "ఇవాళ నీకు ఒక కాక్‌టెయిల్ పార్టీకి రమ్మని పిలుపు వస్తుంది. అక్కడ నువ్వు రెండు కోట్లు పెట్టుబడి పెడతావు. అది లాభకరం" అని చెప్పి, ఇంటికి చక్కా వెళ్లింది. "నాన్నోయ్ నీకు బోలు సాయం చేశాను. ఫిల్మోర్‌ని ఫోన్ చేసి పిలు పార్టీ ఉందని" అంది.

ఫిల్మోర్ అప్పిస్తాడన్న ఆశ వదులుకున్న రాయబారి, ఈసారి పిలిచి చూసేసరికి వాళ్ళూ వప్పుకోవడంతో విస్తుపోయాడు.

పార్టీలో కోపతాపాలు సర్దుకపోయాయి. రాయబారి అప్పుకోసం మళ్లీ 'మాలీసు' ప్రారంభించాడు. ఈసారి అతడు, ఫిల్మోర్ పతి గురించి అట్టే పట్టించుకోకుండా, సతినే స్తుతించడం సాగించాడు.

ఇక్కడ ఫిల్మోర్ కూడా అసలు ఈ దృష్టిలో లేడు రాయబారి కూతురు ఎస్పెలిటాను ఎక్కడో చూసినట్టు లీలగా గుర్తు. అది జ్ఞాపకం చేసుకోవడం మీద తనభార్య కన్నుగప్పి ఒక్కగుక్క 'కాక్‌టెయిల్' సేవించడం ఎలాగా అన్న విషయం మీద అతడు శ్రద్ధగా ఆలోచిస్తున్నాడు.

ఎస్పెలిటా పక్కగదిలోకి వెళ్లడంచూసి, ఆమెనే అడిగితెల్సుకోవాలని వెంటబడ్డాడు భార్య గమనించటం లేదన్న అపోహతో. కాని, ఆయన సతీమణి నిశితదృష్టి భర్తని అనుసరించింది. భర్త ఆ గదిలోపలికివెళ్ళి తలుపు వేయడంతో ఆవిడకి మతిపోయింది. స్తుతివాక్యాలతో ఊదరగొడుతున్న రాయబారిని వదలించుకుని, తలుపు దగ్గరకివెళ్ళి గడియ సందులోంచి లోపలికిచూసింది

పెరటివేపు కిటికీలోంచి ఆ గదిలో ప్రవేశించిన మెక్సికన్ కౌబాయ్ 'టామ్'కు ఎస్పెలిటా తన పెదవులతో పీడొక్కలు చెబుతోంది. ఆమె పీడొక్కలు చెప్పటం, మరోకమూల ఫిల్మోర్ చాటుగా విస్కీ తాగడం పూర్తిఅయి, ఇద్దరూవచ్చి. హఠా

# హవానా రోజ్

తృగా తలుపుతీయడంతో, అంతవరకు దురభిప్రాయపడిపోయి, అక్కడే నిలబడి ఆశ్చర్యపడిపోతూ ఉన్న ఫిల్మోర్ సతి, దభేలున క్రిందపడిపోయి, కన్నులొట్టబోయి, అలాగే కొయ్యబారిపోయింది. ఈవిధంగా, రెండోసారిగా సెలామియాకు మంజూరు కాబోయిన అప్పు రాయబారి చేయిజారిపోయింది.

* * *

రాయబారికి వళ్లు మండిపోయింది. మళ్ళీ ఈ విఘ్నాలకి కారణం, నిన్ను అమెరికా తీసుకురావడం నాదే తప్పు, తక్షణం సెలామియా పద అంటూ ఎస్టెలిటాని ప్రయాణం కట్టించేశాడు.

ఎస్టెలిటాకి సెలామియా వెళ్ళడం సుతరామూ ఇష్టంలేదు. అందులోనూ తన ప్రియుడు టెక్సాస్‌లో ఉన్నాడు. అక్కడికిపోతే సరిఅనుకుంది. నౌకరుకి చులాగ్గా టోకరా ఇచ్చేసి, టిక్కెట్లు మార్చుకుని, టెక్సాస్ రాజధాని రీనోకి విమానం ఎక్కింది. అక్కడ హోటల్లో తన అసలు పేరు చెప్తే, తండ్రికి తెలిసిపోతుందికదా అని, (కథ ముగింపుకి వీలుగా, ముఖ్యపాత్రలన్నిటిని ఒక్కచోటుకి చేర్చాలికదా అనీ) ఆ హోటల్లో తాను ఫిల్మోర్ సతినని పేరు నమోదు చేయించింది.

ఈలోగా సెలామియాలో తిరుగుబాటు నాయకుడికి ప్రచండమైన ఊహ తోచింది. ఫిల్మోర్ సతి అప్పు మంజూరు చేయకుండా అడ్డుపడడానికి ప్రయత్నాలు చేస్తూ ఉండేబదులు, ఆవిడని హత్యచేయించి పారేస్తే బెంగఉండదని నిశ్చయించుకుని, నమ్మినబంటు లిద్దర్ని పంపించాడు అమెరికాకి.

వాళ్లు ఆచూకీతీసేసరికి, ఫిల్మోర్ సతి టెక్సాస్ రాజధానిలోని ఒక హోటల్లో దిగిందని తెలిసి అక్కడకు వెళ్లారు.

* * *

వాషింగ్‌టన్‌లో, అలిగి, కనబడకుండా మిత్రులఇంటికి వెళ్లిన భార్యకోసం వెతుక్కుంటున్న ఫిల్మోర్ కూడా, ఎస్టెలిటా దొంగపేరు టోకరాలో మోసపోయి, భార్య విడాకు లిస్తుందని భయపడి, రీనోనగరం ప్రయాణమై వెళ్లాడు—ఆవిణ్ణి బ్రతిమాలడానికి.

అలుకతీరి, ఇంటికి వచ్చిన ఫిల్మోర్ సతికి, తనభర్త గంటక్రితమే రీనోనగరం వెళ్లాడని తెలియగానే ఠెంబేలెత్తిపోయింది. తాగుబోతులకి జూదగాళ్లకీ నిలయమైన ఆ ఊళ్లో ఏ ర్రకెంపని అని.

"ఫిల్మోర్ సతి" అన్న దురభిప్రాయంతో ఎస్టెలిటాను చంపబోయిన సెలామియా కుట్రదారుల ప్రయత్నాలు కలిసిరాలేదు. అంతలోకే ఫిల్మోర్ వచ్చాడు. ఆయన్ని వెతుక్కుంటూ, నిజమైన ఫిల్మోర్ సతి వచ్చేసింది.

ఆవిడని పసిగట్టిన కుట్రదారులు కూడా వెంబడించి తలిన ముసుగేసి చావగొట్టి మోసుకుపోయే సదుద్దేశంతో అందుకుపూనుకునేసరికి, ఎస్టెలిటా ప్రియుడు టాం వచ్చాడు.

ఫిల్మోర్ సతిని చంపబోతున్న కుట్రదారిద్దరినీ అటకాయించి చితక్కొట్టి మూర్ఛపోగొట్టేసరికి, అంతవరకూ మూలపడిఉన్న ఫిల్మోర్, చేతికందిన కర్రతో టెక్సాస్ యువకుడి తలమీద ఒక్కటి వేసి, ఆతరవాత, భార్య తలమీద గోనెసంచి తొలగించి 'హు' అన్నాడు గంభీరంగా. స్పృహతప్పి పడిఉన్న దుర్మార్గుల్ని, చేత కర్రపట్టి నిలబడ్డ పతి దేవుణ్ణి చూసి ఫిల్మోర్ సతి ఆశ్చర్యపడిపోయింది.

"ఓ నాథ! మృత్యువాత నన్ను కాపాడేవు" అని.

"మరే సేసేం, మరేం, భయపడకు. నువ్వు తప్ప, అంతా అదుపులోకి వచ్చేశారు" అన్నాడు ఫిల్మోర్ గంభీరంగా.

ఫిల్మోర్ దంపతులకోసం, వెతుకుతూ వచ్చిన సెలామియా రాయబారికి, ఆగదిలో వున్న తనదేశం గూఢచారులు దొరికారు, కుట్రపట్టుబడింది

ఆతరవాత, తాను వలచిన రాజాని ఎస్టెలిటా, తానుకోరిన ఋణాన్ని సెలామియా రాయబారీ, తనకి ఇన్నాళ్ళూ లభించని అజమాయిషీ అధికారాన్ని, కరపెత్తనాన్నీ ఫిల్మోర్ సంపాదించుకున్నారు.

ఈ కథను "హవానా రోజ్" అనే పేరుతో రిపబ్లిక్ పిక్చర్స్ వారు చలనచిత్రంగా నిర్మించారు. ఎస్టెలిటా రాడ్రిగస్, బిల్ విలియంస్, హ్యూ హెర్బర్ట్ ముఖ్య భూమికలు నిర్వహించారు. ★

# మద్రాసులోని కళాకారులకు చౌ ఎన్‌లై ఆహ్వానం

చైనా ప్రధాని ఈ నెల 8వ మద్రాసు వచ్చినప్పుడు రెండు గంటలసేపు ఇక్కడి చలన చిత్ర కళాకారులతో ఇష్టాగోష్ఠి జరిపారు.

మధ్యాహ్నం తొలిసారిగా ఆయన జెమినీ స్టుడియో చూడబోయినప్పుడు, అక్కడ తెలుగు తమిళ నటీనటులను దర్శకులను కలుసుకున్నారు.

సాయంత్రం గిండీ రాజభవన్‌లో విందు జరిగింది. నాటకరంగ, చలనచిత్ర నటీనటులు 50 మందికి పైగా వెళ్లారు ప్రధాని చౌ వారితో ఎంతో సరదాగా కలిసికట్టుగా ఇష్టాగోష్ఠి జరిపారు.

"మీరు మా దేశం వచ్చి అక్కడికళాకారులతో మీ కృషి, ఫలితాల గురించి చెప్పండి. మావారు మీ దగ్గర నేర్చుకోతగ్గ సంగతులు ఎన్నో ఉంటాయి మీరూ మీరూ కలుసుకొని మాటాడుకోవాలి. మీ మద్రాసు నగరం భారతీయ సంస్కృతీ కేంద్రం. ఇకపైన ఈ నగరంతో కూడా మేము సాంస్కృతిక సంబంధాలు పెంపొందించుకొంటాం" అన్నారు శ్రీ చౌఎన్‌లై.

మద్రాసు కళాకారులు చైనా ప్రధానికి ఒక నటరాజ కాంస్య ప్రతిమను, అశోక చక్ర ముద్రాంకితమైన ఉంగరాన్నీ, భారతప్రధాని శ్రీ నెహ్రూ చిత్రపటాన్నీ కానుకలుగా ఇచ్చారు. ★



ఎడమనుంచి పద్మిని, ప్రధాని చౌ, జెమిని గణేశన్, ఎస్. ఎస్. వాసన్

# టిబెట్, నేపాల్ సిక్కిం భూటాన్‌లచరిత్ర

(30వ పేజీ తరువాయి)

స్తోందని కూడా ఆరోపించింది. ఈ ఆరోపణను భారత ప్రభుత్వం అక్టోబరు 31వ తేదీ లేఖలో ఖండించింది. టిబెట్ సమస్య శాంతియుతంగా పరిష్కారం కావాలనడంలో తమకు స్వార్థమేమీ లేదనీ, చైనీస్ ఆధిపత్యానికి లోబడి టిబెట్‌కు స్వయం పరిపాలన ఉండాలని మాత్రమే తమ అభిప్రాయమనీ, చైనా విషయంలో అనవసర జోక్యం చేసుకోవడం తమ అభిమతం కాదనీ నోట్ చెప్పింది.

## సమితికి ఫిర్యాదు

ఇది ఇలా ఉండగా నవంబరు 7న టిబెటన్ ప్రభుత్వం చైనీస్ దండయాత్రపై ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేసింది. అది నవంబరు 18కు సమితికి చేరింది. సమితిలో సాల్వడార్ ప్రతినిధి ఈ ఫిర్యాదును చర్చించాలని ప్రతిపాదించాడు. లండన్‌లో ఉపవిదేశాంగమంత్రి ఎర్నెస్టు డేవిస్ భారతవైఖరిని సమర్థిస్తూ చైనీస్ చర్యను నిరసించారు. కాని అప్పుడు సమితిలోని భారతప్రతినిధి వర్గ నాయకుడు నవనగర్ జాంసాహెబ్ టిబెటన్ సమస్య శాంతియుతంగా పరిష్కారం కాగలదని తమ విశ్వాసమని, చైనాకూడా అదే విధంగా భావిస్తోందనీ నచ్చచెప్పారు. సమితి టిబెటన్ ఫిర్యాదును చర్చించకుండా మానివేసింది. అమెరికా కూడా ఈ విషయంలో కలగజేసుకోడానికి ఇష్టపడనందున ఆ సమస్య అలాగే సమసిపోయింది.

ఇప్పుడు టిబెట్ చైనాలో అంతర్భాగంగా ఉన్నప్పటికీ మత స్వాతంత్ర్యం, అంతరంగిక పరిపాలనాస్వాతంత్ర్యంకమ్యా విష్టుచైనా గుర్తించింది. టిబెటన్ సైన్యాలను మాత్రం చైనీస్ సైన్యంతో కలిపివేశారు. దేశాన్ని అధునాతన మార్గాల్లో అభివృద్ధి చేయడానికి చైనాప్రభుత్వం ప్రయత్నిస్తోందని తెలుస్తోంది.

1950 నవంబరులోనే మరొక చిన్న పేచీ చైనా, భారతదేశాలమధ్య వచ్చింది. చైనావారు అచ్చువేసిన దేశపటాలలో మన దేశపు ఈశాన్య మూలలోని కొన్ని భాగాలు చైనాకి చెందినట్లు చూపబడ్డాయి. ఈ విషయం మీద ఆ నవంబరు 30వ తేదీన భారత ప్రధాని పార్లమెంటులో ప్రకటనచేస్తూ "పటాల సంగతి నాకు తెలియదు; 1914లో సిమ్లా సమావేశంలో నిర్ణయింపబడిన మక్‌మహాన్ పరిహద్దే భారత టిబెట్ దేశాల సరిహద్దు" అని ఖచ్చితంగా చెప్పారు. లడఖ్ ప్రాంతంనుంచి నేపాల్ దాకా, భూటాన్‌నుంచి అస్సాంలోని ఐరావతీ—పార్శ్వన్ లోయదాకా మనదేనని, భూటాన్ తరవాత మన పరిహద్దు 1914లో నిర్ణయింపబడినదనీ ఆయన తేల్చివేశారు. దరిమిలా ఈ సమస్య భారత చైనా ప్రభుత్వాలు చర్చల ద్వారా శాంతియుతంగా పరిష్కరించుకున్నాయి.

## నేపాల్

హిమాలయాల దక్షిణపు వాలులోని హిందూ రాజ్యం నేపాల్. దీని విస్తీర్ణం 55 వేల చ. మైళ్ళు. జనాభా 85లక్షలు. ముఖ్య పట్టణం ఖాట్మాండు. నేపాల్ మొదటినుంచీ స్వతంత్ర రాజ్యంగానే ఉంటోంది. బ్రిటిష్‌వారితో ఒకసారి యుద్ధమయ్యాక 1815లో సగాలీ సంధి జరిగింది. బ్రిటిష్‌వారు నేపాల్ రాజును స్నేహం చేసుకున్నారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో నేపాల్ బ్రిటనుకు ధన, సైనిక సహాయం చేసింది. సగాలీ సంధిని బలపరుస్తూ 1923లో మరొక ఒడంబడిక జరిగింది. ఏటా పది లక్షల రూపాయలు నేపాల్‌కు విరాళం ఇవ్వడానికి బ్రిటన్ అంగీకరించింది.

నేపాల్‌లో మంగోల్, తార్తార్, భారతీయ జాతులకు చెందిన ప్రజలు నివసిస్తారు. వీరిని గూర్ఖాలు, మగార్లు, భూతియాలు, గురూంగులు అని అంటారు. హిందూ, బౌద్ధమతాలు రెండూ ఉన్నాయి. కాని హిందూగూర్ఖాల ప్రాబల్యం ఎక్కువ. రాజు నామమాత్రపు రాజే. రాణా లనబడే భూస్వాములదే అసలు అధికారమంతా. 1867లో రాణాలు తిరుగుబాటుచేసి, తమ వర్గానికి ప్రతినిధి నొకణ్ణి ప్రధానమంత్రిగా చేసి, అతని చేతిలో అధికారమంతా పెట్టారు. రాజాధికారం తగ్గిపోయింది. రాజవంశం హిందూ రాజపుత్రజాతికి చెందినది. మొన్న మొన్నటి దాకా ఉన్న రాజు పేరు మహారాజాధిరాజ త్రిభువన వీరవిక్రమజంగ్ బహదూర్ షా బహదూర్ షంషేర్ జంగ్ దేవ. ఆయన మరణానంతరం ఆయన కుమారుడు మహేంద్ర పట్టాభిషిక్తుడయ్యాడు. పట్టాభిషేకం ఈ సంవత్సరం మేలో జరిగింది.

## ఇటీవలి మార్పులు

భారతదేశంలో బ్రిటిష్‌ప్రభుత్వం అంతమైన తరవాత, నేపాల్‌లో కూడా అనేకంగా మార్పులు జరిగాయి. ప్రజాస్వామ్య వ్యవస్థకోసం ప్రజలు పోరాటం సాగించారు. ఈ పోరాటంలో భారతదేశం కూడా సహాయం చేసింది. మొత్తంమీద రాణాల నిరంకుశ పరిపాలన అంతరించింది. ప్రజాస్వామ్యానికి మార్గం ఏర్పడింది. త్వరలో ఎన్నికలు జరగబోతున్నాయి. 1950లో ఖాట్మాండులో విప్లవం లేవదీసిన ప్రజానాయకుడు డా॥ కె.ఐ. సింగ్ ఈ అక్టోబరులో ఢిల్లీ వచ్చినప్పుడు తన నేపాల్ యునైటెడ్ డెమొక్రాటిక్ పార్టీ ఈ ఎన్నికలలో పాల్గొంటుందని, భూమి సంస్కరణలు, జమీందారీల రద్దు, మొదలైన కార్యక్రమం తాము అధికారంలోకి వస్తే అమలు చేస్తామని చెప్పారు. ఈయన విప్లవం విఫలమైపోయిన తరవాత చైనా పారిపోయి మూడేళ్లపాటు అక్కడ తలదాచుకున్నారు. ఒకప్పుడు భారత జాతీయ కాంగ్రెసులో కూడా ఈయన సభ్యుడు. నేపాల్ నుంచి టిబెట్ ద్వారా నాలుగువేలమైళ్లు నడిచి ఈయన చైనా పారిపోయి, చివరకు తనంతటతానే చైనా విడిచి వచ్చివేశారు. నేపాల్ రాజు ఈయనకు క్షమాదానం చేశారు.

## భారత సహాయం

భారత, నేపాల్ దేశాల స్నేహాన్ని చాటిస్తూ 1950 జూలై అంతంలో ఒక ఒడంబడిక జరిగింది. నేపాల్ రేవు సౌకర్యాలు లేనిదేశం కనుక విదేశాలతో వర్తకానికి, భారతదేశంతో వర్తకానికి అనేక సౌకర్యాలు కలిగిస్తూ భారత ప్రభుత్వం అదే సమయంలో వాణిజ్య ఒడంబడికకూడా చేసుకున్నది.

ప్రస్తుత నేపాలీ ప్రధాన మంత్రి శ్రీ టంకప్రసాద్ ఆచార్య గత అక్టోబరులో చైనా కూడా వెళ్లి వచ్చారు. మూడేళ్లలో 6 కోట్ల రూపాయలు నేపాలుకు సహాయం చేయడానికి చైనా నిశ్చయించింది. ఈ సహాయం నేపాల్ ప్రారంభించిన మొదటి పంచవర్ష ప్రణాళికకు దోహదం కాగలదు. ఈ ప్రణాళికకు భారతదేశంకూడా ఆర్థిక సహాయం చేస్తోంది. నేపాల్ ప్రణాళిక వ్యయం 33 కోట్ల రూపాయలని అంచనా. భారతదేశం తానిచ్చే సహాయం ఎక్కువ చేయడానికి కూడా అంగీకరిస్తుందని తెలుస్తోంది.

## సిక్కిం

ఉత్తరాన, ఈశాన్యమూలన టిబెట్, ఆగ్నేయంగా భూటాన్, దక్షిణాన డార్జి

లింగ్ జిల్లా, పడమట నేపాల్ ఉన్న సిక్కిం చిన్న హిమాలయ రాజ్యం టిబెట్‌లోని చంబీలోయకు వెళ్లడానికి సిక్కిం గుండానే వెళ్లాలి ప్రజల్లో భూటియాలు, నేపాలీలు, లెప్చాలు ఉన్నారు. వీరి సంఖ్య మూడు లక్షలు హిందూ, బౌద్ధమతాలు రెండూ ఉన్నాయి. విస్తీర్ణం 2,800 చ మైళ్లు

సిక్కిం రాజవంశం పూర్వీకులు తూర్పు టిబెట్ నుండి వచ్చినవారని చెబుతారు 18 వ శతాబ్దం అంతంలో గుర్ఖలు ఈ దేశం మీదికి రెండుసారు దండెత్తారు 1814 లో నేపాల్‌కు, బ్రిటన్‌కు యుద్ధం జరిగినప్పుడు సిక్కిం రాజు బ్రిటనుకు సహాయం చేశాడు యుద్ధం తరవాత సిక్కింకు బ్రిటను కొంత భూభాగం ఇచ్చింది సిక్కింకు చెందిన డార్జిలింగ్ ప్రాంతాన్ని బ్రిటిష్ వారు తీసుకుని ఏటా 12 వేల రూపాయలు రాజుకు ఇచ్చేవారు 1906 నుండీ సిక్కింపై బ్రిటిష్ ప్రభుత్వమే అజమాయిషీ వహించింది ఈ రాజ్యం ఆదాయం ఏడాదికి 6 లక్షలు ఉంటుంది దీని ముఖ్య పటణం గాంగ్‌టక్.

భారతదేశం స్వాతంత్ర్యమైన తరవాత మూడేళ్లకు 1950 డిసెంబరులో సిక్కింతో కొత్త ఒడంబడిక జరిగింది దీని ప్రకారం ఆంతరంగికపరిపాలనలో సిక్కిం స్వతంత్రంగానే ఉంటుంది కాని మిగతా అన్ని విషయాలలోనూ అది భారతదేశపు రక్షిత రాజ్యంగానే ఉంటుంది అంటే సిక్కిం రక్షణ బాధ్యత భారత దేశానిదే

భారతదేశం తన స్వంత రక్షణకు అవసరమైన చర్యలన్నీ సిక్కిం లోపలగాని, బయటగాని తీసుకోవచ్చు సిక్కిం లోపల ఎక్కడైనా సరే తన సేనలను ఉంచుకోవచ్చు సిక్కిం ప్రభుత్వం భారతప్రభుత్వ అనుమతి తీసుకోకుండా ఎక్కడించీ ఆయుధాలు దగ్గరా తెచ్చుకో గూడదు విదేశాలతో ఏ సంబంధమూ పెటుకో గూడదు రెండు దేశాల మధ్య వర్తకం స్వేచ్ఛగా జరుపుకోవచ్చును సిక్కింలో భారత ప్రభుత్వం రోడ్లు, రైలుమార్గాలు, విమానాశ్రయాలు, టెలిగ్రాఫు మొదలైనవి నిర్మించుకోవచ్చు సిక్కింకు ఏటా మూడు లక్షల రూపాయలివ్వడానికి కూడా భారత ప్రభుత్వం అంగీకరించింది

బుద్ధజయంతి సందర్భంలో భారతదేశానికి సిక్కిం మహారాజా రావడంతో ఉభయదేశాల సంబంధాలు మరింత దృఢపడుతున్నాయి

## భూటాన్

18 వేల చదరపు మైళ్లు విస్తీర్ణం, మూడు లక్షలమంది జనం కలిగిన భూటాన్ భారతదేశపు ఉత్తర సరిహద్దుల్లో హిమాలయాలలో ఉన్న మరొక చిన్న రాజ్యం ఇక్కడ హిందువులు, బౌద్ధులు కూడా ఉన్నారు ముఖ్యపట్టణం పునఖా 1865 లో కొన్ని సంఘర్షణలు జరిగాక బ్రిటిష్ ప్రభుత్వం భూటాన్‌తో సంధి చేసుకుంది 1910 లో మరొక ఒడంబడిక జరిగింది దీని ప్రకారం బ్రిటిష్ వారు ఏటా లక్ష రూపాయలు భూటాన్ కివ్వడానికి, ఆంతరంగిక పరిపాలనలో ప్రమేయం పెట్టుకోకుండా ఉండడానికి అంగీకరించారు విదేశ వ్యవహారాలు మాత్రం బ్రిటిష్ ప్రభుత్వానికి అప్పగించబడ్డాయి

భూటాన్‌కు ఇద్దరు రాజులుండేవారు ఒకని పేరు ధర్మరాజా ఈయన బుద్ధుని అవతారమేనట టిబెట్‌లోని బుద్ధావతారాలకంటే ఈ అవతారమే గొప్పదని భూటాన్ ప్రజలు నమ్ముతారు ఒక ధర్మరాజా చనిపోగానే ఒకటి రెండేళ్లు ఆగి మళ్లీ అవతారం ఎత్తుతాడు అయితే అతడు ఎప్పుడూ భూటాన్ రాజవంశంలో మాత్రమే జన్మిస్తాడు. ధర్మరాజా మత విషయాలన్నిటికీ అధికారి రాజ్యాంగానికి అధినేత అయిన రాజును దేవ రాజా అంటారు 1907 నుంచీ వారసత్వపు హక్కు కలిగిన మహారాజ చేతిలోనే అధికారమంతా ఉంటోంది భారతదేశం స్వతంత్రమైన తరవాత పూర్వపు సంబంధాలనే బలపరుచుకుంటూ ఉభయ దేశాలు ఒప్పందం చేసుకున్నాయి

భూటాన్ బాగా వెనకబడిన ప్రాంతం దేశమంతా వెతికినా బళ్లుగాని, సైకిళ్లుగాని కనిపించవు కంచర గాడిదలమీద పోవాల్సిందే ఎక్కడికైనా, ఎలక్ట్రిసిటీ, రోడ్లు, ఫాక్టరీలు, పరిశ్రమలు, సినిమాలు వగైరాలు ఊహించరాని విషయాలు అన్నీ పల్లెలే రాజ్యంలో ఏ మూలనైనా అలజడి జరిగితే రాజధానికి కబురందడానికి రెండు నెలలు, వరదలు వస్తే 6 నెలలు పడుతుంది ఈ కాలంలో మరొక విచిత్రమేమంటే సైన్యమంటూ లేదు ప్రస్తుతపు రాజు పేరు డ్రుక్ గ్యాల్పో జిగ్మె వాంగ్‌చుక్ వయస్సు 27 సంవత్సరాలు ఈయనకు 8 మంది మంత్రులు, 125 మంది ఉద్యోగులు, కొందరు భవన రక్షకభటులు ఉంటారు జిగ్మెదోర్జీ (37 సం॥) అనే ఆయన ముఖ్యసలహాదారు ఈయన కొక్కడికే బాగా ఇంగ్లీషు వచ్చు ఈయన రాజుగారి బావమరది "ఇప్పుడిప్పుడే మా దేశంలో ప్రజాస్వామ్య బీజాలు చల్లుతున్నాము" అని ఈ మధ్య ఈయనొకసారి అన్నారు. భూటాన్ బయటి ప్రపంచంతో సంబంధం పెట్టుకోవడం ఈయనకి అంతగా ఇష్టం లేదు "భూటాన్ ప్రజల్లో నూటికి 98 మందికి ఎవరి పొలాలు వారికున్నాయి విదేశీ సహాయం తీసుకోవడం మొదలు పెట్టామంటే భారతదేశమో, చైనా దేశమో మా దేశంలోకి వచ్చి తిష్ఠ వెయ్యవచ్చు, మేము బానిసలం అయిపోవచ్చు," అని ఆయన అంటారు

కాని ఆధునిక నాగరికత భూటాన్‌లోకి చొచ్చుకుపోయే సూచనలిప్పుడిప్పుడే కనిపిస్తున్నాయి కొద్దికొద్దిగా విద్య వ్యాపిస్తోంది "ఈరోజుల్లో ఎంతకాలమని మ్యూజియం వస్తువులుగా ఉండిపోగలం?" అని జిగ్మె దోర్జీ ఈమధ్య ఒకసారన్నారు

నేపాల్‌తో ఉన్నంత సన్నిహిత సంబంధాలు భూటాన్‌తో లేకపోవడం భారత ప్రభుత్వానికి ఇబ్బందిగానే ఉన్నది భూటాన్ వైఖరి "ఇసుకలో తలదూర్చిన ఉష్ట్రపక్షి" మాదిరిగా ఉందని భారత ప్రధాని ఒకసారి అన్నారు ★






Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd , by S Radha krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1 Editor S Sambhu Prasad

Regd. No. M. 4479. Andhra Patrika Illustrated Weekly